# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూలై 1959

సంపుటము 36 : : సంచిక 7

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1959



## ఆగస్టు సంచికలో

# విశ్వనాథ మధ్యాక్కఱలు: శ్రీ గిరి శతకము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

త్రనివితీరఁగ నిన్ను రెండుచేతులఁ దాఁకఁగావచ్చుఁ
గనులఁదోవఁగవచ్చు నిన్నుఁగౌఁగింటఁ గ్రచ్చుకోవచ్చు
నునికి నున్నట్లుగా వచ్చి మడి లేకయును గొల్వవచ్చు
సునిశితబుద్ధి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అప్రౌఢి నింద్రియంబులు వడిగ నింద్రియార్థంబులందు
నా ప్రయత్నము లేక సాగుచున్న వాగ్నయీ ప్రియాత్మ
నా ప్రార్థన ఫలంబు లగుత సర్వాఘ నాశనంబు నీదు
సుప్రసన్నతయు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఇప్పటి నాస్థితిచూడ నెడఁదలోఁ గోర్కులేమియు వెలికిఁ
గుప్పించి దూకెడు జాడ లేద మేన్కొన బర్వగాఁగ
నప్ప! యీహకు నందకుండఁ దెలియదయా జీవుఁడేమి
చొప్పగలాడో శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఇది తపోయోగ్యమా తనువు నాచేత నెత్తించలేదు
ఇది భోగయోగ్యమా తనువు నాచేత నెత్తించలేదు
మది భోగవాంఛ కన్పడదు వేఱుజన్మ తపఃక్షమమును
రొదమాలి యీవె శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

వేదాంతములలోని వేదములలోని విమలార్థచయము
వాదించు నాకైత వాని శత్రువై వరలు నీజగమ
నాది బంధుఁడ వీవు నిద్దఱుఁగూడ నన్ను వేర్పరుపఁ
బ్రోది నాకెచట శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అఖిల జాగ్రదవస్థయందు స్వప్నావస్థయందు
జీవుని యనుభవభేద మింతగాఁ జెందియు నొకఁడ
జీవాత్మ పరమాత్మ యట్లె భేదమ్ముచెందియు నొకఁడ
ప్రోవైన తెల్వి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అది యుత్తమము నీవు మధ్యమమును నే నధమమ్ము స్వామి
మదిఁ జిత్రమయ్యె నీ మధ్యమత యుత్తమత వంటిదయ్యె
నదిర నాయధమత నీదు మధ్యమతాంశ లేదాయె
సొద వేడు వినును శ్రీశైలమల్లికాగున మహాలింగ!

కనుమూసినంత నీ గర్భగుడిలోనఁ గన్పించుచుంటిఁ
గనఁగ నేనే నాకు నింద్రనీల లింగంబు ముంగలను
తనువు వంచి శిరంబు పానవట్టంబు దగ్గరఁ జేర్చి
సునిరతమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అట వ్రాలియున్నట్టు లభవ యూహించినప్పుడే నా సు
ఘటన నిత్యమ్ముగా నున్నదా మాయ భ్రమమ్ము నే నెఱుఁగ
నటులైన నీ నిత్యసన్నిధాన ధైర్యము వహించెదను
స్ఫుటము సేయఁగదె శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అటు వ్రాలియున్న వీపుపై నెందరభవ త్రొక్కుదరో
త్రుటినైన నొకభాధ కలిగినట్లుగాఁ దోచదు నాకు
నిటలాక్ష నీసన్నిధియును నీసేవ నెఱయు నేఁడి తఱి
చుట తోచనీదా శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

# ఎఱ్ఱన గ్రంథచోరుడా?

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

ఎఱ్ఱాప్రెగడ, అరణ్యపర్వశేషమును తాను రచించినట్లు చెప్పుకొన్నాడుగాని, అది సత్యము కాదనియు, ఆరచన నన్నయదిగాని ఎఱ్ఱనది కాదనియు, నన్నయ కృతిలో అందందు కొన్ని పదములు, పద్యములు; చిన్న చిన్న వచనపుముక్కలూ శిథిలములైయుండగా చూచి వాటిని పూరించి, ఆ భాగమంతయు తన రచనగా ఎఱ్ఱన తనపేర వేసుకొన్నాడనియు, అతడు గ్రంథచోరుడనియు, శిరోమణి శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారొక వ్యాసము వ్రాసియున్నారు. ఆవ్యాసము "ఆంధ్ర భారతి మహోపన్యాసములు" అను గ్రంథములో నున్నది.

## నన్నయ మూడుపర్వములు

" 'నన్నయ మూఁడుకృతులొనర్చె' నని తిక్కనయు, 'త్రిపర్వము లొనర్చె'నని తిక్కన శిష్యుడు మారనయు, 'ఆ మూఁడుపర్వములలో' ననిఅప్పకవియు ననియున్నారు గావున, నన్నయ అరణ్యపర్వమును గూడా రచించెననుట స్పష్ట"మని యాచార్యులవారి వాదము. మరియు వారు, "తిక్కన అబద్ధమాడెనా? పరిశీలించుచో నన్నయ మూఁడుపర్వములు రచించె నను తిక్కనవాక్యము పరమసత్యమేనని దృఢపడకపో"దనియు నన్నారు.

తిక్కన అబద్ధమాడనూ లేదు; నన్నయ మూడు పర్వములను రచించినాడని సాక్ష్యము చెప్పనూ లేదు. అది పొగడ్తమాట. అట్టిమాటను చరిత్ర చర్చావసరమున ప్రమాణముగా తీసికొనుట సరిగాదు.

ఎవరిని గురించియైనను మంచిగా చెప్పదలచుకొన్నప్పుడు, అతడు చేసినపని కొంచమైనను గొప్పగా చెప్పుటయు, చెడ్డగా చెప్పదలచుకొన్నప్పుడు, అతడు చేసినది ఘనకార్యమైనను, దానిని లాఘవపరిచి చెప్పుటయు మానవస్వభావము. అట్లే, నన్నయను ప్రశంసింపబూనిన తిక్కన, నన్నయ రచించినది, నిజానికి—ఇంచుమించు—రెండున్నరపర్వమేయైనను, మూడు పర్వములన్నాడు; "ఈషదైవమన్య మవివక్షితమ్" అన్నట్లుగా. అందు, అస్వాభావికతగాని, అసత్య దోషముగాని యేమీ లేదు.

తిక్కన ఆ ప్రశంసాపద్యములో, "నన్నయ భట్టు రెండుపర్వముల మూడాశ్వాసముల నూటనలభై రెండు పద్యముల రచించె" నని, నికరముగా లెక్క చెప్పనవసరము లేదు. అట్లు చెప్పుట సంప్రదాయమునూ కాదు. అంత వివరముగా చెప్పుట చరిత్ర వ్రాయునపుడే యావసరము.

సందర్భానుగుణముగా కవులు వాడు వాక్యములకు, కవి హృదయమును గమనించి మన మర్థము చెప్పుకొనవలెను. లేనిచో అనర్థమేర్పడును. ఇందుకొక్క తార్కాణము:

భాసకృతమైన 'ఊరుభంగ' రూపకములో, దుర్యోధనుడు బలరామునితో

"ప్రతిజ్ఞా వసితే భీమే గతే భ్రాతృశతే దివమ్,
మయిచైవం గతే రామ! విగ్రహః కిం కరిష్యతి?"(33).

అంటాడు.—"నా తమ్ములు నూర్గురును గతించిరి; నా స్థితి యిట్లుండెను; ఇంకను యుద్ధ మెందుకయ్యా?" అని దుర్యోధను డన్నమాట. గతించిన వారె నూర్గురైతే, దుర్యోధనునితో ధార్తరాష్ట్రులు నూటొక్కరు కావలసివచ్చును గదా? అగుదురా?

ఎన్నటికిని కారు. ధృతరాష్ట్రుని కొడుకులు నూర్గురే. గతించినవారు తొంభై తొమ్మిదిమందే. అయితే 'శత' శబ్దమెందుకు వాడబడినది అంటే, అది దుఃఖభార సూచకము. అంతేకాని, అక్కడ 'శతము' నకు 'నూ' రన్న సంఖ్యార్థము ప్రధానము కాదు. అది లెక్క చెప్పు సమయము కాదు. కావ్య భాషా సంప్రదాయమును, మానవ మనస్తత్వమును, వ్యవహార సందర్భమును, గుర్తింపగలిగిన బుద్ధిమంతులీ యర్థమునే గ్రహింతురుగాని, "భాసు డబద్ధమాడెనా? ధృతరాష్ట్రుని కొడుకులు నూటొక్కరే అయ్యుండవలెను; పరికిలించుచో భాసుని వాక్యము పరమసత్యమేనని దృఢపడకపోదు" అనరు.

అంతదూర మెందుకు; తిక్కనయే, అర్జునుని 'కుంతీసుత మధ్యము' డనెనే! దాని సంగతి యేమి? తిక్కన అన్నాడుగనుక, పాండవు లైదుగురును కుంతీ సుతులే ననియు, అర్జునుడు వారిలో మధ్యముడనుట పరమ సత్యమనియు మన మనుకొనవలసినదేనా? ఆచార్యులవారైనను అనుకొందురా?

తిక్కన లోకమర్యాదగా నన్నయమాటను పట్టుకొని "నన్నయ మూడుపర్వములు రచించె ననుట స్పష్టము" అని వాదించుట సరిగాదు.

ఇక మారననూట:—తన గురువైన తిక్కన "మూడు కృతులొనర్చె" నన్నాడు గనుక, మారన, తాను నట్లే "త్రిపర్వము లొనర్చె" నన్నాడు. అందు విశేష మేమున్నది?

పోతే, మిగిలినది అప్పకవి వాక్యము:—అప్పకవి, 'నన్నయ మూడు పర్వములు రచించి నా'డనియే కాదు; 'ఎఱ్ఱన అరణ్యపర్వశేషము రచించినా' డనియు, 'అంచలి మొదటిపద్యము స్ఫురదరుణాంశు అను ప్రారంభముగల' దనియును చెప్పినాడు. రెండు వాక్యములలోను, మనము గ్రహింపదగినది యేది? మొదటిది, తిక్కన మారనలవలెనే మామూలుగా నన్నది. రెండవది, విషయ నిర్ధారకమైనది. ఈ రెండవ వాక్యమే, అరణ్యపర్వ శేష రచనా విషయమున ప్రమాణముగా తీసికోదగినది:

ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషమును రచించినట్లు చెప్పినవాడు అప్పకవి యొక్కడే కాదు. అట్లు చెప్పినవా రెందరో యున్నారు చూడండి.—

(1) జక్కనకవి, తన విక్రమార్క చరిత్రలో
"ఈ త్రయిందాఁ బ్రబంధ పర
మేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున
శేషము..............."

అన్నాడు. 'విరచించె' ననగా "శిథిల భాగములను పూరించె" నని యర్థము కాదుగదా!

(2) ఎఱ్ఱన మనుమడు చదలువాడ మల్లయ్య, విప్రనారాయణ చరిత్రలో
సీ॥ "ప్రతిభతో నారణ్య పర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవుల పండువులు గాఁగ"

అన్నాడు. 'చెప్పుట' యనగా 'రచనచేయుట' గాని, 'శిథిల భాగములను పూరించుట' కాదు. ("విజ్ఞానేశ్వరము జగతి వెలయఁగఁ జెప్పెన్" అని కేతన ప్రయోగము.)

(3) శంకరకవి—'హరిశ్చంద్ర' కర్త,
క. "విమల కవిత్రయ నిర్మిత
సమధిక రసవత్ప్రబంధ సాహిత్య కళా
సుమన స్తటినీ కల్లో
లములం గ్రీడింతు నిష్కళంక ప్రతిభన్."

అన్నాడు. ఇందు ప్రబంధ శబ్దము 'పర్వ' బోధకము. భారతములోని ఒక్కొక్క పర్వ మొక్కొక్క ప్రబంధముగా పరిగణనము. కావున పదునెనిమిది పర్వములు కవిత్రయ నిర్మితములని శంకరకవి రచన కర్థము. అంతేగాని, ఇద్దరిచేత రచింపబడి, ఒకరిచేత శిథిల భాగపూరణము చేయబడిన పర్వములని యర్థము కాదు.

(4) రాధామాధవకవి—ఎల్లనార్యుడు,
"భారత కావ్యహార మొక
భాగము నన్నయభట్టొనర్చె ము
క్తారమణీయ వాక్యములఁ
దక్కిన భాగము సోమయాజి సొం
పార నొనర్చె, రెంటఁ గల
యన్ శివదాసుఁడు మధ్యనాయక
శ్రీ రచియించె శారద ధ
రింపఁ గవిత్రయ కీర్తి మించఁగన్."

అని భారతమున పూర్వభాగము నన్నయయు, ఉత్తర భాగము తిక్కనయు, మధ్యభాగమును ఎఱ్ఱాప్రెగడయు రచించినట్లు స్పష్టముగా చెప్పినాడు.

ఇట్లు ప్రామాణికులైన పూర్వకవులు పలువురు, ఎఱ్ఱన, ఆరణ్య పర్వశేషమును రచించినాడని చెప్పియుండగా, ఈనాడు శ్రీ తిరు వేంకటాచార్యులవారు "ఎఱ్ఱన శిథిలభాగపూరకుడే గాని, రచయిత కా" డనిన చెల్లునా! ఇది యేటి కెదురీదుట కాదా!

ఆ భాగమును ప్రెగడయే రచించినా డనుటకు ఇతరుల సాక్ష్య మనవసరము. పర్వాంతమున

ఎ. గీ. "ఎఱ్ఱనార్యుండు సకలలోకైక విదితుఁ
డయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజనహర్ష సిద్ధిఁ గోరి."

క. "ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంతదోఁప దద్రచనయకా
నారణ్య పర్వశేషము
పూరించెఁ గవీంద్ర కర్ణపుట పేయముగన్."

అని యెఱ్ఱనయే చెప్పికొనియున్నాడు. (అయితే ఆ చెప్పిన పద్ధతి, మరియొకడు చెప్పినట్లున్నది. అట్లు చెప్పుట నన్నయను చూచియే. ఎఱ్ఱన రచనకు నన్నయ భట్టు రచన ఒరవడి. ఇది విషయాంతరము. తరువాత చర్చకు వచ్చును.)

ఎఱ్ఱన స్వయముగా చెప్పిన విషయమునకు, మరియొకరి సాక్ష్యముతో జరూరు లేదు. కాని, ఆచార్యుల వారు తమ వాదముకొరకు పై రెండు పద్యములకును విపరీతార్థములు చేసి "ఎఱ్ఱన, శిథిలాంశపూరకుడనియే యీ పద్యములలోని తాత్పర్య" మన్నారు. అది శోచనీయమైన విషయము. పద్యముల నన్వయించుటలోను, పదముల కర్థములు చెప్పుటలోను వారు, పండితుల రుచితముగాని 'పంథా'లో పోయినారు. ఆ విమర్శ యిక్కడ తెములునది గాదు. అంగుళమంత వదలి వేసినాను. ఇచ్చట చెప్పవలసిన ముఖ్య విషయ మొకటియున్నది. అది యేమనగా ఎఱ్ఱాప్రెగ్గడ తనకును, ఆరణ్య పర్వశేష ప్రారంభపద్యమైన 'స్ఫుర దరుణాంశు' నకును అక్షర చక్రము చూచుకొన్నాడట. అప్పకవియే చెప్పినాడు. (చూ. అప. 2.304)

అక్షరచక్రము చూచుకొనుట గ్రంథరచనకు పూనుకొను వారి పనిగాని, యితరుల గ్రంథములో లుప్తములైన, అనగా శిథిలములైన పద పద్యాదులను పూరించువారి పని కాదు. కాబట్టి ఎఱ్ఱన చేసినది ఆరణ్య పర్వశేష రచనగాని, శిథిలపద పూరణము కాదు. అందుకీ సాక్ష్య మొక్కటి చాలదా!

## వింత ప్రశ్నలు

నన్నయభట్టు ఆరణ్యపర్వమును గూడా పూర్తిగా రచించినాడని సిద్ధాంతము చేయవలెనన్న పట్టుదలతో ఔచిత్యానౌచిత్యములను సైతము పాటింపక ఆచార్యులవారు కొన్ని వింత ప్రశ్నలు చేసియున్నారు. వ్యాసవిస్తరభీతి చేత ఒక మూడింటిని గూర్చి మాత్రమే ముచ్చటించుచున్నాను.

"తిక్కన, విరాట పర్వారంభమున, 'పరమ పవిత్రులగు పాండుపుత్రుల చరితం బుపాఖ్యాన సహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచుండ వారల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయున కిట్లనియె' నని వెనుకటికథతో యోజించినాడు. అరణ్య పర్వములో సగముపై చిల్లర వ్రాయబడకుండ లేని, పాండవుల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా వినుటెట్లు కుదురును? అది వ్రాయబడనిదే జనమేజయు డెట్లు వినును?" అని వారి ప్రశ్న.

ప్రశ్న వింతగా లేదా! వైశంపాయనుడు జనమేజయునకు పాండవుల వనవాస వృత్తాంతమును చెప్పుటకు నన్నయరచనతో పనియేమి? నన్నయ్య ఆ భాగమును గూడా రచించినాడే యనుకొందము. జనమేజయుడు విన్నది నన్నయ రచన నేనా? అట్లు వినుటకు అరచన యెప్పటిది? జనమేజయుడెప్పటి వాడు? నన్నయ రచనా నంతరము గూడా జనమేజయ వైశంపాయనులున్నారనియు, ఆరాజున కాబుుషి నన్నయ్య గ్రంథము చదివి పురాణము చెప్పినాడనియునా ఆచార్యులవారి భావము? వారి దృష్టిలో వైశంపాయనుడు తెనుగు పండితుడు గాబోలు!

"నన్నయ యాభాగమును రచింపలేదని కదా వాదము. ఎఱ్ఱన, యప్పటికి—అనగా తిక్కన విరాట పర్వము రచించునాటికి పుట్టనే లేదు గదా! పాండవుల వనవాస కథను జనమేజయునకు దెల్పున నెవరు తెల్పిరి?" అని వారి మరియొక ప్రశ్న.

"జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె" అని తెలుగు భారతములోనుండుట చూచి, ఆరాజున కా ముని, ఆ కథను తెలుగులో చెప్పినట్లు శ్రీ వారు భావించినారు: పొరపాటు. అరవ భారతములోను, కన్నడ భారతములోను గూడా అట్లేయుండునుగదా! మరి అప్పుడో?

వనవాస కథ నే కాదు, పాండవుల యొల్ల కథలను, తిక్కన సర్వగాథలను, కొన్ని వేల యేండ్ల క్రిందట జనమేజయునకు వైశంపాయనుడు తెల్పియున్నాడు. అంతేగాని, విరాటపర్వము రచించు నాటికే కాదు, ఈ నాటికిని ఆకథను ఆ రాజునకు తెల్గులో తెల్పిన వారెవ్వరును లేరని ఆచార్యులవారికి నామనవి.

విరాట పర్వాదిలో నర్జునుడు ధర్మరాజుతో
"ధర్మదేవత నీకు సత్కార్యమునకు
మెచ్చి యెంతయుఁ బ్రీతిమై నిచ్చినట్టి
వరము గలుగంగ మన మేమి వర్తనమున
నెచటనున్నను నొరులకు నెఱుగనగునె?"

అనెను. ఈ వరప్రదానకథ ఆరణ్య పర్వములో చిట్ట చివర నున్నది. అభాగము రచితమే కానిచో ఆ కథను ఈ విరాటపర్వములో పేర్కొనుట యెట్లు సందర్భించును?" అని యింకొక ప్రశ్న.

ఇదియు నొక ప్రశ్నయేనా ? మూలములో ఈ క్రింది శ్లోకమున్నది.

"తస్మిన్ వరదా నేన
గర్భస్య మనుజాధిప,
అజ్ఞాతో విహరిష్యామో
నరాణాం నాత్ర సంశయః."

శ్లోకములోని భావమును, తిక్కన తెనుగుపద్యములో చెప్పినాడు. అందుకు, అరణ్యపర్వము రచితమై యుండ వలసిన అక్కరయేమో నాకు బోధపడ లేదు.

ఇట్టి ప్రశ్నలింకనుగలవు. వాటినన్నిటిని తడవుట ప్రాస్తుపోనిపని యనిపించి యుపేక్షించితిని.

శ్రీవారిట్టి ప్రశ్నలతో నన్నయ మూడు పర్వములు రచించినాడనియు, ఎఱ్ఱన గ్రంథచోరుడనియు సాధింప గడగుట, ఇసుకతో దారము పేనబూనుట వంటిదని నా యభిప్రాయము.

ఎఱ్ఱన, భారతభాగమును రచించుట చేత నే భారతకవులు ముగ్గురై 'కవిత్రయ'మన్న ప్రసిద్ధి వచ్చినది. ఆచార్యులవారా ప్రసిద్ధిని తప్పించి 'కవిద్వయ' మని పింప దలచినారు. అది తలకూడని తలపు.

## వ్యంగ్యార్థ వాచ్యార్థములు

"స్ఫురదరుణాంశు రాగరుచిఁ
బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దిశాతతుల
నైర్మల్య జృంభణ ముల్లసిల్లను
ద్ధురతర హంససారస మ
ధువ్రత నిస్స్వనముల్ సెలంగఁగా
గరము వెలింగె వాసర ము
ఖంబులు శారదవేళఁ జూడఁగన్"

(అరణ్య. 4. 143)

ఈ పద్యానికి వాచ్యార్థము గాక, వ్యంగ్యార్థ మొకటి యున్నదన్నారు ఆచార్యులవారు. వారు రెండర్థములను సంగ్రహముగా ఇట్లు సెలవిచ్చినారు.

"స్ఫురదరుణాంశు-అను పద్యము, శబ్దశక్తి మూలకమగు వ్యంజనావ్యాపారమున, ఇక్కడినుండి ఎఱ్ఱన కవిత్వమని తెల్పుటయే గాక, ఎఱ్ఱన శిథిలాంశములను పూరించినవాడన్న సంగతిని గూడ వ్యంగ్యముగా తెల్పుచున్నది. అరుణాంశు=సూర్యుడు, నీరదావరణములను తొలగించినాడని వాచ్యార్థము.

"అరుణాంశు=ఎఱ్ఱన, నన్నయ పద్యములకు పట్టి చెదలు దులిపినాడని వ్యంగ్యార్థము.

"కొన్నిచోట్ల వ్యంగ్యము 'మానిషాద' శ్లోకములో వాల్మీకికివలె వ్యంగ్యము వివక్షితము కాకనే, అనకియుగానే ప్రవర్తిల్లును. ప్రకృత స్థలములో 'అరుణ' పదము 'ఎఱ్ఱన'ను వ్యంగ మొనర్చుటలోను విప్రతిపత్తి లేదుగదా! అప్పకవియు నీ వంకకే మొగ్గుచున్నాడు. ఇక నీ 'స్ఫురదరుణాంశు' అనుచో మేము నిరూపించినట్లు వ్యంగ్య ముండుననుటలో విప్రతిపత్తియేల ? ఈ వ్యంగ్యార్థము ఇదివరలోనివారు గమనింపలేదు. మేము దానిని సక్రమముగా నిరూపించితిమి. ఇంతమాత్రమున సరి లేకపోవునా ?"

అని వారు సెలవిచ్చిన వాక్యములు. ఇక, వారి రెండర్థములను మనము విచారింపవలసియున్నది. ప్రధానమైనది వాచ్యార్థముగనుక ముందు దానినే విచారింతాము.

వాచ్యార్థము: (1) వాసర ముఖములను— అనగా ఉదయవేళలను, నీరదములు (=మేఘములు) ఆవరించియున్నట్లును, సూర్యుడుదయించి వాటిని తొలగించినట్లును, అప్పుడు వాసరముఖములు వెలింగినట్లును వారర్థము చెప్పినారు. కాని, ఆ యర్థము సరియైనదికాదు. కారణమేమనగా:

అవి శారదవేళలు. అనగా అది శరత్కాలమన్న మాట. పద్యము శరదృతు వర్ణనము. శరదృతువులో మేఘము లుండవు. వర్షామేఘములు తొలగిపోవుటయు, సూర్యచంద్రులు—నిర్మలముగా ప్రకాశించుటయు శరల్లక్షణములు. ఇది జగమెల్ల నెరిగిన సంగతే. కాబట్టి గ్రంథప్రమాణము చూప నవసరములేదు. లేకపోయినను పండితులతో వ్యవహారము గనుక సప్రమాణముగనే చెప్పవలెను. లేకున్న వారొప్పుకొనరు. కావున నా మాటకు ప్రమాణములు చూపుచున్నాను.

1. చంపూ రామాయణము: "తథా దుర్దినాపాయే లంకాయామపి రాజహంస నిశ్శంక సంచారో భవిష్యతీతి మత్వా కిల భూమ్యామపి సమజని రాజహంస నిశ్శంక సంచారః" (కిష్కిం. 70)

"తథా దుర్దినానాం మేఘచ్ఛన్న దివసానాం రావణ వధావధిక దుష్ట దివసానాంచ అపాయే అపగమే సతి. ఏకత్ర శరదాగమవశా దన్యత్ర శ్రీరామ విక్రాంతి వశాచ్చేతి భావః. లంకాయాం రాజహంసయో శ్చంద్ర సూర్యయో స్తథా రాజహంసానాం శ్రీరామాది రాజశ్రేష్ఠానాం... నిశ్శంక సంచారః భవిష్యతీతి..." (వ్యాఖ్య)

2. రఘువంశము :

"నిర్వృష్టలఘుభిర్మేఘై,
ర్ముక్తవర్త్మా సుదుస్సహః,
ప్రతాప స్తస్య భానోశ్చ,
యుగప ద్వ్యానశే దిశః" (4.15)

3. ఆంధ్ర భాగవతము : "జీవనంబులు విడిచి విమల జ్ఞానవశంబున ముక్తులగు పుణ్యపురుషులంబుల చెన్నున వన్నువదలి మిన్నువిడిచి వాయువశంబులై వెల్లి విరిసిచను మేఘంబులును, మేఘపటల రహితంబును, కలశభవముని సహితంబును నై విజ్ఞానదీప విలసితంబగు యోగి హృదయంబు చందంబున శుభ్రంబైన యభ్రంబును గలిగి... ధరణికిం దోషవగుచు శరత్కాలంబువచ్చె" (10. పూ. 765)

శరత్కాలమున మేఘము లుండవనుట కీప్రమాణములు చాలవా?

చెప్పుచున్నాను; 'స్ఫురదరుణాంశు' పద్యము క్రిందనే శరన్మేఘ విరోధమును దెల్పు ఈక్రింది పద్యమున్నది.

"దానాంభః పటలంబునం బృథుపయో
ధారావళిం దాల్చి గ
ర్జా నిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్ర
చ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూ
ఢాకారతన్ డగ్గనాఁ
గా నొప్పారె మదోత్కట ద్విరద సం
ఘంబుల్ వనాంతంబునన్."

ఇది అడవి యేనుగుల వర్ణనము. ఆ యేనుగులు శరదాగమమున మదమెక్కి (ఆ ఋతువున నేనుగులకు మదమెక్కుట సహజము) శరద్భయముచేత మారు రూపములుతాల్చి క్రిందికిదిగిన మేఘములో యన్నట్లున్నవని వర్ణనము. (ఉత్ప్రేక్ష.) మేఘములు శరదృతువునకు భయపడినట్లును, మారురూపములతో దిగినట్లును ఉత్ప్రేక్షించుటకు కారణమేమి? అది మేఘములు రాదగిన కాలము కాదుగనుకనే.

ఇట్లు, ఈ పద్యమున శారదవేళకును మేఘములకును విరోధముం జెప్పిన ఎఱ్ఱాప్రెగడ, దీని పైపద్యమున వాసరముఖములు నీరదావృతములై యున్నవని చెప్పియుండునా ? ఆచార్యులవారు తప్పుగా అర్థము చేసికొన్నారేగాని, ఎఱ్ఱన అట్లు చెప్పలేదు. శారదవేళ యందు, (ఋతుస్వభావముచేత) నిరస్త నీరదావరణములైయున్న వాసరముఖములు, స్ఫురదరుణాంశు రాగ రుచిచేత, పాంపిరిపోయి (=అతిశయిల్లి), వెలింగెను-అని

ఆ పద్యమునకున్న యర్థము. వాసరముఖములు నీరదావృతములై యున్నట్లు ఆచార్యులవారు చెప్పుట పొరపాటు. వారు మూలమును చూచియున్నను, ఈ పొరపాటు జరిగియుండెడిది కాదు. ఇది మూలము :

"విమలాకాశ నక్షత్రా శర త్తేషాం శివా భవత్,
దృశ్యంతే శాంతరజసః క్షపా జలద శీతలాః,
గ్రహనక్షత్ర సంఘైశ్చ సోమేనచ విరాజితాః"

(2) వారు, "నీరదావరణమును సూర్యుడు తొలగించినా" డన్నారు. అదియును పొరపాటే. పొరపాటుకాదు; అది ప్రకృతి విరుద్ధమైనమాట. సూర్యుడప్పుడప్పుడు మేఘములచేత ఆవరింపబడుచుండుట కలదుగాని, యితరవస్తువుల నావరించిన మేఘములను సూర్యుడు తొలగించుట లోకములోలేదు. తన్ను గ్రసించిన మబ్బులనే తొలగించుకొనలేనివాడా, వాసరముఖముల నగ్గ్రసించిన మబ్బులను తొలగింపగలడా? నీరదావరణమును నిరస్తముచేయగలవాడు వాయువుగాని సూర్యుడు కాడు. కావున ఆచార్యులవారు చెప్పిన యర్థ మొప్పదు.

ఇది యిట్లుండగా "తమస్సుచే నావరింపబడి విచ్ఛిన్నప్రాయములైన పగళ్లను నిరస్తనీరదావరణములనుగా సరిగా సమన్వయించి ...... దిద్దగలిగినది యరుణుడుగాక మరెవ్వడు ?" అని శ్రీవారు సవాలొకటి చేసినారు.

ఈ ప్రశ్న సరియైనదిగా నాకు తోచలేదు. పగళ్లను తమస్సు ఆవరించితే, అరుణుడు ఆ తమస్సును గదా నిరస్తము చేయవలసినది. దానిని వదలి, నీరదావరణమును నిరస్తముచేయుట యెందుకు ? అదేనా సమన్వయించి సరిదిద్దుట ?

అసలు తమస్సేమి ? పగళ్ల నావరించుటేమి ? తమస్సనగా చీకటి గదా ! చీకటి పగటి నాక్రమించునా ? పగటిని చీకటియు, రాత్రిని వెలుగును ఆక్రమించునని యనువారుగాని, అనుకొనువారుగాని ప్రపంచమున నున్నారా ?

ఎందు కెక్కువమాటలు? పగలు సూర్యుడుండును గావున చీకటి తలచూపదు. సూర్యు డస్తమించిన పిమ్మటనే చీకటివచ్చుట. అప్పుడది రాత్రి. పగలు చీకటియుండదని పసివాండ్లును ఎరుగుదురు. అందుకు ప్రమాణములెందుకు ? కావలెననువారికి కవుల రచనలు కొల్లగా నున్నవి. అందొక్కటి మాత్రమే యుదాహరించుచున్నాను.

ఆ. "అంధకారమెల్ల నద్రిగుహాంతర
వీథులందు పగలు వెఱచి డాఁగి
యెడరువేచి సంధ్య నినుఁడు వృద్ధతినున్న
వెడలె వనగుహలు వెడలెఁ గరులు"

(భాగ. 8.27)

ఆచార్యులవారి సవాలు సరియైనది కాదనుటకు ఈ భాగవత పద్యమొక్కటి చాలదా? ఇంతటితో ఈ విషయమును వదలివేతాము.

ఇప్పటికి జరిగిన యీ చర్చలలో ఏమి తేలినది? శారద వేళ, వాసరముఖములు నీరదావృతములైనవనియు, ఆ నీరదావరణమును సూర్యుడు తొలగించినాడనియు ఆచార్యులవారు చెప్పిన వాచ్యార్థము తప్పని తేలినది.

ఇక వారి వ్యంగ్యార్థము మాట యేమి? వాచ్యార్థము తప్పైన తర్వాత, దాని ననుసరించి పుట్టిన వ్యంగ్యార్థ మొప్పగునా? వాచ్యార్థము గోడ; వ్యంగ్యార్థము దానిమీది చిత్తరువు. గోడయే కూలినది. ఇక చిత్తరు వెక్కడ? దాని విచారణ యేల?

కాని, ఆ యబద్ధపు వ్యంగ్యార్థకల్పనలో శ్రీ వారు చేసిన సిద్ధాంతములు చిత్రాతిచిత్రములైనవున్నవి. విమర్శకులు విచారింప దగినవి; విని వినోదింప దగినవియును. కావున (మట్టసముగనే) మనవిచేసెదను.

## వ్యంగ్యార్థము

"అరుణ - యనగా 'ఎఱ్ఱన' యనికదా! సూర్యవాచకము పై శబ్దము తన నానార్థశక్తివలన 'ఎఱ్ఱన' యని వ్యంగ్య మొసగును" అని వారి వాక్యము.

"అరుణ-యనగా ఎఱ్ఱన" అనుట కాధార మేమి? సూర్యవాచకమైన 'అరుణ' శబ్దమునకు 'సంచరించువాడు' అని యర్థము. 'ఎఱ్ఱనివాడ'ని కాదు. (ఇయర్తి గచ్ఛతీత్యరుణః - అని వ్యుత్పత్తి.) ఎఱుపు ఆ శబ్దములోనే లేనపుడు - అది, 'ఎఱ్ఱన' అని యెట్లు వ్యంగ్యమొసగును?

'అరుణ' పదమును (ఎఱుపు-అని) గుణవాచకముగా తీసికొన్నచో 'అరుణుడు = ఎఱ్ఱనివాడు' అని యర్థమగును. కాని, ఆ యెఱ్ఱనివాడు 'ఎఱ్ఱన' యను పేరుగల వ్యక్తి కాడు. ఆ రంగుగలవాడగును. ఎఱ్ఱనివాడగుటచేతనే 'ఎఱ్ఱన' యను పేరువచ్చినదని వాదమేని, 'ఆ పేరుగల వారందరును ఎఱ్ఱనివారే' ననవలసి వచ్చును.

ఎఱ్ఱనలు గ్రంథములలోనే యెందరున్నారో చూడండి:— (1) భాగవత షష్ఠస్కంధకర్తయైన యేర్చూరి సింగయకవి వంశస్థుడు 'ఎఱ్ఱనప్రెగడ'. (2) కొక్కోక గ్రంథకర్త 'ఎఱ్ఱన.' (3) దగ్గుపల్లి దుగ్గనకవి యన్న 'ఎఱ్ఱన'. (4) 'ఎఱ్ఱమ్మ'యు నున్నది. (దుగ్గన కవి తల్లి పేరు 'ఎఱ్ఱమ్మ'.)

వీరందరు ఎఱ్ఱనివారేనా? రంగునుబట్టియేనా ఆపేరు వచ్చినది. 'ఔ' నని ఆచార్యులవారైనను అనగలరా? తక్కిన యెఱ్ఱనల సంగతి యేమోగాని, మన ప్రెగ్గడకు మాత్రము 'ఎఱ్ఱన' యను పేరు, ఎఱ్ఱదనము వలన వచ్చినది కాదు. ప్రెగ్గడ తాతపేరు 'ఎఱ్ఱపోతన'. తాతపేర నీతడు 'ఎఱ్ఱన' యైనాడు. ఈ సంగతి యెఱ్ఱనయే చెప్పికొన్నాడు.

"ననుఁ దన పేరివాఁడని మ
నంబున నెప్పుడు నాదరించుటన్
బనిచె గుణప్రసిద్ధియును
భవ్యసమృద్ధియుఁ జేరు పుణ్యపుం
బనియట మత్పితామహుఁడు"

(నృసింహ. పీఠిక. 24)

కాబట్టి, ఆచార్యులవారు "అరుణ - యనగా - 'ఎఱ్ఱన' కదా!" యనుటయు, "అరుణశబ్దము 'ఎఱ్ఱన' యని వ్యంగ్యమొసగు ననుటయు" సరి కాదు.

శారదవేళలో మేఘములు లేనూలేవు; అవి వాసరముఖములను ఆవరింపనూలేదు; ఆ యావరణమును సూర్యుడు తొలగింపనూలేడు. అట్లే ఆరణ్యపర్వ శేషమున నన్నయరచన లేనూలేదు; దానికి చెదలు పట్టనూలేదు; ఎఱ్ఱన దులపనూలేదు. అంతా వట్టిభ్రాంతి. ఆ భ్రాంతిలోనే 'అరుణ' పదము 'ఎఱ్ఱన'ను వ్యంగ్య మొసగుటయు, ఆ యెఱ్ఱన శిథిలభాగములను పూరించుటయు, ప్రబంధపరమేశ్వరు డనిపించుకొన్న ఆ మహాకవి 'గ్రంథచోరు' డగుటయును. అంతేగాని లోకములో గాదు.

## రచన - శిథిల పూరణము

"స్ఫురదరుణాంశు - అను పద్యము, శబ్దశక్తిమూలకము వ్యంజనాద్వారమున, ఇక్కడినుండి ఎఱ్ఱన కవిత్వమని తెల్పుటయేగాక, ఎఱ్ఱన శిథిలాంశములను పూరించినవా డన్న సంగతినిగూడా వ్యంగ్యముగా తెల్పుచున్నది." అని ఆచార్యోక్తి. ఈ పద్యము వారికి 'ఇక్కడినుండి యెఱ్ఱన కవిత్వము (=రచన)' అనియేకాక, 'ఇక్కడి నుండియే - యెఱ్ఱనచేసిన శిథిలాంశ పూరణము' అనికూడా తెల్పినదట! అదెట్లు తెల్పును? ఒక పద్యమే పరస్పర విరుద్ధములైన రెండర్థములను తెల్పునా? అట్టి పద్యమువలన ప్రయోజన మేమి?

ఇంతకును, ఎఱ్ఱన చేసినది రచనా? శిథిలాంశ పూరణమా! అంతకు ముందొక రచనయుండి, అది శిథిలమైయుండిననేగదా పూరించవలసినది! రచనయే యున్నచో, మరల నెఱ్ఱనయేల రచించును? ఎట్టి రచనయు లేక, తానే నూతనముగా రచనకు పూనుకొన్నప్పుడు, శిథిలాంశము లెక్కడ? పూరించు టెక్కడ?

ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషమును రచించియైననుండవలె; లేదా, శిథిలమైయున్న పూర్వరచనను పూరించియైన నుండవలె. రెండు పనులను ఏకకాలములోనే చేసినాడనుట "నిద్రపోతూ మేలుకొనివున్నా" ననుట వలె హాస్యాస్పద ప్రసంగమగును.

పద్యార్థము సుస్పష్టమవనప్పుడు, ఇట్టి విపరీత వ్యంగ్యార్థములు పొడకట్టుచుండును. అంతేగాని, పద్యము లీవిధమైన విరుద్ధార్థముల నెప్పటికిని చెప్పవు.

'అరుణ' పదము 'ఎఱ్ఱన'ను వ్యంగ్యమొనరించుచున్న దనుకొనుట ఈ విరుద్ధార్థమునకు మూలకారణము.

ఇక్కడ చెప్పవలసిన గొప్ప విశేషమొకటి యున్నది. ఏమంటే—ఆ యాచార్యులవారి మతమున అరుణుడే కాడు, భాస్కరుడును 'ఎఱ్ఱన'యే. చిత్తగించండి, వారు లిఖించిన పంక్తులు.

## "ఎఱ్ఱనయే యిట భాస్కరుడు"

1. "మహో మహిముల్ సోముడు భాస్కరుండు వెలయింపన్" (వసుచరిత్ర). ఇందు భాస్కరుడు మన యెఱ్ఱన—అరుణుడే కాని, భాస్కర రామాయణకర్త హుళక్కి భాస్కరుడు కాడు. అతనికి సోమునితోడి సాహచర్యమేదీ? హరివంశ రచనచే నాచన సోమునితో సాహచర్యము మన 'అరుణు'నకు—ఎఱ్ఱనకున్నది. కనుక యెఱ్ఱనయే యిట భాస్కరుడు—స్ఫురదరుణుడు."

భాస్కరుడనగా—యెఱ్ఱనయేనట! ఎఱ్ఱన 'అరుణు'డేనట!! అదియును గట్టి 'అరుణుడు' కాడు; 'స్ఫురదరుణు'డట!!! చిత్రమైన సిద్ధాంతము కాదా!

ఇంతే కాదు; వారిది మరియొక రాద్ధాంతమున్నది. "ఎఱ్ఱన యాంధ్ర ప్రపంచమునకు మొదల వెలుగు నిచ్చు నరుణుడే" అన్నారు. అదియెట్లు? 'ఆంధ్ర ప్రపంచ' మనగా 'ఆంధ్రభాష' యనియే కదా భావము. అయినప్పుడు, ఆంధ్ర భాషా ప్రపంచమునకు మొదల వెలుగు నిచ్చినవాడు, వాగనుశాసనుడు—నన్నయభట్టును గాని 'ఎఱ్ఱన' యెట్లు కాగలడు?

ఈ భ్రాంతికంతకును మూలము 'స్ఫురదరుణాంశు' పద్యమున వ్యంగ్యము అవశ్యముగా వచ్చిపడినదన్న భ్రమ. అందు ప్రధానము 'అరుణ' శబ్దము.

ఎఱ్ఱన—యనగా, ఎఱ్ఱనివాడనియు, సూర్యు డెఱ్ఱనివాడు గనుక సూర్యపర్యాయములైన అరుణుడు, భాస్కరుడు అను పదములతో ఎఱ్ఱనను పేర్కొనవచ్చు ననియు వారుచేసిన యూహ. అది అపోహ.

యముడు నల్లనివాడు గనుక 'నల్లన్న'—'కృష్ణయ్య' అను పేరులుగల వ్యక్తులను 'యము'డని గాని, తత్పర్యాయములైన కృతాంతుడు, ప్రేతపతి—యను పదములతో గాని పేర్కొనవచ్చునా? నిజముగా నల్లనివాడే యైన శ్రీకృష్ణునైనను 'యము' డనవచ్చునా? అట్లెవరైనను అనియున్నారా? అనిన చెల్లునా? మరి ఆచార్యులవారు 'ఎఱ్ఱన'ను 'అరుణు' డనుటయు, 'భాస్కరు' డనుటయు నెట్లు చెల్లును? ఇదేనా వ్యంగ్యార్థ కల్పనాకౌశలము! ఇట్టి కల్పనలతో నేనా 'ఎఱ్ఱాప్రెగడ గ్రంథచోరు' డనిసిద్ధాంతము చేయుదము!

తమ తీర్పునకిక తిరుగులేదన్న గట్టి నమ్మకముతో

(1) "అప్పకవియు నీవంకకే మొగ్గుచున్నా" డన్నారు. ఎక్కడ మొగ్గినాడు? ఎట్లు మొగ్గినాడు? విశదపరిచినారా?

(2) "మేము నిరూపించినట్లు వ్యంగ్యముండు ననుటలో విప్రతిపత్తి యేల?" అని మరల ప్రశ్నించినారు.

ఇది పునరుక్తి.

(3) "ఈ వ్యంగ్యార్థము ఇదివరలోనివారు గమనింపలేదు" అన్నారు.

వ్యంగ్యార్థ మొకటి యుండినగదా యెవరైనను గమనించుటకు? నాలుగైదువందల యేండ్లుగా ఏ పండితులును గమనింపని పరమ రహస్యమును తాము గమనించినట్లు వారు గట్టిగా ముడివేసుకొన్నారు.

(4) "మేము దానిని (వ్యంగ్యమును) సక్రమముగా నిరూపించితిమి. ఇంతమాత్రమున నది లేకపోవునా?" అని వారి తుదివాక్యము.

నా కర్థము కాలేదు. "సక్రమముగా నిరూపించితి"మన్నారు, సరే. అంతటితో నూరకొనక, "ఇంతమాత్రమున నది లేకపోవునా?" అనుట యెందుకు? 'ఇంతమాత్రమున' అనగా ఎంతమాత్రమున? సక్రమముగా నిరూపించినంత మాత్రమునా? లేకపోవుటకది కారణమగునా? అసలు 'అది లేకపోవునా?' అన్న సందేహము తమకేల? తమ నిరూపణమున తమకే అపనమ్మకమా? అయిన లోకమెట్లు నమ్మును?

## నన్నయ పద్యపాదములు

"రయవిచలత్తురంగమ త
రంగములన్ మదనాగనక్ర సం
చయములఁ జంచలచ్ఛటుల
సైనిక మత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రు నుద
యంబునఁ దద్దయుఁ బొంగెఁ బ్రస్ఫుర
ద్భయద మనోహర ప్రకట
భంగులఁ దద్భట వార్ధి యున్నతిన్."

(ఆరణ్య. 6–58)

"ఈ పద్యములోని మొదటి రెండు పాదములును నన్నయవి. సభాపర్వములో ఒక పద్యము మొదట నున్నవి. కాబట్టి యిది నన్నయ పద్యమే. తక్కిన రెండు పాదములును నష్టమైయుండుటచేత ఎఱ్ఱన

---

1. 'మహో మహులై' అని వావిళ్ళ ప్రతిపాఠము—'మహాతేజస్సు గలవారై' అని సోమకవి టీక.

సూర్యచంద్రుల పక్షమున మహము(=తేజస్సు)ను చెప్పుట యుచితముగాని, మహిమ(=గొప్పతనము)ను చెప్పుటలో ఔచిత్యమేమున్నది?

ఆచార్యులవారు 'మహిముల్' అనుటలో విశేషమేమో? ఆపాఠ మెక్కడిదో?

పూరించినాడు. ఆ పూరణమున నన్నయ ధారాశుద్ధి లేదు. అరణ్యపర్వశేషము నన్నయ రచించినది కాక పోతే, ఆయనపద్యపాదము లెందుకున్నవి" అని ఆచార్యులవారి ప్రశ్న.

ఆ భాగ మాయన రచించినది కాదు గావుననే, ఆయన పద్యపాదము లందున్నవని నా సమాధానము. నన్నయ, అరణ్యపర్వశేషమునుకూడా రచించినా డనియు, వెనుకటి భాగములలోని పద్యములనే, అందు వాడుకొన్నాడనియు భావించుట యుచితముకాదు. ఎంతిటి యసమర్థకవియైనను అట్టిపని చేయడు. మహాకవి నన్నయ చేయునా ?

ఆ రచన యెఱ్ఱనదిగాని నన్నయదికాదు. నన్నయ కవితయందలి ప్రీతిచేత, ఎఱ్ఱన ఆ రెండు పాదములను గ్రహించి, తక్కిన రెండు పాదములను కథానుగుణముగా తాను వ్రాసికొన్నాడు. ఈ విధముగా మరి కొన్ని తావులందును చేసియున్నాడు చూడండి.

"నారలుఁగట్టి కూరలశ
నంబుగ నుగ్రవనంబులో దపోఁ
భారమునం గృశుండయిన
బ్రాహ్మణుఁడు........."
(నన్నయ–అర. 2–329)

"నారలుగట్టి కూరలశ
నంబుగ నుగ్రవనంబులో విప
ద్భారము నొంది వందురిన
ఫల్గునుఁడు..........."
(ఎఱ్ఱన-అర. 5–349)

"ధర్మ, ధర్మయు క్తమతివి మునులకు
నీ యింద్రియజయము గీర్తనీయము తండ్రీ".
(నన్నయ–అర. 1–366)

"తేపయయి కష్టఁబెట్టిన
నీ పుణ్యచరిత్ర గీర్తనీయము తల్లీ."
(ఎఱ్ఱన-అర. 7–274)

పరిశీలించినచో, ఇట్టి యనుకరణ లింకను కొన్ని దొరకవచ్చును. ఈ రీతిగా ఎఱ్ఱన, నన్నయ రచన యందలి యభిమానముచేత ఆయన పద్యపాదము లందందుపయోగించుకొనియు, ఆయన తూర్పు ననుకరించియు, ఆయన పలుకుబళ్ళందుకొనియు "తత్కవితారీతియు గొంత దోఁప" తన రచనను సాగించినాడు. అంతేగాని అరణ్యపర్వశేషము రచన నన్నయదికాదు ఎఱ్ఱనదే.

నన్నయపద్యపాదములను తీసికొనుట గ్రంథచౌర్యముకాదా ? అని యందురేమో; ఆచార్యుల వారు. అది చౌర్యముకాదు. ప్రాచీన కృతులలో తమకింపుగా తోచు రచనాంశములను కైకొను సంప్రదాయము కవిలోకమున నున్నది. గ్రంథపరిచయము గలవారి కిది సువిదిత విషయమే. అయినను ఆచార్యుల వారికొరకు కొన్ని యుదాహరణ లిచ్చుచున్నాను.

(1) తాళవృంత పవన
ప్రేంఖోలన ప్రక్రియా
వసగోదంచిత సారసౌరభరస
వ్యాలోలగోలంబముల్ "(హర. పీఠిక. 22)

"కృతాంతరూప పవమా
నప్రేంఖనప్రక్రియా
వసగోదంచిత సారసౌరభరస
వ్యాలోలగోలంబముల్ "
(పిల్లలమఱ్ఱి. శృం. శాకుంతలము)

(2) "ఉద్దామద్యుమణిద్యుతి వ్యతికర
ప్రక్రీడదగ్నిస్ఫుల
జ్వాలాజాలజటాల జాంగల
తటీ నిష్కూజికోయష్టయః"
(అనర్ఘరాఘవం)

"పీఁకంగాసె బీరెండయా
ప్రాలేయాహిత సంప్రదీప్తకిరణ
ప్రక్రీడదగ్నిస్ఫుల
జ్వాలాజాలజటాల జాంగలతటీ
వాసాలకోయష్టియై" (హర. 7.109)

(3) "ముకురంబూర్చిన ముంపడైనమునకున్
మోమోటలేదా సుమీ" (భీమ. 3. 6)

"ముగరంగూర్చిన ముంపడైనమునకున్
మొక్కించు కేకేయునున్" (విక్ర 8.80)

ఇట్లు పద్యపాదములనేకాదు, ప్రాచీనులభావముల నైతము గ్రహించుట కలదు.

ఈ క్రిందిద్విపదలు గౌరన నవనాథచరిత్రలోనివి:

"మును పలకఁ జని మున్ను మదనాంతకునకుఁ
దొలఁగొప్పఁ బార్వతీదేవి తపంబు
సలిపిన తావును నీలకంఠగుని
తాలిమిఁ జెగుపఁ బంతముఁబూని యేయఁ
దూలగింపుచు వచ్చి తుంటవిల్కాఁడు
ఆదిదేవుని నిటలాగ్నిచే శిఖల
బూదియగాఁ గాలిపోయిన తావు" (ఆ. 4)

ఈ ద్విపదలలోని భావమునే గ్రహించి, ఆంధ్ర కవితా పితామహుడు

"పుష్పడీకతనంబు పోఁబెట్టి గిరికన్య
పతిఁగొల్వ నాయాసపడినచోటు,
వలరాచరాచవారలికొత్తు కనువెచ్చఁ
గఁరగిన యాల కనికరపుఁజోటు"

అన్నాడు. ఇట్టివెన్నియో యున్నవి: ఇప్పటికే వ్యాసము పెరిగినది. ఇంకను విస్తరమెందుకు ?

ఎఱ్ఱాప్రెగడ, నన్నయరచనలోని యంశములను తీసికొనుటలో తప్పులేదు. అది గ్రంథచౌర్యము కాదు. నన్నయ మూడుపర్వములు రచించినా డనుటయు, అందు కొంత శిథిలమైన దనుటయు, దానిని యెఱ్ఱన పూరించినా డనుటయు, గ్రంథచౌర్య మనుటయు సరికాదు.

# కాలం తెచ్చిన మార్పు

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయమ్ కర్మబంధనః—అన్న వాక్యంమీదే నిలిచిపోయింది మనస్సు, గీతాపారాయణం చేసుకుంటున్న సూర్యనారాయణపంతులు గారికి. యజ్ఞార్థమైన కర్మ తప్ప తక్కినదంతా బంధనహేతువు; స్వార్థ రహితంగా చేసే కర్మ భగవదర్పితమూ, మోక్ష హేతువూ అవుతుంది...ఒక్కసారి గత జీవితమంతా కలగా కళ్ళయెదుట తిరిగి, ముప్పై ఏళ్ళనాడు బడిపంతులు ఉద్యోగం వదిలి కాంగ్రెసులో అడుగు పెట్టినప్పటి నుంచీ తనుచేసింది యజ్ఞార్థమైన కర్మేకదా అనిపించింది...పదిహేడేళ్ళ క్రితం అరుణవయస్కుడైన కొడుకు స్వాతంత్ర్య యజ్ఞంలో ఆహుతి కావటం...తర్వాత కోడలుపోవటం...మనుమరాళ్ళు విమల, స్వరాజ్యం, తన సంరక్షణలో పెరిగి పెద్దవాళ్ళుకావటం, వైధవ్యంతో ఇల్లుచేరిన కొమార్తె రుక్మిణమ్మ వాళ్ళకు మాతృస్థానంలో నిలబడటం...ఇన్ని కష్టాల్లోనూ తను చలించక, నిర్లిప్తంగా దేశసేవలో నిమగ్నుడై, జీవితాన్ని అందుకే వినియోగించటం...ఒక్కసారి ఊహలో మెదిలి గీతావాక్యానుసారం బ్రతుకు నడిచిందన్న తృప్తి మనశ్శాంతినీ, భగవదనురక్తినీ హృదయగతం చేస్తోంది.

"నాన్నా, ఇదుగో కాఫీ."

పుస్తకంమూసి నెమ్మదిగా రుక్మిణమ్మ తెచ్చిన కాఫీ పుచ్చుకొని,

"పానకాలు కూరలు తీసుకొచ్చాడా, అమ్మాయ్?" అని ప్రశ్నించాడు.

"ఆఁ..." అని తలఊపి రుక్మిణమ్మ, కొంచెం సందేహిస్తూనే "అయితే నన్ను రాజమండ్రి ఎప్పుడు వెళ్ళమంటారు నాన్నా?" అన్నది.

"అసలు నువ్వు వెళ్ళటానికి వీల్లేదమ్మాయ్. ఇవాళ వాళ్ళకు ఉత్తరం వ్రాయించు. పాపాయికి సుస్తీచేసి అంత తొందరగా వుంటే, యిద్దరు పిల్లల్ని తీసుకుని వెంటనే విమలను రైలెక్కి రమ్మని వ్రాయి. ఇక్కడికి వస్తే మన చేతనైన సాహాయ్యం చేద్దాం... అంతేగాని, యిలా ఎప్పుడంటే అప్పుడు వాళ్ళు పిలవగానే నిలుచున్నపళంగా ఇల్లు వదిలిపెట్టి పరుగెత్తడానికి యిక్కడ మరో మనిషి లేరని వాళ్ళకు ఆ మాత్రం తెలియాలి!"

ఆయన కంఠంలో తొంగిచూచిన కోపాన్ని గుర్తించిన రుక్మిణమ్మ బదులు చెప్పకుండా లోపలకు వెళ్ళిపోయింది.

పెద్దపిల్ల విమల చిన్నప్పటినుంచీ కూడా అంతే. ఏమాటకైనా సరే కొంత ఎదురు చెప్పకుండా, చీవలూ పలవలూ పెట్టకుండా పెరిగిన పిల్ల కాదు... ఇప్పటికి యింకా తండ్రితాతల ఆదర్శాలేమిటో గ్రహింపు లేకుండా ప్రవర్తిస్తూ వుంది...పెళ్ళైన తర్వాత ఉన్న కొంత వ్యక్తిత్వమూ నశించిందేమో! భర్తను తెలీకపోతే తనకు తెలీదూ! ఆదర్శాల పరిధిలో పెరిగి చివరకు యిలా తయారైంది. పెళ్ళిలో కట్నం యివ్వలేదట, అందుకని భర్తకు డిస్ట్రిక్ట్ మునిసిఫ్ ఉద్యోగం వేయించ కూడదా తాతగారు, తన పలుకుబడినీ, గతంలో చేసిన దేశసేవనూ ఉపయోగించి? అని ఏడాదినుంచీ వాదిస్తూ వుంది! అలాఅడగటానికే మాత్రం జంకు లేదు! అందరూ చేసుకుంటున్నారట యిలాంటివి, తాతగారుమాత్రం ఎందుకు చెయ్యరాదు? ఆనాడు కట్నం అవసరంలేదని, తాను ఆదర్శాలకు బద్ధుడైన విద్యావంతుణ్ణనీ, దేశసేవలో కీర్తి గడించిన వంశంలోని పిల్లను పెళ్ళి చేసుకోవటమే తనకు గొప్ప అదృష్టమనీ వేషాలు వేసిన అబ్బాయి యివాళ నిజస్వరూపం బయట పెట్టుకుంటున్నాడు! కట్నం బదులు ఉద్యోగం; లేకపోతే, కనీసం పొలంలో సగం యిస్తారా? లేదా? అని భార్యద్వారా బేరాలు పెట్టుతున్నాడు. ఏం ప్రయోజకులు యీ కుఱ్ఱవాళ్ళు! వీళ్ళట, దేశాన్ని భుజాలమీద మోసి, ఆకాశాని కెత్తుతారట!...పైగా బెట్టుచెయ్యట మొకటి...పెళ్ళాన్ని రెండోకాన్పుకి యిక్కడికి పంపించకపోవటం; రుక్మిణమ్మమాత్రం అవసరంవచ్చి వ్రాసినప్పుడల్లా అక్కడికి వెళ్ళాలి! ఏడిసినట్లుంది ఆత్మగౌరవం! లాయరుగా పైకివచ్చే యోగ్యతలేక 'ఉద్యోగం'

కావాలిట!...దేశంలోని యువకుల్ని చూస్తే ఆలోచిస్తుంటే అసహ్యం, విరక్తీ కలుగుతాయి!

"మ్యావ్, మ్యావ్," అనుకుంటూ ఏమీ ఎరగనట్లు వాకిట్లో తొంగిచూస్తోంది పెంపుడుపిల్లి, క్రితం రాత్రి పాలన్నీ త్రాగి పారిపోయి.

"ఛీ, ఛో, వెధవ దొంగముండ, నువ్వూ" అని విసనకఱ్ఱ విసిరారు; కాని తెలివిగా తప్పుకొని పారిపోయింది పిల్లి.

వీధిలో ఎవరో పిలిచారు.

గ్రామంనుంచీ వచ్చినరైతు ఎల్లయ్య.

"ఏం, ఎల్లయ్యా, ప్రొద్దుటే బయల్దేరావే, యిదేనా రావటం?"

"నిత్తెం బాబయ్యా, మీతోనే కాస్త పని వుండి, మనవి సేసుకుంటామని."

"ఏమిటది?"

"ఏం లేదు...మా రెండోవోడు వున్నాడు నూశారూ! వాడు యిస్కూలు సదువు ముగిసి యిప్పుడు తాలూకాఫీసులో గుమాస్తాగా వున్నాడు.. పని యింకా ఖాయంలేదు....శానా కట్టంగా వుంది, వదిలేసి పెసగువు కెల్తానంటున్నాడు...మీరేం సెపుతారో, మీ సాయం కోరదామని వచ్చాను..."

"కష్టమంటే, నువ్వు కష్టం చెయ్యటంలేదా ఎల్లయ్యా! బి. ఏ. చదివితే మాత్రం యిప్పుడున్న ఉద్యోగంకన్నా మంచిది దొరకబోదు; అందువల్ల ఈ ఉద్యోగమే ఖాయమయ్యేట్లు ప్రయత్నం చెయ్యమను! దానికొక పరీక్ష వుంటుంది...సర్వీసుకమీషను పరీక్ష...ఆ పరీక్ష వ్రాయమను. ఉన్న ఉద్యోగం నిలుపుకోవటమే ఉత్తమం, ఎల్లయ్యా!"

వ్యవసాయం విషయాలూ అవీ మాట్లాడి ఎల్లయ్య వెళ్ళిపోయారు. ఒక నిట్టూర్పు విడిచి, వార్తాపత్రిక చేతికి తీసుకున్నారు..."కాలేజీ విద్యార్థుల సమ్మె" అని పెద్ద అక్షరాల్లో వార్త! తేలిగ్గా డిగ్రీలు, ఉద్యోగాలు, జీతాలు, కావాలి వీళ్ళందరికీ! సోమరితనం బలిసిపోతోంది దేశంలో...

"పోస్టు" అని గావుకేక...క్రొత్తగా వచ్చిన తపాలాబంట్రోతు!...పాతవాడెప్పుడూ "పంతులుగారూ, ఉత్తరమండీ!" అనేవాడు.

గుంటూరు......మెడికల్ కాలేజీలో వున్న స్వరాజ్యం దగ్గరనుంచీనా...కాదు, విశ్వనాథం వ్రాసినట్టున్నాడు...అమ్మాయి వారంరోజులుగా ఉత్తరం వ్రాయలేదు, కారణమేమిటో!...

"...మీకు విషయం సవిస్తరంగా వ్రాయనందుకు మన్నించి, ఏమీ ఆదుర్దా పడకుండా ఈ ఉత్తరం చూడగానే బయలుదేరి గుంటూరు రావలెను....అమ్మాయినిగురించిన ఒక ముఖ్యవిషయం మీతో ప్రస్తావించవలసి వుంది.. కొన్ని కారణాలవల్ల నేనక్కడికి రావటానికన్న, మీరిక్కడికి రావటమే ఉత్తమమని నిర్ణయించి, మీకు శ్రమ కలిగిస్తున్నాను.. నేను స్టేషనుకు వస్తాను. సాయంత్రం బండికి తప్పక గుంటూరు చేరగలరని విశ్వసిస్తున్నాను..."

అమ్మాయిని గురించిన విషయం ఏమైవుంటుంది? ...దానికి యీమధ్య ఆరోగ్యం సరిగా వుండటంలేదు.. అది కాదేమైతే యింటికే వచ్చివుండేదే? బాగా సుస్తీ చేసిందేమో...అయితే టెలిగ్రాం యివ్వలేదే! విశ్వనాథం ఏడాదిన్నరనుంచీ 'అమ్మాయికి వివాహం చెయ్యకూడదా!' అని సలహా యిస్తున్నాడు...తాతగారికి వృద్ధాప్యం వచ్చి వుండటంవల్ల మనవరాలికి తొందరగా పెళ్ళి చేసి బాధ్యత తీర్చుకుంటే మంచిదని ఉద్దేశ్యం కాబోలు.. లేకపోతే ఇంజనీరింగు ప్యాసైన మేనల్లుడికి చేసుకుందామన్న కోరిక అయివుంటుంది... తనకీ కారణాలు రెండూ నచ్చవు...స్వరాజ్యం మనస్తత్వం తనకు బాగా తెలుసు... చదువు పూర్తి చేసుకుంటుంది; డాక్టరై, వ్యక్తిత్వాన్ని సంపాయించి, తండ్రి తాతలవలె జీవితాన్ని అధిక ప్రాయంగా దిద్దుకుంటుంది; ఇప్పుడెప్పుడే పెళ్ళి, సంసారం లాంటి ఊబిలో దిగదు...

....ఆటల్లోంచి పరుగెత్తివచ్చి, చెవిదగ్గర నోరు పెట్టి, ఏదో రహస్యమైనట్టుగా "తాతయ్యా, నా బొమ్మకు పెళ్ళి చేశా" అని మెల్లగా చెప్పి, తనముఖంలోకి చూసే అయిదేళ్ళ చిట్టి..."మంచిది, వెళ్ళి అత్తారింటికి పంపించు తల్లీ" అనేసి తనపనిలో తను నిమగ్నుడైనా, చెవిదగ్గర ఆ స్పర్శ, ఆ వాక్కు, ప్రతిస్పందనగానే వుండి, మధురానుభూతి కలిగించేవి... పదేళ్ళపిల్లగా గాంధిజయంతిరోజు తనదగ్గర కూర్చుని మహాత్ముని 'ఆత్మకథ' చదువుతూ .... ఒకసారి జ్వరం వచ్చినప్పుడు, "తాతయ్యా, నాకీపాడు జ్వరం ఎందుకు వచ్చింది? నామూలంగా నీకెంత విచారం! ...ఇక పోతుందిలే తాతయ్యా!" అని తన్ను ఊరడిస్తూ...అహింసమీద చక్కని వ్యాసం వ్రాస్తే స్కూల్లో యిచ్చిన బహుమతీ తెచ్చి "తాతయ్యా, ఇది నీకు బహుమతి!" అని పలుకుతూ .... ఇంటర్మీడియేట్‌లో తెలుగులో తప్పటంతో, తాతయ్య కోరిక ప్రకారం మెడిసిన్‌లో ప్రవేశించటానికి ఒక్క ఏడాది ఆలస్యమై పోయిందన్న దిగులుతో అన్నం మానివేసిన చిట్టి...చిట్టితల్లిది నవనీత హృదయం!.. ఆసుపత్రిలో రోగులుకాని, వీధిలో చిక్కి శల్యావశిష్టులైన బిచ్చగాళ్ళు కాని కంటపడితే చూచి సహించలేక బాధపడే మెత్తని మనస్సు ... చిట్టి మానవసేవలో ఆదర్శమూర్తి అవుతుంది!.. చిట్టి డాక్టరై-తను ముసలి

# కాలం తెచ్చిన మార్పు

తనతో మంచంమీద... చిట్టి స్టెతస్కోప్‌తో తన హృదయాన్ని స్పృశిస్తూ, మందు త్రాగిస్తూ— తను చిట్టి ముఖంవైపు చూస్తూ... చిట్టి కీర్తినీ, మంచినీ, అంటూ శ్లాఘిస్తూ—తను తృప్తిగా సజల నేత్రాలతో ఆశీర్వదిస్తూ... భగవత్సన్నిధిని చేరుకుంటాడు.

కళ్లు తుడుచుకుంటూ లేచి, వంటింటి వైపు వెళ్లారు.

"అమ్మాయ్, పెందలాడే వడ్డించు. కాస్త విశ్రమించి, గుంటూరు బయల్దేరాలి."

"గుంటూరా? ఇప్పుడా?"

"ఆఁ.. మూడింటి రైలుకి వెళ్లాలి...ఏం లేదు, విశ్వనాథం నన్నోకసారి వచ్చి వెళ్లమని ఉత్తరం వ్రాశాడు.. బహుశా ఏదో వాడి స్వవిషయమే అయి వుంటుంది.. వివరాలు వ్రాయలేదు.. అమ్మాయిని కూడా ఒకసారి చూచి రావాలని వుంది."

* * *

రైల్లో ప్రక్కన కూర్చున్న నలభైఏళ్ళ సిల్కు లాల్చీ వ్యక్తి కొన్నేపటికి పలకరించాడు:

"ఏమండీ, అసెంబ్లీ సెషన్సుకి హైదరాబాదు వెళుతున్నారా?"

ఖద్దరు టోపీ, ఖద్దరు దుస్తులు, కిర్రు చెప్పులు చూచి తనను కాంగ్రెసు శాసన సభ్యుడని అపోహ పడినట్లు గ్రహించి విసుక్కున్నారు సూర్యనారాయణ గారు.

"కాదు... నేను రాజకీయాలనుంచి విరమించుకొని పదేళ్లు కావస్తోంది; కానీ పాతికేళ్లుగా అలవాటుపడ్డ యీ దుస్తుల్ని అలాగే వేసుకుంటున్నాను... తప్పంటారా?"

"అబ్బే కాదండి!...మీరింకా రాజకీయాల్లో ప్రవేశం కలిగి వున్నారని అభిప్రాయపడ్డాను, అంతే!"

"ఒకప్పుడు దేశసేవకు చిహ్నం, యిప్పుడు రాజకీయాలకు చిహ్నం...అదీ మార్పు."

"ఒకప్పుడు మంచికీ, యిప్పుడు అధికారానికీ!" అని చిన్నగా నవ్వాడు ఆవ్యక్తి.

"ఏ చిహ్నమైనా, ఆదర్శమైనా, ప్రజల్లో నే వుంది కదండీ, దానికి వాళ్ళిచ్చే విలువ, అర్థం! పూర్వం త్యాగాన్ని మెచ్చుకున్నారు; యిప్పుడు అధికారన్ని గౌరవిస్తున్నారు, కానివ్వండి."

అలా అన్నప్పటికీ, ఆ మాట తనకే ఎందుకో తృప్తిగా లేదు. ఏ కారణంవల్లనైనా ఒక చిహ్నానికి అర్థం, విలువ మారినప్పుడు దాన్నింకా వుంచుకోవటమా, విసర్జించటమా? అనే సమస్య తేలటంలేదు.

స్వాతంత్ర్యం రాకపూర్వము సామాన్యుల్లో కూడా కనిపించిన కార్యదీక్ష, నిజాయితీ యిప్పుడెక్కడా తనకు కనిపించటంలేదు. ప్రతిమనిషీ డబ్బు కోసమో, పదవి కోసమో ప్రాకులాడుతూ కనిపిస్తాడు ప్రస్తుతం; స్వార్థం, దానితోబాటు కపటం, మోసం, దేశంలో స్వేచ్ఛా విహారం చేస్తున్నాయి. మధ్యవయస్కుల్లోనే కాదు యీ విపరీతం; ఆదర్శాలు మోసులెత్తవలసిన యువకుల్లో కూడా ఒక చెంప స్వార్థమో, అప్రయోజకత్వపు వెకిలితనమో స్ఫురిస్తూ వుంటుంది.

ఎదుటి కిటికీవద్ద, రేయాన్ స్లాక్ షర్టు గాలికి రెపరెపలాడుతూ ఒక చేతి డిటెక్టివ్ నవల, ఇంకొక చేతి సిగరెట్టు...ఆ రెండింటిలోనూ లీనమైన యువకుడివైపొకసారి చూచి దృష్టిమరల్చుకున్నారు.

తన కాలం అయిపోయింది. మంచి సమయంలో పదేళ్ల నాడు పార్టీలో వర్గాలు ఏర్పడి క్రొత్త పార్టీలు ఉత్పన్నమౌతున్న క్షణాల్లో విరక్తిచెంది విరమించుకున్నారు రాజకీయాలనుంచీ.....ఎన్నికలు ఒక వ్యాపారం......దైవచింతన, పారమార్థికాలోచన, ఓపిక వుంటే గ్రామోద్ధరణ యివే తన లక్ష్యాలు అనుకొన్నారు! ఆ మాటే మిత్రులతో అంటే... "మీలాగ మంచి భూవసతి, ఆదాయం వుంటే మేమూ అలాగే అనుకోవచ్చు" అన్నారు...వాళ్ళకూ తనకూ మధ్య ఒక అగాథంవుందని ఆ రోజు గుర్తించారు... తర్వాత ఆ అగాథం పెరుగుతూనే వచ్చింది.

గాంధీగారి ఖద్దరుదుస్తులు ఒక చిహ్నం...దానికి తానొక అర్థం, లోకం ఇంకో అర్థం ఆపాదించే క్రొత్తపరిస్థితి ఏర్పడినప్పుడు, తానింకా ఈ బాహ్య చిహ్నానికి అంటిపెట్టుకోవటం సమంజసమా? వ్యక్తిగతమై నిల్చిన తన విశ్వాసాల్ని ఈ దుస్తులు వ్యక్తపరచలేనప్పుడు, వీటిని విసర్జించటమే కర్తవ్యమేమో!

గుంటూరులో రైలు దిగగానే విశ్వనాథం కలుసుకున్నాడు.

"ఏమిటి విశేషం విశ్వనాథం?"

"ఏంలేదు బాబాయ్, ఇంటికి పదండి, సావధానంగా చెబుతాను."

"చిట్టి ఖులాసాయేనా?"

"ఆఁ."

భోజనాలైన తర్వాత విశ్వనాథం విషయం ప్రస్తావించాడు.

"మావాడి స్నేహితుడు సత్యం అని యిక్కడ కాలేజీలో ఇదివరకు లెక్చరరుగా ఉండేవాడు. ఈ యేడాది తిరుపతి యూనివర్సిటీలో ఉద్యోగమై వెళ్ళాడు. అమ్మాయి స్వరాజ్యం ఇంటరులో అతని దగ్గరే చదువుకుంది...ఒకసారి మీరువచ్చినప్పుడు

ఇక్కడే ఆ అబ్బాయిని పరిచయంచేసినట్లు కూడా జ్ఞాపకం...మీకు గుర్తువుందో లేదో!"

"లేదు."

"ఆ అబ్బాయికి మన అమ్మాయి నివ్వటాన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటంటారు?"

"మంచిదే విశ్వనాథం!...కాని సంబంధాలు దొరక్క కాదు నేను అమ్మాయి వివాహ విషయం శ్రద్ధతీసుకోక పోవటం...దాని చదువు పూర్తికావాలని నా ఉద్దేశ్యం...జీవితంలో తన లక్ష్యమేమిటో, అవసరమేమిటో తనే నిశ్చయించుకుని, నిర్వర్తించే అవకాశం ఉండాలి. చిట్టి దృక్పథం వేరు, అది అందరిలా కాదు...అందుకే వివాహాన్ని గురించి ప్రస్తుతం ఆలోచించటం లేదు...దానికి యిష్టం ఉండదు...సరేనా?"

"అలా కాదు బాబాయ్, అమ్మాయికి ఒక వేళ సత్యంఅంటే ఇష్టమే వుంటే వివాహానికి అభ్యంతరం ఏమిటి?"

"ఏం? అలా అడిగి తెలుసుకున్నావేమిటి? అడిగితే ఏమంటుంది; పెద్దలయిష్టం, అభ్యంతరం లేదనే అంటుంది...అంతమాత్రాన అమ్మాయి ఇష్టాన్ని పాడు చెయ్యటం నాకిష్టంలేదు."

విశ్వనాథం ఒక్క క్షణం ఆగి, మళ్ళీ ప్రారంభించాడు.

"బాబాయిగారూ, జీవితానికి లక్ష్యం యేమిటంటారు? తృప్తి, శాంతి, ఆనందం అనుకుంటాను నేను. ఏమార్గాన వెళ్ళినా యివే గమ్యం కదా వ్యక్తికి... చివరకు అవే భగవత్స్వరూపంకూడా అని అంటారు."

"కానీ తృప్తి, శాంతి, ఆనందం అనేవి నిస్స్వార్థమైన కర్మవల్ల లభ్యంఅయినప్పుడే వాటికి ఆ ఉదాత్తత, అవిశ్వరగుణమున్నూ! అది అంతసులభం కాదు విశ్వనాథం...త్యాగం, సేవ—గీతలో 'యజ్ఞం' అంటాడు—ఆ దృక్పథం లేకపోతే ఆనందం, తృప్తి లభించవు; తాత్కాలికోద్రేకం తప్ప!"

"మీ రన్నది అక్షరాలా సత్యం; కాని మీరు వ్యక్తియొక్క "మనోధర్మా"న్ని గురించి ఆలోచించటం లేదేమో అనిపిస్తుంది...సులభంకాక కష్టమైనదాన్నీ, తనకు అలవికాని పనినీ చెయ్యమంటే బలహీనుడు కాలో, చెయ్యో విరగ్గొట్టుకుంటాడు. అంతేకాదు శక్తులుకూడా భిన్నంగా వుంటాయి వ్యక్తుల్లో—ఒక శిల్పికీ, ఒక వడ్రంగికీ ఎంతభేదం!... దేహధర్మం ఎలా ఒక అవధి నిర్ణయిస్తుందో, వ్యక్తిచేసే కర్మకు 'మనోధర్మం' కూడా ఒక అవధి నిర్ణయిస్తుందంటాను. త్యాగం చెయ్యలేనివాణ్ణి త్యాగం చెయ్యమని, ఒక వేళ భ్రమపెట్టి, బలవంతపెట్టి చేయించినా దానికి విపరీత ఫలితం తర్వాత వుండనే వుంటుంది... ఎవరో ఒకళ్లిద్దరు మీలాంటివాళ్లు తప్ప, దేశ స్వాతంత్ర్యంకోసం త్యాగం చేశామనుకొన్నవాళ్ల తర్వాతి ప్రవర్తన మనం యిప్పుడు చూస్తూనే వున్నాం. మీరు ఏ నైతికపతనాన్ని గురించి మథనపడుతూ వుంటారో, ఆ మార్పంతా త్యాగానికి ఒక 'ప్రతిక్రియ' (రి-యాక్షన్)గా తోస్తోంది నాకు... అందువల్ల ఆదర్శాల పేరకు వ్యక్తిత్వాన్ని సాగదీసి నాశనం చెయ్యటంకన్నా, వ్యక్తిత్వం పేరకు ఆదర్శాలను కుదింపు చెయ్యటమే మంచిదేమోనని నా ఊహ! ...మెడిసిన్ చదువుకుని లోకంలో వ్యవహరించే ఆడపిల్లలు తప్పకుండా వున్నారు; కాని అలా చెయ్యలేనివాళ్లను బలవంతం చెయ్యకుండా వాళ్ల 'మనోధర్మా'న్ననుసరించి జీవితాలు చక్కదిద్దటం న్యాయం అనుకుంటాను, బాబాయ్."

"నువ్వు చెప్పింది బాగానేవుంది, కానీ చిట్టి విషయం వేరు...దయ, కారుణ్యం చిట్టికి సహజగుణాలు; బాధానివారణ, మానవసేవ బలవంతంగా తెచ్చిపెట్టుకుని చెయ్యవలసిన అవసరంలేదు చిట్టికి."

"బాబాయ్, నిన్న సత్యం యిక్కడికి వచ్చాడు. అమ్మాయి అతనికి బాగా తెలుసు...మూడేళ్లనుంచీ అమ్మాయిమీద అతనికి అనురాగం; అంతేకాదు అమ్మాయిని చక్కగా అర్థంచేసుకున్నాడని కూడా తోచింది నిన్నటి రోజు అతనితో మాట్లాడిన తర్వాత...అమ్మాయికి అతనిపై అనురక్తి వుంది... కాని ఇదొక్కటే కారణంకాదు...రెండేళ్లనుంచీ నేను అమ్మాయిలో గమనిస్తూనే వున్నాను...ఎంత సున్నితమైన మనస్తత్వం అంటే, బొత్తిగా బాధ, వ్యాధి, వీటని చూచి సహించలేదు; ఏదైతే జుగుప్సాకరంగా వుంటుందో దాన్ని తొలగించటానికీ, బాధను నివారించటానికీ మొట్టమొదట సహనదార్ఢ్యం వుండాలి; అది అమ్మాయిలో లేదు. ఇంకొక అవసరమైన గుణం, నలుగురిలో తిరిగే వ్యవహార దక్షత, ప్రగల్భత, బొత్తిగా లేవు. మీ రూహించిన దీక్షాభారం వహించటానికి ఆమె అంగీకరించటం మీమీద వున్న ప్రేమ, గౌరవంవల్లే...చివరకు యిప్పుడేం జరిగిందనుకొన్నారు! సత్యాన్ని వివాహమాడటానికి అంగీకరించి కూడా ఆ సంగతి మీతో చెప్పే ధైర్యంలేదు... ఏడాదినుంచీ మీకు తెలియజేయటానికి ప్రయత్నిస్తూనే వుంది...చివరకు లాభంలేదని సత్యం రిజిష్టర్డు వివాహానికి ఒప్పించాడు; అది మొన్నటిరోజు జరుగవలసింది...కాని తనలో సంఘర్షణని ఎటూ తేల్చుకోలేక అమ్మాయి మొన్న హాస్టలు వదలి వెళ్లిపోయింది."

"ఆఁ..."

"రాజమండ్రిలో వాళ్లక్కయ్య దగ్గరవుందని, నిన్న యిక్కడినుంచీ వెళ్ళి కనుక్కుని టెలిగ్రాం పంపించాడు సత్యం యివాళ...కానీ, ఆలోచించండి,

అమ్మాయి తనకు మించిన భారం మోస్తోంది... అది ఆమె సహజ ప్రకృతికి విరుద్ధం... నిన్న సత్యంతో చాలసేపు మాట్లాడాను. చాల యోగ్యుడు; అమ్మాయి వ్రాసిన రెండు ఉత్తరాలు తన దగ్గరున్నవి నా చేతి కిచ్చాడు, వివాహానికి మీ అనుమతి కోరటానికీ, మీకు నచ్చచెప్పటానికీ... మీకు విషయమంతా నేను వివరిస్తానని హామీ యిచ్చాను... వివాహం చేయటమే నాకు కర్తవ్యంగా తోస్తోంది..."

"ఏవి ఆ ఉత్తరాలు?"

విశ్వనాథం ఉత్తరాలు తెచ్చియిచ్చాడు.

"...తాతయ్య ముందు నిలబడి, ఆయనతో యీ విషయం ప్రస్తావించే శక్తి నాకు లేదు; కాని ఆయనకు తెలీకుండా వివాహం చేసుకుని తర్వాత ఆయన దగ్గరకు ఏ మొహం పెట్టుకుని వెళ్ళను?... అందువల్ల మీరు నాతో వచ్చేటట్లయితే యిద్దరూ వెళ్ళి ఆయన అనుమతి, ఆశీర్వాదం పొందిన తర్వాతే అలా చెయ్యటం బాగుంటుందేమో! మీరు నాతో వుంటే వెళ్ళగల ధైర్యం వుంటుంది నాకు..."

రెండో ఉత్తరం మరుసటి రోజునే వ్రాయబడింది.

"...నిన్నటిరోజంతా యీ విషయం ఆలోచిస్తూనే వున్నాను... నేను వ్రాసినట్లు ముందుగా వెళ్ళటం అసలు సాధ్యం కాదనుకుంటాను... ఏమంటే తాతయ్య బాధపడితే, ఒకవేళ నిరాకరిస్తే, అప్పుడు నేనేమీ చెయ్యలేకపోతాను. అది మీకు అన్యాయం కాదా!... వివాహం జరిగిపోయిందని తెలిస్తే తాతయ్య తప్పక క్షమిస్తాడని నాలో ఏదో చెబుతూంది... అందువల్ల మొదటి ఏర్పాటు ప్రకారమే చేద్దాం..."

ఉత్తరాలు చదివి ముగించి, గద్గదకంఠంతో "విశ్వనాథం, ఆలోచిద్దాం. నాకు అలసటగావుంది... ఇక విశ్రమిస్తాను" అన్నారు సూర్యనారాయణగారు.

* * * *

పడుకున్నారు కాని నిద్రపట్టలేదు. తాను నిలుచున్న భూమి పాదాలక్రిందనుంచి ఉన్నట్టుండి జారిపోయినట్లు... మనస్సు అయోమయంగా వుంది... ఏం జరిగింది?

ఆదర్శాల మేరకు వ్యక్తిత్వాన్ని సాగదీయటం కన్న, వ్యక్తిత్వం మేరకు ఆదర్శాలను కుదింపు చేయాలంటాడు విశ్వనాథం.

కానీ, నీలాకాశంలో ఎగిరే పక్షిని రెక్కలు త్రుంచి నేలమీద పారవేసినట్లుగా అనుభూతి... ఇక మిగిలిందేమిటి?... ఎందుకీ శిక్ష?... ఎందుకీ దుఃఖం?

దీన్ని గురించి ఆలోచించవలసిన ప్రమేయం ఇక లేదు... "దుఃఖేష్వనుద్విగ్నమనాః"... నిర్లిప్తతకన్న కర్తవ్యంలేదే!... మనో నేత్రంముందు శ్రీకృష్ణునిమూర్తిని నిలుపుకొని కన్నులు మూశారు...

........భారతయుద్ధం ముగిసి విజయం చేకూరిన తర్వాత కురుక్షేత్రంలో యుద్ధస్మృతులను గూర్చి ముచ్చటించుకొంటున్న కృష్ణార్జునులు... బంధుమృతి కోసం దుఃఖిస్తున్న అర్జునుడు, వైరాగ్యభావంతో "నన్ను నీలో చేర్చుకొమ్మ"ని కృష్ణపరమాత్మను అర్థిస్తున్నాడు... శ్రీకృష్ణుడు అర్జునుని గాండీవంవైపు వ్రేలు చూపి, చిరునవ్వుతో "దాన్ని విసర్జించు బావా! అప్పుడే నీ కోరిక సాధ్యం" అంటున్నాడు... గాండీవంవైపు చూచుకొని, గతాన్ని జ్ఞాపకం తెచ్చుకొంటూ అర్జునుడు "దీన్ని ధరించమనీ, యుద్ధం చెయ్యమనీ నువ్వే బోధించావే! ధర్మసాధన చేసిన ఈ గాండీవం నాలో భాగం కాదా?" అని సందేహిస్తున్నాడు..."దానితో ఒకప్పుడు ధర్మసాధన చేసినా ఇప్పుడది ప్రతిబంధకమే" అంటున్నాడు కృష్ణుడు...అర్జునుడు మళ్ళీ గాండీవం వైపు, తనవైపు చూచుకొంటున్నాడు...సూర్యనారాయణ తనవైపు, తన దుస్తులవైపు చూచుకొంటున్నారు. ఎదురుగా గాంధీగారు నవ్వుతూ ఏదో మాట్లాడబోయారు. అయిదేళ్ళ చిట్టి "తాతయ్యా బొమ్మలపెళ్ళికి రావా?" అని పిలుస్తోంది...చిట్టిని ఎత్తుకున్నాడు "తాతయ్యా, గాంధీని చంపేశారు" అంటోంది..."అవునమ్మా, అవును"...కన్నీళ్ళు ఆపుకోలేకపోతున్నారు.

స్వప్నంనుంచి మెలకువ వచ్చింది...తెల్లవారుతోంది...

"నేనీ ప్రొద్దుటి బండికే వెళ్తాను. ఇంకా ఒక గంట ఆలస్యం వున్నట్టుంది."

"ఈ పూట వుండి వెళ్ళండి...బహుశా సత్యం ఇవాళ వస్తాడు. నిన్న మీకు ఉత్తరం వ్రాసేటప్పటికి అమ్మాయి రాజమండ్రిలో వుందని తెలీదు. లేకపోతే నేనే సత్యాన్ని తీసుకుని మీ దగ్గరకు వచ్చేవాణ్ణి" అన్నాడు విశ్వనాథం.

ఆయన తన మనస్సేమిటో తెలియబరచలేదు. ఆయన మౌనం చూస్తే విశ్వనాథానికి అనుమానం కలుగుతోంది.

"అమ్మాయి విషయం చివరకేం నిశ్చయించారు?" అని ప్రశ్నించాడు.

"ఇందులో నేను నిశ్చయించేదేమీ కనిపించటం లేదు!"

"అలాకాదు, అమ్మాయి మీ మీదే పూర్తిగా ఆధారపడివుంది."

"అలా ఆధారపడలేదనీ, ఆధారపడకూడదనీ నువ్వేగా రుజువుచేశావు రాత్రి!"

విశ్వనాథం నొచ్చుకున్నాడు.

"బాబాయ్, నేనేమీ రుజువు చెయ్యలేదు... అమ్మాయి మీ అనుమతి లేనిది ఒక్క అడుగుకూడా

మంగళకు వెయ్యి రేవనేగా తెలుస్తోంది జరిగినదాన్ని బట్టి!"

"విశ్వనాథం, నేను నిశ్చయాలు చేసే కాలం, పరిధిని దాటిపోయాయని గుర్తించాను. "నిర్మమో నిరహంకారః స శాంతిమ్ అధిగచ్ఛతి" అన్న ఉపదేశమే నాకు శరణ్యం..."

"కాని మీ రాశీర్వదించ వలసినప్పుడు ఆశీర్వదించకపోవటం కూడా ఒక నిశ్చయమే! అందులో మాత్రం మమకారం వుండదంటారా?"

"ఎంతసేపైనా వాదిస్తూ పోవచ్చు; నాకు వేళైంది విశ్వనాథం."

"నేనూ వస్తాను పదండి."

"వద్దు...నన్ను వెళ్ళనియ్యి."

"అయితే నేను రేపు సత్యాన్ని తీసుకొస్తాను."

రైల్లో కూర్చున్న తర్వాత వచ్చిన స్వప్నం గుర్తు వచ్చింది. సూర్యనారాయణ గారికి ఆనాటి రోజు రైల్లో తను ఆలోచించిన సమస్యకు అదీ జవాబు: చిహ్నాలను విసర్జించినే కాని విముక్తి, భగవంతునితో ఐక్యం సాధ్యం కావు... చిహ్నాలంటేవి బాహ్య చిహ్నాలే కావు, మనోదృక్పథాలు, ఆదర్శాలు కూడా చిహ్నాలే. జీవితాంతంలో కర్మ చేస్తున్నంతసేపు త్యాగస్ఫూర్తి, మానవసేవ సర్వసాధనకు పరికరాలు, గాండీవంలాగ...ధర్మసాధన అయిపోయిన తర్వాత వాటి నంటిపెట్టుకోవటం, వాటి మీద మమకారం బంధనహేతువు...విశ్వనాథం అన్నట్లు తనలోనూ ఒక 'ప్రతిక్రియ' లేకపోతే, మనుష్యుల్లో తనకు నిత్యమూ కనిపించేవి స్వార్థం, సంకుచితత్వం తప్ప మరొకటి లేదు! ఎందుకని? తనకూ మనుష్యులకూ మధ్య, చివరకు తనకూ చిట్టికీ మధ్య యీ అపశ్రుతి, తనలో ఈ అశాంతి, అసహనం, రావటానికి కారణాలు తనమనస్సులో నిలిచిపోయిన 'చిహ్నాలు'. వాటి కొలతబద్దలకు అందని మానవత్వం తనకు పనికిమాలినదైపోయింది; కాని అందిన మానవత్వం ఎక్కడా కనిపించలేదు, తన ఊహలో తప్ప! తనలో మాత్రం క్షమ, సహనం లోపించలేదా? జ్ఞానోదయానికే యీ పరీక్ష పెట్టాడు భగవంతుడు...అన్ని కర్మలూ జ్ఞానంలో పర్యవసిస్తాయనీ, చివరకు జ్ఞానంకూడా 'యజ్ఞ' వస్తువుగా అర్పితం కావాలనీ గీత చెబుతున్న మాటకు యిప్పుడే అర్థం తెలిసివస్తోంది. జీవితానుభవంలో గడించిన జ్ఞానం సర్వం యిలా సమర్పణ అయినతర్వాత మిగిలేదేమిటి? శూన్యమా? కాదు, శూన్యమన్న భయం రాత్రి మనస్సును కలత పెట్టింది, కానీ కృష్ణభగవానుడు "శూన్యం కాదు, నేనే ఉన్నా"నన్నాడు...ఎక్కడ? జ్ఞానానికి అవతలి ఒడ్డున..."సర్వధర్మాన్ పరిత్యజ్య మామ్ ఏకమ్ శరణం వ్రజ" అని పిలుస్తున్న శ్రీకృష్ణుని కన్న శరణ్యం ఏమివుంటుంది?

ఇల్లు చేరుకోగానే రుక్మిణమ్మ ప్రశ్నించింది: గుంటూరు వెళ్ళిన కార్యం ఏమైంది. "చిట్టికేనా పెళ్ళి సంబంధం వచ్చిందా...నీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు నీరసంగా.

* * *

"చిట్టికి తగిన సంబంధమంటే అపురూపమే... అలా అన్నివిధాలా సరితూగితే, అమ్మాయి యిష్టపడితే...అంతకన్న అదృష్టమా?" అన్నది రుక్మిణమ్మ. ఆమె ఉత్సాహం చూచి, నిట్టూర్చి, తనగదిలోకి వెళ్ళిపోయాడు.

ఆరోజు సాయంత్రం బండికి స్వరాజ్యం, విమలా, విమల పిల్లలూ వచ్చారు. రుక్మిణమ్మ సంతోషంతో ఏదో చెప్పుతోంది వాళ్ళకు...

పడకకుర్చీలో కూర్చుని కిటికీ అవతల ముసురుకొంటున్న చీకట్లలోకి చూస్తున్నాడు...ఇంకా చంద్రోదయం కాలేదు...స్వరాజ్యం వచ్చి కుర్చీ ప్రక్కన నేలమీద కూర్చుంది..."తాతయ్యా..." జవాబు లేదు..."తాతయ్యా, నన్ను క్షమించు తాతయ్యా...నేను యీ చదువు మాత్రం మానేస్తాను...వివాహం ముఖ్యం కాదు... నేను డాక్టరు కావటం లేదని కోపమా తాతయ్యా...నన్ను నీదగ్గరే వుండనియ్యి...క్షమించవా తాతయ్యా..." కంఠం వణికింది...తాతయ్య ఒళ్ళో ముఖం దాచుకుని దుఃఖాన్ని ఆపుకోలేక పోయిన మనవరాల్ని...తల నిమురుతూ...చంద్రోదయాన్ని తదేకంగా చూస్తున్నాడు. చంద్రబింబం ప్రకాశమానమైనట్లుంది... దృష్టిని మార్చివేశాయి కన్నీటి తెరలు...కళ్ళుమూసుకున్నాడు...చంద్రుడిబగాలు "తాతయ్యా, బొమ్మల పెళ్ళి చేస్తాను రావా" అంటున్న అయిదేళ్ళ చిట్టి యొక్క మూర్తి...అదే చిన్నికృష్ణుని ప్రతిరూపమన్న మహదనుభూతి హృదయంలో...

"మ్యావ్" అందిపిల్లి...కళ్ళు తెరిచాడు...మసక చీకట్లో తెల్లగా పెంపుడుపిల్లి, స్వరాజ్యం వీపును ఆప్యాయంగా ఒరుసుకొంటూ 'మ్యావ్' అని మారాము చేస్తున్నది...

అప్పుడన్నారు సూర్యనారాయణగారు: "చిట్టీ, దొంగతనం నేర్పిందమ్మ నీపిల్లి యీమధ్య..."

ఆమె కళ్ళు తుడుచుకొని, పిల్లిని ఒడిలోకి తీసుకొన్నది.

"దానికి ఆకలిగా వున్నట్లుంది, వెళ్ళి పాలూ అన్నం పెట్టు" అన్నారాయన.

విమల వచ్చి గదిలో లైటు వేసింది. పంతులుగారామెతో "విమలా! రేపు విశ్వనాథం సత్యాన్ని తీసుకొస్తాడట!...సత్యం అంటే మన చిట్టి కాబోయే భర్త."

స్వరాజ్యం పిల్లిని తీసుకొని పారిపోయింది.

# చైనా ఆర్థిక వ్యవస్థ: మార్క్స్ వాదం

శ్రీ బులుసు వేంకటసుబ్బారావు

ఒక దేశంలో సామ్యవాద విప్లవసాధనద్వారా పెట్టుబడిదారీ విధానాన్ని సమూలంగా ఎట్లు రూపుమాపాలో, ఆ విప్లవాన్ని వివిధ సాంఘిక తాత్త్విక, ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలు ఎలా సమర్థింపగలవో కారల్ మార్క్స్ విశదంగా తెలియబరచారు. అయితే విప్లవం విజయవంతమై, దేశంలో కార్మికవర్గ నియంతృత్వం నెలకొన్న తరువాత, ఆర్థికవ్యవస్థను ఎట్టి ప్రణాళికద్వారా నిర్మించాలో మార్క్స్ వివరింపలేదు. సామ్యవాద వ్యవస్థలో ఒక సుస్థిరమైన కార్యక్రమాన్ని మార్క్స్ సూచించలేదు. కాబట్టి మార్క్సిజమ్ మాపేదారి పెట్టుబడిదారీ విధాన వినాశనంతోను, శ్రామికవర్గ నియంతృత్వ సంస్థాపనతోను అంతమౌతుంది. సామ్యవాదవ్యవస్థ సిద్ధించగనే, పెట్టుబడిదారుల యాజమాన్యం నశించడంవలన శాంతి సౌఖ్యాలు, ఆర్థికశ్రేయస్సు వాటంతటవే క్రమంగా నెలకొంటాయని, కనుక నియంతృత్వప్రభుత్వం సహజంగా అంతర్హితమై అందరూ, అందరికోసం శ్రమించి జీవనం గడిపే అపూర్వ మహోత్కృష్టమైన సామ్యవాద స్వర్గం లభ్యమౌతుందని కారల్ మార్క్స్ భావించారు. విప్లవ సాధనానంతరం, ఆయన "అదిగో ఆ పరమావధిని మనం చేరుకోవాలి!" అని ఒక లక్ష్యాన్ని చూపించారే కాని తత్సాధనమార్గాన్ని సూచింపలేదు. కారల్ మార్క్స్ రచనల్లో ఇది ఒక పెద్దలోపంగా ఆర్థికశాస్త్రజ్ఞులు భావించారు.

అయితే, ఒక ముఖ్యసిద్ధాంతం మాత్రం విప్లవానంతర ఆర్థికవ్యవస్థకు మూలాధారంగా నిలుస్తూనే ఉంటుంది. దేశంలోని ఉత్పత్తిసాధనాలన్నీ ప్రభుత్వ యాజమాన్యం క్రింద ఉండాలి అన్నదే యీ ఆధార సిద్ధాంతం. దేశంలో చిన్న, పెద్ద విచక్షణ లేకుండా పరిశ్రమలు, వ్యవసాయం, రవాణా, గనులు, విద్య, వర్తక వ్యాపారాలు అన్నీ ప్రభుత్వయాజమాన్యాననే నడపబడాలి. పెట్టుబడి పెట్టేవారు స్వంత పెట్టుబడిదారులు కారు. స్వలాభాపేక్ష లేని ప్రభుత్వమే పెట్టుబడి పెడుతుంది. శ్రామికులకు వేతనాల నిచ్చేదికూడా ప్రభుత్వమే. దేశంలోని ఆర్థిక రంగమంతా ప్రభుత్వ శాసనం మూలకంగానే నడుస్తుంది. వ్యవసాయం విషయంలో కూడా అంతే. భూమంతా ప్రభుత్వ యాజమాన్యాన సేద్యం చేయబడాలి. ఈ సిద్ధాంతం కాక మరికొన్ని చిన్న విషయాలను కూడా మార్క్స్ సూచన చేశారు. ఆయన దృక్పథంలో ఆర్థిక వ్యవస్థ డబ్బుమీద ఆధారపడరాదు. డబ్బు—అంటే కరెన్సీ పత్రాలు, నాణాలు, బ్యాంకు నోట్లు ఇవన్నీ కూడ—పరిపూర్ణ సామ్యవాద వ్యవస్థలో అంతరించి పోవాలి. అప్పుడే ఆ ఆర్థిక వ్యవస్థకు స్థిరత, సామ్యవాద తత్త్వం వస్తాయి. ధరలు హఠాత్తుగా పెరగడం, ఆర్థిక రంగంలో మాంద్యం, పాటుపోట్లు, స్వంతలాభాలు ఇవన్నీ కూడా డబ్బు చెలామణీ దోషాలవలననే సంభవిస్తూంటాయనీ, కావున సహజమైన వస్తు వినిమయ పద్ధతితో ఈ డబ్బు వ్యవహారం అంతమవాలనీ కారల్ మార్క్స్ సూచించారు. మరొక విషయమేమంటే వివిధ రంగాలలో శ్రామికుల కిచ్చే వేతనాలు సమానంగా ఉండాలి. ప్రభుత్వ యాజమాన్యంలో కొన్నిచోట్ల వేతనాలొక విధంగాను మరికొన్నిచోట్ల మరొకవిధంగాను ఉండరాదు. అంటే, వేతన నిర్ణయం. శ్రామికశక్తి, గిరాకీ, సరఫరాలపై ఆధారపడరాదు. వివిధ సంస్థల నడుమ స్పర్ధమూలంగా వేతన నిర్ణయం జరగకూడదు. పెట్టుబడిదారీ విధానంలో స్పర్ధ, లేక పోటీ ఒక ముఖ్యదోషం కాబట్టి ఆ దోషాన్ని సామ్యవాదవ్యవస్థలో ప్రవేశింపనీయకూడదు. కాబట్టి శ్రామికులకు ప్రభుత్వ మొసగే వేతనాలు, సరఫరా, గిరాకీల స్పర్ధ మూలంగా కాక వారి శ్రమపరిమాణంపై ఆధారభూతమై సమత్వం కలిగి ఉండాలి.

కాబట్టి మార్క్సిజమ్‌ను అవలంబించే దేశాలకు ఒక ప్రత్యేక ప్రణాళికను మార్క్స్ సూచింపక పోయినా ఆయన మూలసిద్ధాంతమైన—ఉత్పత్తి సాధనాలన్నీ ప్రభుత్వ యాజమాన్యాన వర్తించాలి—అన్నది ఆధారభూతంగా ఆయా దేశాలలో ఆర్థిక వ్యవస్థలు నిర్మింపబడాలి. మిగిలిన విషయాలు ఆ వ్యవస్థకు సమన్వయింపబడాలి. ఇక విప్లవాన్ని ఇటీవలే సాధించి (సం 1949 అక్టోబరు 1 వ తేదీ) మార్క్సిస్టు ఆర్థిక వ్యవస్థా నిర్మాణంలో నిమగ్నమైన చైనా విషయాన్ని మనం పరిశీలిద్దాం.

నిజం చెప్పాలంటే దేశకాల పరిస్థితుల దృష్ట్యా విప్లవాన్ని సాధించి సామ్యవాద సమాజాన్ని స్థాపించే ఆవశ్యకత, 1949 నాటికే కాదు, నేటికి కూడా చైనా దేశానికి లేదు. ఈ వాదాన్ని సమర్థించేది పెట్టుబడి దారులు కారు, సామ్యవాద మూలపురుషుడైన కారల్ మార్క్స్! ద్వంద్వ సంఘర్షణాత్మక భౌతికవాదం ప్రకారం, చరిత్రకారుడు చేసిన భౌతిక వ్యాఖ్యానం ప్రకారం కూడా విప్లవావశ్యకత— పెట్టుబడిదారీ వర్గం, కార్మికవర్గం రెండు విభిన్న వర్గాల క్రింద రూపొందితే, పెట్టుబడిదారీ వర్గం స్వలాభం కొరకు రెండవ వర్గాన్ని అణగద్రొక్కే పరిస్థితుల్లో కలుగుతుంది. ఈ వర్గ సంఘర్షణకు, బీజం పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ మహత్తరంగా పురోభివృద్ధి చెందినప్పుడు కలిగి, వృద్ధిపొంది విప్లవానికి దారితీస్తుంది. కాబట్టి ఒక్క ముక్కలో చెప్పాలంటే సామ్యవాద విప్లవానికి అనువైన దేశాలు—ఇండియా, చైనా, లంక, బర్మా, మొదలైన వెనుకబడిన వ్యవసాయిక దేశాలు కావు; పారిశ్రామిక పురోగమనం పరాకాష్ఠనంది, పెట్టుబడిదారీ వర్గం మహోన్నత స్థితికి వచ్చిన జర్మనీ, అమెరికా, ఫ్రాన్స్, బెల్జియం మొదలైన దేశాలు! 1949 నాటికి చైనాదేశంలో పరిశ్రమలు ప్రారంభదశలో కూడా లేవు. పరిశ్రమాభివృద్ధి లేనిదే ఇటు పెట్టుబడిదారీ వర్గం బలవత్తరమైనది ఉండదు, అటు కార్మికవర్గం బలవత్తరమైనది ఉండదు. అసలు ప్రవర్ధమానమైన పరిశ్రమలతో తులతూగిపోతున్న దేశంలో కదా పెట్టుబడిదారులంతా ఏకమై కార్మికవర్గాన్ని అణగద్రొక్కేస్తున్నారే అన్న పరిస్థితి ఏర్పడడం...అప్పుడు కార్మిక విప్లవం రావడమూను... కాబట్టి, మార్క్సిస్టు దృక్పథంతో వీక్షిస్తే చైనా విప్లవం అసహజంగాను, అకాలంలోను వచ్చినదిగాను తేలుతుంది. అచట విప్లవ కారకాలు కారల్ మార్క్స్ సూచించిన ఆర్థిక, చారిత్రక, సాంస్కృతిక పరిణామాలు కావు. కేవలం రాజకీయ కారణాలు మాత్రమే!

ఇంతకూ చెప్పబోయే దేమంటే, చైనా దేశంలో సామ్యవాద ఆర్థిక వ్యవస్థకు ప్రథమ సోపానమైన విప్లవవిషయంలోనే ఆ దేశపు విప్లవనాయకులు మార్క్సిజానికి అడ్డదార్లు త్రొక్కారని. ఇది మంచిదా, చెడ్డదా అనే విషయం చరిత్ర గతే తేలుస్తుంది.

ఇక విప్లవానంతరం జరిగిన సామ్యవాద ఆర్థిక సమాజ స్థాపన కృషిని పరిశీలిద్దాం. మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఉన్నదున్నట్లుగా ఆచరించడం ఏ దేశీయులకైనా దుర్లభమైనదే! సోవియట్ రష్యాలో లెనిన్ స్టాలిన్‌లు సహితం దానికి మార్పులు చేయకతప్పలేదు. అలాగే చైనా విషయంలోనూ.

కారల్ మార్క్స్ సిద్ధాంతాలను తన దేశపరిస్థితులకు అన్వయించిన చైనా నాయకుడు మావో-సే-టుంగ్. ప్రఖ్యాత చైనా సామ్యవాద సిద్ధాంతి, ప్రస్తుత చైనా అధ్యక్షుడు అయిన లియుషావ్ చి మావోను గురించి అన్న వాక్యాలివి—"అత్యంత కష్టసాధ్యమైన, చైనాలో మార్క్సిజాన్ని స్థాపించే కార్యాన్ని చేపట్టి, మహోన్నతంగాను, విజయవంతంగాను కృషి చేసిన మహాపురుషుడు మన కామ్రేడ్ మావో! చైనా పరిస్థితుల కనుగుణంగా మార్క్సిజాన్ని అన్వయించడంలో ఈయన చేసిన కృషి ప్రపంచ మార్క్సిస్టు చరిత్రలో అత్యద్భుత కార్యాలలో ఒకటి. ఈ అపూర్వ మహోన్నత విజయం 60 కోట్ల జన సంఘంతో విలసితమైన ఈ జాతిలో అన్నిటి కన్నా పరమోత్కృష్టమైన సత్యం. ఈ మహాకృషికి మనం ఆయనకు కృతజ్ఞులమై ఉండాలి."

ఈ వాక్యాలు ముఖస్తుతిగా కనబడినప్పటికీ వాటిలో సత్యం ఉంది. అతి విస్తృతమై, 60 కోట్ల మంది దీన ప్రజలతో, స్పర్థలతో, దారిద్ర్యంతో— అనేక విఘాతాలతో వందల సంవత్సరాలుగా పరదండయాత్రలతో, అంతర్యుద్ధాలతో సతమతమైన ఆ మహాదేశంలో సామ్యవాద ఆర్థిక సమాజాన్ని స్థాపించి 60 కోట్ల మంది జీవన ప్రమాణాలను ఉన్నత స్థాయిలోనికి తేవడం సులభ సాధ్యమైన పనికాదు. వివిధ ఆర్థిక విషయాలలో వారు సాధించిన సంస్కరణలను పరిశీలిద్దాం.

వ్యవసాయరంగంలో భూమిని సమాజపరం చేయడానికి మొదట వేలకొలది సమష్టి సంఘాలు స్థాపింపబడినాయి. భూమి ఖామందుల యాజమాన్యం నుండి చాల వరకు ఈ సమష్టి వ్యవసాయ సంఘాల యాజమాన్యం క్రిందకు తీసుక రాబడింది. మన దేశం లావలెనె చైనాలో కూడా వివిధ రంగాలలో అభివృద్ధికి విస్తృతమైన ప్రణాళికలు ప్రవేశపెట్టబడ్డాయి. 1949 నుండి 52 వరకు ఒక త్రివర్ష ప్రణాళిక దేశంలో అంతర్యుద్ధపు విషమ పరిస్థితులను చక్క పరచేందుకు, ఉత్పత్తిసాధనాలను స్వాధీనపరచుకుని దేశంలో భావి సామ్యవాద ఆర్థిక వ్యవస్థకు పునాదులు నిర్మించేందుకు కృషిజరిగింది. తరువాత 1952 నుండి 1957 వరకు ఒక పంచవర్ష ప్రణాళిక అమలుపెట్టబడింది. దీనిలో ముఖ్య పరిశ్రమల వృద్ధికి, వ్యవసాయం, నీటి

# చైనా ఆర్థిక వ్యవస్థ: మార్క్సు వాదం

పారుదల అభివృద్ధికి కృషి జరిగింది. ప్రస్తుతం చైనాలో తృతీయ ప్రణాళిక అమలులో ఉంది. మొదటి రెండు ప్రణాళికలందూ వ్యవసాయరంగంలో సహకార వ్యవసాయసంఘాల అభివృద్ధికి మహత్తరకృషి జరిగింది.

అయితే అంతటి విస్తృతమైన, జనసమృద్ధమైన దేశంలో రైతుల అవసరాలకు ఈ సమష్టి వ్యవసాయ సంఘాలు చాలకపోవడంవలన, కేవలం వ్యవసాయంలోనే కాక వివిధరంగాలలో గ్రామీణులకు నూతనవికాసం కలుగచేసేందుకు, ఈ సహకార సంఘాలస్థానే క్రమంగా ప్రజాసమాఖ్యల నిర్మాణానికి కృషి జరుగనారంభించింది. ప్రస్తుతం దేశవ్యాప్తంగా 23,384 ప్రజాసమాఖ్యలు ఏర్పడ్డాయి. ఇంకొ రెండుమూడువేల సమాఖ్యలు ఏర్పడనున్నాయి. ఒక్కొక్క 'కమ్యూను'లో సగటున 4,797 రైతుకుటుంబాలవారు సభ్యులుగా చేరారు. ఒక్కొక్క తాలూకాలో సగటున 94 కమ్యూన్లు ఉంటాయి.

ఈ విధమైన కమ్యూన్ల సంస్థాపన చైనాలో నూతన ఆర్థిక వ్యవస్థకు బలమైన పునాది అని చెప్పవచ్చు. ఈ కమ్యూన్లవలన సహకార సంఘాలకన్న ఎక్కువ ప్రయోజనాలు కలుగుతున్నాయి. గ్రామీణ శ్రామికశక్తి సక్రమ వినియోగానికి, గ్రామీణుల్ని సరియైన రంగాలలో అత్యధిక శ్రేయోదాయకంగా నడిపింపబడటానికి, కావలసిన పరికరాల వినియోగానికి కమ్యూన్లు బాగా ఉపకరిస్తున్నాయి.

గ్రామీణ ప్రాంతాలందు వివిధ రంగాలలో, సమైక్యమైన కృషిజరగడానికి కమ్యూన్ల పద్ధతి బాగా వినియోగపడుతోంది. ఒకవంక వ్యవసాయంలో నూతన పరికరాలను, క్రొత్త ఎరువులను, మేలైన విత్తనాలను ప్రవేశపెడుతూ ఈ కమ్యూన్లు, రైతాంగ ప్రజలలో బుద్ధివికాసానికి, విద్యావ్యాప్తికి, రాజకీయ పరిజ్ఞానానికి, సాంస్కృతిక అభ్యుదయానికి మరొకవంక కృషిచేస్తాయి. ఎవరివ్యక్తిత్వానికి సరిపడ్డవిధంగా, ఎవరి మనసుకునచ్చిన మార్గంలో వారికి సృజనాత్మకమైన విద్యనభ్యసింపచేయడానికి కమ్యూన్ల యాజమాన్యంలో పాఠశాలలు, కళాశాలలు నిర్మితమౌతున్నాయి.

కేవలం ఈ బహుముఖాభివృద్ధే, కమ్యూన్ల పరమోద్దేశ్యం కాదు. ఈ అభివృద్ధితోబాటు క్రమంగా మార్క్సిస్టుఆర్థిక సమాజాన్ని స్థాపించడంకూడా చాలా ముఖ్యమైన విషయం. చైనాలో వ్యవసాయ క్షేత్రమంతా ఇంకా సంపూర్ణంగా ప్రభుత్వ యాజమాన్యం క్రిందకు రాలేదు. ఆ విధంగా రావాలి అంటే సమష్టి వ్యవసాయ సంఘాలద్వారా కన్న ఈ కమ్యూన్లద్వారా కృషి ఎక్కువ ఫలోన్ముఖంగా ఉంటుంది. ఇంకొక విషయ మేమంటే సమష్టిసంఘాలకన్న ఈ కమ్యూన్లు అధికారికమైనవి. సంఘాలలోకన్న కమ్యూన్లలో ప్రభుత్వ ప్రాబల్యం బాగా ఎక్కువగా ఉంటుంది. కమ్యూన్లు వ్యవహరించే పరిధి క్రమక్రమంగా విస్తృతమౌతూ కడకు దేశమంతా అవి నెలకొంటాయి. కమ్యూన్లు కేవలం వ్యవసాయ రంగాభివృద్ధికి మాత్రమే సంబంధించినవి కాక సర్వతోముఖాభివృద్ధికై కృషి చేసేవి కావటంవలన సమగ్రమైన, సక్రమమైన, సామ్యవాద ప్రణాళిక ద్వారా, మార్క్సు మూల సిద్ధాంతాచరణ సులభసాధ్యమవుతుంది.

ఈ విధంగా చైనాలో ప్రజా కమ్యూన్ల సంస్థాపన, వాటి విస్తృతి, మార్క్సిస్టు ఆర్థిక వ్యవస్థకు దోహదకారి అనడంలో సందేహంలేదు. అయితే ఈ కమ్యూన్ల ఉద్యమం పూర్తి కాలేదు. కొద్ది సంవత్సరాలలోనే పూర్తి అవుతుంది. పూర్తి అయిన తరువాత క్రమక్రమంగా ఉత్పత్తిసాధనాలన్ని ప్రభుత్వపరం కావడం, కార్మికుల వేతనాలలో సమత్వం సిద్ధించడం జరుగుతుంది. ఈ మహోద్యమ నాయకుడు చైనా కమ్యూనిస్టు పార్టీ సూత్రధారుడైన జనరల్ మావో-సే టుంగ్.

ఇక పారిశ్రామిక రంగంలో ఈ నూతన వ్యవస్థ ఏ విధంగా సాధింపబడుతోందో పరిశీలిద్దాం. చైనాలో నేడు వర్తకవ్యాపారాలు, పారిశ్రామిక సంస్థలు, రవాణా, మొదలైన వ్యవసాయేతర ఉత్పాదక శక్తులు పూర్తిగా ప్రభుత్వపరం కాలేదు. ఈ సంస్థలు ప్రభుత్వపర మయేటందులకు తీసుకొన్న ప్రథమచర్య సహకారోద్యమం,—ప్రభుత్వ – వ్యక్తిగత భాగస్వామ్య వ్యాపారం. పారిశ్రామిక రంగంలో చైనాలో విప్లవం రాకమునుపే అనేకసహకారసంఘాలు నెలకొన్నాయి. విప్లవం వచ్చినతరువాత అనేకపారిశ్రామిక సంస్థలు ఈ సంఘాలయాజమాన్యం క్రిందకు వచ్చాయి. అయితే ఇది, మార్క్సిస్టు వ్యవస్థకు తొలిమెట్టుమాత్రమే! ఈ సహకార సంఘాల యాజమాన్యంనుండి అవి క్రమంగా ప్రభుత్వపరం కావాలి. సహకార సంఘాలద్వారా కాక మరొకవిధంగాకూడా పారిశ్రామిక సంస్థలను ప్రభుత్వపరం చేసేకృషి జరుగుతోంది. ఇది ఎలాఅంటే, వ్యక్తిగత యాజమాన్యంక్రింద నున్న సంస్థలను ఒకేసారి కాక అంచెలవారీగా ప్రభుత్వం తనపరం చేసుకొంటుంది. అనగా ఈ సంస్థలు మొదటిదశలో కొంత

వరకు ప్రభుత్వ యాజమాన్యంక్రింద, కొంతవరకు వ్యక్తుల యాజమాన్యంక్రింద ఉంటాయి. కాలక్రమానుగతంగా ప్రభుత్వాధికారం విస్తృతం కావడం, వ్యక్తి అధికారం తగ్గడంతో పూర్తిగా ప్రభుత్వపరం కావడం సంభవిస్తుంది.

అయితే ఈ పారిశ్రామిక, వాణిజ్య సమాజీకరణ కార్యక్రమంలో (Socialist Transformation of the Private Industry and Commerce Programme) కష్టమైన విషయం, భారీపరిశ్రమలను ప్రభుత్వపరం చేయడంలో కాక, అసంఖ్యాకములు, పరిమితములు అయిన చిన్న చిన్న సంస్థలను ప్రభుత్వపరం చేయడంలో ఉత్పన్నం కావడం గమనార్హం. చిన్న సంస్థలంటే, గ్రామీణ పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, చేతిపనులు, చిన్న అంగళ్ళు, ఒకరు లేక చాలతక్కువమంది భాగస్వాములుండే అల్పమైన వర్తక వ్యాపారసంస్థలు మొదలైనవి. వీటన్నిటినీ సమగ్రంగా పరిశీలించి, ఆయా వ్యక్తులకు నిరుద్యోగం సంభవించకుండా సంస్థలను ప్రభుత్వపరం చేయడం చాలా కష్టసాధ్యమైనపని. ఈ కార్యక్రమం పూర్తిగా సిద్ధించడానికి దీర్ఘమైన కాలవ్యవధి అవసరం.

అందుకే 1956 జూన్ 15 వ తేదీన ప్రారంభమైన చైనా జాతీయ ప్రజామహాసభ మూడవ సమావేశంలో మాట్లాడుతూ 'స్టేట్ కౌన్సిల్' ఉపప్రధాని అయిన చెన్ యున్ ఇలా అన్నారు. "ఈ బృహత్సమాజీకరణ కార్యక్రమంలో ఒకదాని వెనుక ఒకటిగా మనం పరిష్కరించవలసిన సమస్యలు అనేకం ఉన్నాయి. ఇవన్నీ పరిష్కరించుకొంటూ గమ్యాన్ని చేరుకోవడం కష్టసాధ్యమైనపని. తప్పులు అనేకం కలగవచ్చు. అయితే వాటిని వెనువెంటనే దిద్దుకొంటూ, ముందుకు సాగిపోవాలి."

ఇదే సందర్భంలో చెన్ యున్ ఈ సమాజీకరణంలో ఉత్పన్నమయే అయిదు ప్రధానమైన సమస్యలను పేర్కొన్నారు. "మొదటిది: చిన్న సంస్థలు, అంగళ్ళు మొదలైన వాటి యజమానులు తమ జీవనాధారాలను కోల్పోకుండా చూడడం. రెండవది: ఈ చిన్నతరహా సంస్థల యజమానులను పీడించే అనేక ఆటంకాలను తొలగించడం. మూడవది: మొదటి దశలో సంభవమయే ప్రభుత్వ—వ్యక్తి భాగస్వామ్య సంస్థలందు ప్రభుత్వమునకు వ్యక్తులకు నడుమ ఉండవలసిన సంబంధాలను నిర్ణయించడం. నాలుగవది: ఈ విధమైన భాగస్వామ్యసంస్థలందు, వ్యక్తుల అజమాయిషీ క్రింద పనిచేసే శ్రామికుల వేతనాలను నిర్ణయించి వారి సంక్షేమాన్ని పరిరక్షించడం. అయిదవది: వివిధ పరిశ్రమల పునర్వ్యవస్థీకరణం."

మొదటి తరగతికి చెందిన ప్రభుత్వంపై ఆధారపడకుండా చిన్నతరహా సంస్థలను, అంగళ్ళను నిర్వహించుకొని జీవనాధారం చేసుకొనే కుటుంబాల సంఖ్య చైనా దేశమంతటికీ కలిపి మొత్తం 2,400,000. ఈ కుటుంబాలలో ఇప్పటికి కొంతమంది వ్యక్తులు సహకార సంఘ నిర్వహణలోనున్న సంస్థలలో చేరారు. వీరి సమస్యలను పరిశీలించి, వీరి కేవిధమైన కష్టనష్టాలు కలుగకుండా క్రమంగా సహకార సంఘాలలో వారిని చేర్చడానికి ప్రభుత్వం కృషిచేస్తోంది. ఇదేవిధంగా ఇతర సమస్యలకు కూడా పరిష్కారమార్గాలు విజయవంతంగా యోచింపబడుతున్నాయి.

పరిస్థితుల కనుగుణమైన మార్పు ఉండాలని చైనా నాయకులు సమ్మతించారు. సిద్ధాంత విషయంలో స్థిరాభిప్రాయం, తదాచరణలో అవసరమైనంతవరకు వాస్తవిక పరిస్థితుల గమనిక ఉండాలని వారి అభిప్రాయం. దీనినే లియుషావచి స్పష్టంగా వ్యక్తపరిచారు. "మనపక్షం (కమ్యూనిస్టుపార్టీ) సిద్ధాంత విషయంలో నిశ్చితంగా వ్యవహరించవలసినప్పటికి, ఆ సిద్ధాంతాలను ఆచరించడంలో మార్పు చేయడానికి సంసిద్ధులమై ఉండాలి." కమ్యూన్లు, సహకార సంఘాలు, ప్రభుత్వ-వ్యక్తి భాగస్వామ్య సంస్థలు, ఇవన్నీ కూడా పై అభిప్రాయంతోనే సృష్టింపబడ్డాయి.

పై విధానాన్ననుసరించడంవలన క్రమానుగతమైన అవసరసంస్కరణలను చేయడంవలన, ఆర్థికరంగంలో చెప్పుకోదగిన విజయాలను నవచైనా సాధించింది. ఈ విజయాలను లెక్కకు తీసుకొనేటప్పుడు, మన దృష్టిని కేవలం ఆర్థికరంగానికే పరిమితం చేయడం అత్యవసరం అని గుర్తుంచుకోవాలి. ఈ సంస్కరణలు జరపడంవలన రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక వాతావరణంలో ఎట్టి మార్పులు జరుగుతున్నాయో, అవి అభిలషణీయమో, అనభిలషణీయమో, మొదలైన వాటివంక మన దృష్టి సారించకూడదు.

# చైనా ఆర్థిక వ్యవస్థ: మార్క్సు వాదం

వ్యవసాయరంగంలో చైనా మంచి అభ్యున్నతిని సాధించగలిగింది. వరదలతో దేశాన్ని గంగపాలుచేసే నదులకు డాములనుకట్టి భూమిని సారవంతం చేయడంలో వారు చాలవరకు కృతకృత్యులయారు. వారి తృతీయప్రణాళిక (1957–62) మొదటి సంవత్సరాంతానికి 7 కోట్ల 50 లక్షల ఎకరాలకు నీటివసతి కల్పిస్తుంది. గత సంవత్సరంకన్నా ఆహారధాన్యాల విషయంలో 60, 70 వంతుల అభివృద్ధి కనబడినది. దేశంలో ముందు సంవత్సరాంతానికి మనిషి ఒక్కింటికి సగటున 7 బస్తాలధాన్యం వస్తుంది. వారి ఆశయం మరొక వత్సరంలో తలకు, సగటున 10 బస్తాలు రావాలని. బహుశా సాధ్యంకావడానికి అవకాశంఉంది. అధికోత్పత్తికాధారభూతాలైన నీటిపారుదల, ఎరువులు, భూసార పరిరక్షణ, మేలైన విత్తనాలు, లోతుగా దున్నడం మొదలైన విషయాలలో ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ తీసుకొంటుంది. అధికోత్పత్తికి నూతనవిధానాలపై పరిశోధనలు జరుగుతున్నాయి. ఉన్న పనిముట్లను పూర్తిగా వినియోగించడంలోను, ఎక్కువ సౌకర్యం కలిగిన నూతన పరికరాలను, కనిపెట్టడంలోను రైతులే ముందంజ వేసేటట్లు కృషి జరుగుతోంది. తేయాకు, జనపనార, బీటు, పంచదార, చెరకు, గోధుమ, రామి మొదలైన వాణిజ్యపుపంటలలోకూడ అధికోత్పత్తిసాధింపబడింది.

పారిశ్రామిక రంగంలోకూడ ఈ విధమైన విజయాలు సంప్రాప్తించాయి. చైనా, సోవియట్ రష్యా మాదిరిగా, పారిశ్రామిక పురోభివృద్ధికొరకు వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేయకపోవడం ప్రశంసనీయం. ఇనుము, ఉక్కు పరిశ్రమల్లో బ్రిటన్‌ను అధిగమించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. యంత్ర నిర్మాణ పరిశ్రమలు, రహదార్లు, రవాణా, లఘు పరిశ్రమలు ప్రభుత్వాధ్వర్యాన పెంపొందుతున్నాయి. కమ్యూన్లద్వారా ఒకవంక పురోభివృద్ధి, ఒకవంక సమాజీకరణం రయంగా సాగుతున్నాయి.

చైనా ఆర్థికవ్యవస్థ ఈ రీతిగా ఇంకా నిర్మాణావస్థలో ఉండడంవలన, సంపూర్ణ మార్క్సిస్టు ఆర్థికవ్యవస్థకు ఇది ఏ విషయాలలో భిన్నంగా ఉందో సమగ్రంగా పరిశీలించడం అంతగా సాధ్యపడదు. అయితే స్థూలంగా కొన్ని తారతమ్యాలను మాత్రం గమనించ వచ్చును. ఆదర్శవంతమైన మార్క్సిస్టు ఆర్థికవ్యవస్థలో డబ్బు యంత్రాంగం అమలులో ఉండకూడదు. అంటే, దైనిక వ్యవహారములన్నీ ధనవినిమయరూపంలో కాక వస్తువినిమయరూపంలో, శ్రమపరిమాణాన్ననుసరించి జరగాలి. కరెన్సీనోట్లు, బ్యాంకుపత్రాలు, నాణాలు వీటివలన వచ్చే ఆర్థిక రంగంలో పాటుపోట్లు రూపుమాసిపోవడంకొరకు అసహ్యమైన డబ్బుకు ఆ ఆదర్శ వ్యవస్థలో స్థానం వుండదు. అయితే అట్టిది కేవలం భావనాజగత్తులోనే సాధ్యమవుతుంది. కాబట్టి ఈ విషయంలో మార్క్సు భావానికి, చైనా ఆర్థికవ్యవస్థకు పొత్తు కుదరదు. ఇంక రెండవ భేదం: శ్రామికులకు ప్రభుత్వమొసగే వేతనాల విషయంలో అవతరిస్తుంది. వేతనాలు శ్రామికుల యథార్థశ్రమ పరిమాణంపైకాక వారికిగల గిరాకి, సరఫరాలపైనే ఇంకా ఆధారపడుతున్నాయి చైనాలో. ఇదికూడా మార్క్సు సిద్ధాంతానికి పొసగని విషయం. మూడవ భేదం ఏమంటే పారిశ్రామిక, వ్యావసాయిక ఉత్పత్తిసాధనాలపై ప్రభుత్వపు సంపూర్ణ యాజమాన్యాన్ని కారల్ మార్క్సు ప్రతిపాదించారు. కాని నేటి చైనాలో ఇవి చాలమట్టుకు సహకారసంఘాలయొక్క, ప్రభుత్వ–వ్యక్తిభాగస్వామ్య సంస్థలయొక్క అధీనాన ఉన్నవి. అయితే క్రమంగా సంస్కరణలు ప్రవేశపెట్టబడి, కమ్యూన్ల అభివృద్ధి సాధ్యంకావడంతో పైనుదాహరించిన చివరి రెండు భేదాలు అంతరించడానికి అవకాశాలున్నాయి.

ఈవిధంగా చైనా విప్లవారంభమే మార్క్సు భావాలకు వ్యతిరిక్తంగా సాగినప్పటికీ, ఆదర్శ మార్క్సు ఆర్థిక వ్యవస్థకు ప్రస్తుత చైనా ఆర్థిక వ్యవస్థకు భేదాలు కనబడినప్పటికీ, ఒక విషయంమాత్రం నిశ్చయంగా చెప్పవచ్చు. సామ్యవాద పురోగమన పథంలో ఆర్థికంగా నవచైనా విజయాలను సాధిస్తోంది. చైనా ఆర్థిక వ్యవస్థకు సామ్యవాద సిద్ధాంతరీత్యా బలవత్తరమైన పునాదులు ప్రజాకమ్యూన్ల ద్వారా స్థాపింపబడినాయి. అరవైకోట్లమంది పేద జనుల జీవన ప్రమాణాలను నూతనస్థాయికి ఉద్ధరించడానికి మహత్తరకృషి జరుగుతోంది. అయితే ఒక దేశాన్ని ఈవిధంగా ఉద్ధరించడానికి అనేక మార్గాలున్నాయి. మన మార్గం వేరు, చైనా మార్గం వేరు.

# ఆక్షేపము - సమాధానము

కడచిన ఏప్రిల్ భారతి '54-60' పుటలలో శ్రీ నిడుదవోలు వేంకటరావు పంతులుగారు నా రచించిన "ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము"లోని యేడు ప్రయోగములను విమర్శించిరి. విమర్శనములు గ్రంథముల కుత్తేజకములు గాన వానిని బ్రకటించుట యత్యావశ్యకము. కాని లేనిపోని విషయముల నట్టి విమర్శనములలో వ్రాయరాదు.

"ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము" అను నికము బాలవ్యాకరణమునకు వ్యాఖ్యయని శ్రీ వేంకటరావుపంతులుగారు వ్రాసిరి. ఇది నిజము కాదు. "ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వ"మునకు ప్రాచీనతములగు నన్నయాథర్వణ కారికలు మూలము. వానికి 'కల్పతరువు' అను వ్యాఖ్యయు నాచే రచితమయి యందు చేర్పఁబడినది. బాలవ్యాకరణమును నొకవ్యాఖ్యవంటిదే యని తలఁచియుఁ, జాలమంది దానిని జదివి యుందురని యెంచియు దానినిగూడ నందు జేర్చితిని. అంత మాత్రమున నా గ్రంథమున కది మూలమని వ్రాయుట సాహసము!

ప్రాచీన ప్రామాణిక ప్రయోగములు నాకు గన బడనపు డట్టి విషయము నందు వచించితిని. దానినొక తప్పుగా జూపుట సరికాదు.

ముద్రణ సంస్కర్తలు సంస్కరించి ముద్రింపించిన ముద్రణములను ప్రమాణముగా నెన్నుట విమర్శక కృత్యము కాదు. అట్టి సంస్కర్తృ ముద్రణముల సాధుత్వాసాధుత్వములను విమర్శించుట విమర్శకకృత్యము.

శ్రీ వేంకటరావు పంతులుగా రుదాహరించిన ప్రయోగములు సాధారణముగా నాధునికములు. అరుదుగా బ్రాచీనకవిప్రయోగములను జూపునపు డవి కవి ప్రయుక్తము లని విశ్వసింపదగని పాఠములు. ముద్రణ సంస్కర్తలు ప్రామాణికులు కానేరరు. కావున వారు ముద్రింపించినంతమాత్రమున నవి ప్రామాణికములు కానేరవు.

I. కల్హారము:—ఇది ప్రాకృతశబ్దమనియు, సంస్కృతమున జొనుపుచున్నారనియు నేను వ్రాసితిని. ఇది ప్రాకృతరూపమని వారేయుదాహరించిన ప్రాకృతమంజరీశ్లోకమే తెల్పుచున్నది. "వహ్నౌ గర్వస్త్రీతి కహ్లారం కల్హార మభిధీయతే." ఈశ్లోకము ప్రాకృతమంజరిలో నిట్లని చెప్పుచు కహ్లారశబ్దమునకు కల్హారశబ్దము రూపాంతరమని శ్రీ వేంకటరావుపంతులుగారు వ్రాయుట మిక్కిలి వింతగానున్నది. నన్నెచోడమహాకవి "కలుహార" శబ్దమును సంస్కృతసమాసమధ్యమున నిల్పెననుట నిజము కాదు. సీ॥ "జలజాతకైరవోత్పల సుకహ్లారాది గంధంబు—" అని కవి ప్రయుక్తపాఠము కానోపదు. భాషాతత్త్వము నెఱింగిన మహాకవులు 'కలుహార' శబ్దము సంస్కృతమని భ్రమింపరు.

II. 'చిగురాకు' శబ్దమపశబ్దమని నేను వ్రాయనే లేదు. దానికి మహాకవిప్రయోగములను నేనును జూపితిని. నన్నయభారతమున నట్టిప్రయోగము లేదు. తిక్కయజ్వయు "చంచుఁ జిగురుటాకు" అని ప్రయోగించెనేమో! "ఇతరత్ర చ ద్వితీయా" అని కదా నన్నయ సూత్రించెను. "భీష్ముఁ బనుపుఁ జేసి" అని నన్నయ ప్రయోగించియున్నాఁడు.

III. 'గ్లా-గ్లౌ, గై-రై' శబ్దము లపశబ్దము లని నేను వ్రాయలేదు. ప్రసిద్ధమగు 'గ్లా' శబ్దమునకుఁ బ్రయోగములు చూపనేల? 'గ్లౌ' ప్రభృతులకుఁ బ్రయోగములను జూపఁగలరా? 'గ్లా' శబ్దము దుమంతము కాదు గాన "గ్లానికులజులు" అను ప్రయోగము ప్రామాదికమని నేను వ్రాసితిని. "తెలుఁగుభాషా సంప్రదాయము ననుసరించి యిది సరియైనది" అని తేలిపోవుట ధర్మమా? దీని సాధుత్వమునకు బ్రయోగములు చూపఁగలరా? లక్షణ సమ్మతిని జూపఁగలరా?

IV. 'దంష్ట్రా' శబ్దము పుంలింగమును గలదని ప్రౌఢవ్యాకర్త వ్రాసెను. అది యప్రమాణమని నేను వ్రాసితిని. పుంలింగమున నది యున్నదని ప్రమాణమును జూపఁగలరా? 'దంష్ట్రము' అని యున్నది గాన నది పుంలింగమనుట సరియా? 'కంధరా' శబ్దమునకును 'కంధరము' అని రూపము లేదా? కంధరాశబ్దమునకు పుంలింగము కలదందురా?

V. "దృష్టు-కోట్లు-పిప్పళ్ళు" అని సంస్కృత శబ్దములకు "ఉల్లోపము" చెప్పరాదని నేను వ్రాసితిని. వేంకటరావు పంతులుగారు చూపిన ప్రయోగము లన్నిటను నేను వ్రాసినట్లు "దృష్టి, పిప్పలి" అని జాత్యేకవచనము నిల్పనగునుగదా. ఇక కోట్లు అని పండితారాధ్యచరిత్రమునఁ గలదందురేమో? అచట 'కోటుల' అని నిల్పనగును. సోమనారాధ్యుడు

"గగమును" నూర్యగణముగ బ్రయోగించినవాడు.

ద్వి. ప్రేమంబెల్లంగ భృత్యేపరాః
స్వామినోదంపయని బదువు నిష్టించి (బస 106 పు)
పాటుకప్రతి రసాన్ భక్తస్య జహ్వ
గ్రేయని యే ప్రొద్దు ప్రయోగము గావునను (బస 164 పు)

VI. లోపుశబ్దము కోశముల కెక్కలేదన్న మాట నిజమే. వేంకటరావు పంతులుగారు చూపిన నన్నె చోడుని ప్రయోగములో "ద్రోహవగులకు పెలిలోను గలద చతురాననుడా" అని కవి ప్రయుక్తపాఠము కానోపును.

VII. 'ఈవుతన్' అనుచోటి 'వు' కారమును నిర్వహించు ప్రాపాదిఘటితి ప్రామాణిక కవి ప్రయోగము లేదు' అని నేను వ్రాసితిని. దీనికి శాసనపద్యమును ప్రమాణముగా జూపుట యుక్తమా? శాసన కవులును ప్రామాణికులే యన్నచో యుద్ధమల్లుని బెజవాడ శాసనములోని "ఉభిరనుండు - మలినరు, పట్టబు, అయ్యార్వల" మున్నగునవెల్ల మహాకవి సమ్మతములే యందురా? వెంకటరావుగారు చూపిన శాసనేతర ప్రయోగములలో 'ఈవుతన్' అనుచోట్లనెల్ల "ఇవ్వు తన్" అని నిల్పవగును గదా?

వఝల చినసీతారామస్వామి శాస్త్రి.

## సమాధానము

ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము బాల వ్యాకరణమునకు విపులవ్యాఖ్యాన గ్రంథమని నేను వ్రాసిన దానిని నిర్దేశించుటకు నేతత్ గ్రంథ కర్తల యీ క్రింది వాక్యములే ప్రమాణములు.

"ప్రకృతగ్రంథము విద్యార్థిలోకమున విద్వల్లోకమునఁ బ్రసిద్ధమైయున్న బాలవ్యాకరణపు వరుస ననుసరించి నడుపఁబడుచుండుటం జేసి, యాంధ్ర శబ్దచింతామణి క్రమమును వీడి బాలవ్యాకరణక్రమమున యథా పూర్వముగ సందర్భ పఱుపఁబడుచున్నది."

(పుట 1321. ఆం. వ్యా. సం. స.)

అదియునుంగాక, సంహితా సర్వస్వమున బాల వ్యాకరణ పరిచ్ఛేదముల తీరుననే ప్రకరణ విభాగ ముండుటయు, అప్రసక్తముగ 'బా. సంజ్ఞ. ౧' యనెడు శీర్షిక గ్రంథాదినుండి పదునాలుపుటల వఱకు సూచింప బడియుండుటయు, వికృతి, విశేషణములని బాల వ్యాకరణ సూత్రముల యొద్ద ముద్రింపబడి యుండు టయు, సూత్రములకు వ్యాఖ్యానములేని చోటుల "౧౬వ సూత్రమునకు ౧౦౦ III విషయమునందును... VII విషయమునందును మూలోదాహృతియు వ్యాఖ్యా నము చేయబడెను." అని 1774 వ పుటలో వ్రాయబడి యుండుటం బట్టియు, సంహితా సర్వస్వము బాలవ్యాకరణమునకు విపుల వ్యాఖ్యాన గ్రంథమని నేను వ్రాసితిని. పేయేల 3 వ పుటనుండి 1794 వ పుట వఱకు ప్రతిపుటయందును ప్రదర్శితమైనది బాల వ్యాకరణ వ్యాఖ్యయగు సంజీవనీ వ్యాఖ్యయే. కల్పతరు వ్యాఖ్య కంగు ప్రాముఖ్యమే యగపడదు. అందులకు నేనుదాహరించిన పై శాస్త్రులవారి వాక్యములే ప్రమాణములు.

వ్యాకరణ సంహితాసర్వస్వమున చూపబడిని ప్రయోగముల పరిశీలనమే నా పూర్వ వ్యాసోద్దేశమని వ్రాసియే యుంటిని. దానినొక తప్పుగ గ్రహించిన వారు శాస్త్రిగారే!

నేనుదాహరించిన ప్రయోగములు సాధారణ ముగా నాధునికములట! అగుదుగా ప్రాచీనకవి ప్రయోగములను జూపునప్పుడి కవిప్రయుక్తములని విశ్వసింపదగిని పాఠములట!

అసలు నేనుదాహరించినవి సాధారణముగా ప్రాచీన ప్రయోగములు. అవి నన్నెచోడ, పాల్కురికి సోమన, తిక్కన, శ్రీనాథ, బమ్మెరపోతన, మడికి సింగన, తాళ్ళపాక పెదతిరుమలయ్య, నెల్లూరి సూరన, తెనాలిరామకృష్ణ, చేమకూర వెంకటకవి మొదలైనవారి గ్రంథములనుండి యెత్తిచూపబడినవి. ఇక నాధునికములనబడినవి చెళ్ళపిళ్ళ వరకవి, కోటి రఘునాథరాయలవి, చిన్నయసూరిచే నుదాహృతమైన చికిత్సాసారసంగ్రహము లందలి నాలుగు ప్రయోగములు మాత్రమే. మఱి సంహితాకర్తలు తమ 1794 పుటల బృహద్గ్రంథ ములో ప్రాచీనార్వాచీన శబ్దార్థ వివక్షణ రహిత ముగా జేర్కొన్న ప్రయోగముల వింతతీరును గను వింపుడు:

(1) "ఈ క్రింది యర్వాచీన కవిప్రయోగములను మాత్రమె ప్రమాణము లనఁదగును.

ద్విపద: ఏఁదప్ప పట్టుకు నిలఁ బరస్త్రీల
మీఁదఁ గన్నార్పకుమీ బఁవన్న"

(బసవ. 1 అ 593) ఆ. వ్యా. సం. స. పుట. 286.

ఈ పట్టికలో రాఘవపాండవీయమునుండియు, ఉ. హరి వంశమునుండియు గూడ ప్రయోగము లివ్వఁబడినవి; శాస్త్రులవారి దృష్టిలో సోమనాథుఁ డర్వాచీనుడని కదా తేలుచున్నది. కాని, సంహితాసర్వస్వము 96 వ పుటలో "తిక్కనకుఁ బూర్వులు, నన్నయ తర్వాతి వారు నగు సోమనారాధ్యుడును, నన్నెచోడుడును నిట్టి'ను' స్వరూపమును ప్రయోగించియున్నారు" అని తిక్కనకు ప్రాచీనుఁడుగా సోమనారాధ్యుని పేర్కొని యున్నారు.

(2) సంహితాసర్వస్వము 287 వ పుటలో "ప్రాచీనులు కేతన పెద్దన లీసందర్భమున"ననియు, అదేపుటలో "ప్రాచీనులగు పెద్దనకేతన లీవిషయమున" ననియు, ఆంధ్రభాషాభూషణకర్త కేతనను ప్రాచీనునిగా జేర్కొని, 354 వ పుటలో "అర్వాచీన కవులు విశేషణముల పుంపుంభావోద
సైతము 'టుక్కు'ను పేక్షించుట గలదు. అమృతసాదు (ఆం. భూ 126 పద్య)" అని కేతనను అర్వాచీనకవిగా నుదాహరించిరి.

(3) 130 వ పుటలో "అర్వాచీనకవులు కొందఱు వ్యావహారిక పదములలోని" అని మడికి సింగన పద్మపురాణము, అనంతుని భోజరాజీయము నుదాహరించి, అనంతుని అర్వాచీనునిగా జేసి, తిరిగి 316 వ పుటలో "ప్రాచీన లాక్షణికులు నిత్యయతి నంగీకరింపవలసిన ప్రసక్తియే లేకుండెనిది. ఆ. వె. వినిపదంబులో అనంతు. ఛందో అ 1-103" అని ప్రాచీనునిగా జేసిరి.

(4) వేయేల ఆంధ్రవ్యాకరణసంహితా కర్తలకు నన్నయ మహాకవియే అర్వాచీనుఁడైనాడు. సం. స. 1672 వ పుట త్రిప్పి చూడుడు.

"అర్వాచీనులు వీని నాగమనార్థమందే కాక 'పోవు' అను గమనార్థమునందును ప్రయోగించియున్నారు. ద్వివిధప్రయోగములు నిట జూపబడుచున్నవి. వ... ప్రభాసతీర్థంబునం బంద్రెండు దినంబులు పంచాగ్నిమధ్యంబున పవనాంబుభక్షుండై... ఆ. వ. దానినెఱిఁగి రాముదామోదరులు వృష్ణి, వరుల తోడఁ దీర్థనిగనుదెంచి, కనిరి... (అర. 3. ఆ. 159)"

నన్నయ అరణ్యపర్వమును చతుర్థాశ్వాసము 142 వ పద్యమువఱకు రచించినాడు కదా!

కాబట్టి వ్యాకరణ సంహితా సర్వస్వమున ప్రామాణికములని యుదాహృతములైన ప్రయోగములలో నేవి అర్వాచీనకవిప్రయోగములో, యేవి ప్రాచీనకవిప్రయోగములో గ్రహించుట కష్టము.

ఇక సంహితాకర్తలు విమర్శించిన అంశములను చర్చింతును.

I. అడిదము సూరకవి కవిసంశయవిచ్ఛేదమున 'కల్హార'శబ్దమునకు 'కలువ' తద్భవరూపమని తద్భవతరంగమున జెప్పియున్నాడు. సూరకవి చూపిన ప్రకృతు లన్నియు సంస్కృత శబ్దములా? ప్రాకృత శబ్దములా? 'కహ్లారము సుశబ్దము, కల్హార మపశబ్దము'ని వైయాకరణ పారిజాతమున (85-వ పుట) వ్రాసిన శాస్త్రులవారే సం. సర్వస్వమున (30-వ పుట) దీనిని 'నూతన శబ్దము'గ పరిగణించుట వింత! సం. సర్వస్వమున (30-వ పుట) జూపఁబడిన పట్టణ, డుళీ శబ్దములకు శాస్త్రిగారు ప్రయోగములను జూపియున్నారు. కల్హారమునకు జూపలేదు. కొండము సూర్యరాయాంధ్ర నిఘంటువున కల్హారము చూపబడక పోవుటయే. అసలు శబ్దరత్నాకరమున 'కహ్లార' శబ్దమే లేదు. కవి ప్రయోగములు లభించుచున్నప్పుడు వాని సాధుత్వాసాధుత్వమును చర్చింపవలెను గదా! లభించుచున్న ప్రయోగములను నేను చూపగా, వానిని తమ యిచ్చవచ్చిన రీతిని దిద్దివేయుట న్యాయమా? నన్నెచోడ మహాకవి 'జలజాత కైరవోత్పల కలుహారాది' అని ప్రయోగించగా, దానిని 'జలజాతకైరవోత్పల సుకహ్లారాది గంధంబు...' అని లేని పోని క్రొత్త 'సు' యను నక్షరము సృష్టించి దిద్దివేయుట అత్యంత సాహసముగదా! ప్రాసఘటితమైన 'కాశికాపట్టణ శంభుమూర్తుల' (కాశీ. 6-262) అను శ్రీనాథ ప్రయోగమునందలి 'పట్టణ' శబ్దము సంస్కృతమని భ్రమింపరా!

II. సంహితా కర్తలు 'చిగురాకు' శబ్దము నపశబ్దముగా వ్రాసినారని నా వ్యాసమున వ్రాయలేదు. 'చిగురాకు శబ్దము సాధువు కాదనరాదు' అని వారే సందేహముతో సం. స. 354 వ పుటలో వ్రాయగా సందేహ నివారణార్థము భారత ప్రయోగ మొకదానిని జూపితిని. వారు "'చిగురాకు' అను టుగాగమరూపము భారతమునఁ గన్పట్టలేదు"ను దానికి నేను తిక్కన భారతప్రయోగమును జూపగా వారి సమాధానమున, 'నన్నయ భారతమున నిట్టి ప్రయోగము లేదు' అని సవరించుకొనిరి. అప్పైగా నేనుజూపిన తిక్కన ప్రయోగము 'చెంగలఁ జిగురాకుఁ జించి గూడుము' వను దానిని "చంచుఁ జిగురాకు అని ప్రయోగించె నేమో!" అని సందేహము వెలిబుచ్చిరి. చిగురాకు సాధువు కాదనరాదని శాస్త్రులవారికి నిశ్చితాభిప్రాయమే అయినచో, తిక్కన ప్రయోగమును సవరింపనేల? తిక్కన సోమయాజి ప్రయోగమును దిద్దవచ్చే సోమన పండితారాధ్య ప్రయోగమును దిద్దినచో గణ భంగమగును.

III "గ్లా, గ్లో—గ్లై అను వానికి వయితము కవి ప్రయోగము లభింపకున్నను నవి సాధువులగుటకు నన్నయాదిసర్వజ్ఞ సూత్రములె పరమప్రమాణము లగుచున్నవి" అని సంహితా కర్తలు 607 వ పుటలో వ్రాయుటచే నాకు లభించిన గ్లాశబ్ద ప్రయోగములను జూపితిని. నేనుగాని, సంహితా కర్తలుగాని వాని నపశబ్దములని వ్రాయలేదు.

# ఆక్షేపము - సమాధానము

IV. దంష్ట్రము పుంలింగమని నేను వ్రాయలేదు. నాసికా దంష్ట్రా గ్రీవా పాదు కోల్కా శబ్దములకు మువర్ణాంత రూపములు శబ్దరత్నాకర సూర్యరాయాంధ్రనిఘంటువులందు చూపబడలేదని వ్రాయుచు సంహితాకర్తలు 612 వ పుటలో నాసికము ఉల్కము కంధరము అనువానికే ప్రయోగము లిచ్చి, 'దంష్ట్రము'నకు ప్రయోగము లియ్యక విడిచిరి. నే నా 'దంష్ట్రము'నకు ప్రయోగములను జూపితిని. శాస్త్రిగారు సం. సర్వస్వము 612 వ పుటలో "శబ్దరత్నాకరమున నాసికా దంష్ట్రా గ్రీవా పాదుకోల్కా శబ్దములకు మువర్ణాంత రూపాంతరము చూపఁబడకుండుట వింత! దాని ననుసరించుటచేతఁ గావలయు నేఁటికి ప్రచురింపఁబడిన సూ. రా. నిఘంటు సంపుటములందు నాసికా దంష్ట్రోల్కా శబ్దములకు మువర్ణాంత రూపాంతరములు చూపఁబడలేదు" అని వ్రాయుట సరికాదు. సూర్యరాయాంధ్రనిఘంటు ద్వితీయ సంపుటము పుట 18 లో 'కంధరము', 886 వ పుటలో 'గ్రీవము', ప్రథమ సంపుటము అనుబంధము 2 వ పుటలో 'ఉల్కము' (ఇది కంధరాదులలోనిది) అని మువర్ణాంత రూపాంతరములుగా కొన్ని జూపబడినవి.

V. ఒక చోటనే గాక పలుతావుల ప్రయోగింపబడిన శబ్దముల నెల్ల దిద్దుట సాధ్యపడని విషయమే గాక, సంప్రదాయవిరుద్ధముగూడ. 'దృష్ణు' రూపము సోమనాథుఁ డంత్యానుప్రాసములో వాడియున్నాఁడు. ద్విపదలు పాడుట కనువగురీతి నుండవలెను గదా! 'దృష్ణు, అష్ణు' అని ద్విపదపాదాంతమున సోమన వాడియున్నాఁడు. 'పిప్పళ్ళు' అను ప్రయోగము కూచిరాజు ఎఱ్ఱన కొక్కోకములో బహువారములు వాడినాడు. ఇక 'కోటుల్' అని నిలుపుట యెల్లచో జెల్లదు.

"అందుఁ గులపర్వతేంద్రంబు లైదు వాని
చుట్టుఁగలిగిన కొండలు కోట్ల సంఖ్య"
వరాహ. 10-153.

"ఇట్లు కడలేక బహ్వంశకోట్లు మెఱయు
విష్ణుపురాణము 8-153.

'కోట్లు' అన్నరూపము ప్రాసఘటితమై మహాకవి ప్రయోగముల నగుపడుచుండుటంజేసి యంగీకరింపక తీరదుగదా! కాబట్టి సోమనారాధ్యుని ప్రయోగములను దిద్దివేయుటకు పూర్వాపరప్రయోగ పరిశీలన మవసరమని తేలుచున్నది.

VI చిగురురాకు శబ్దమును చిగురుటాకుగా దిద్దిన వారికి లోపు శబ్దమును లోనుగా దిద్దుట సుకరమే గదా!

VII "ప్రాచీనశాసనములు ప్రాచీన భాషా స్వరూపమును గ్రహించుటకు ప్రమాణము లని అంగీకరింప తీరకున్నను" అని ద్రవిడభాషా పరిశీలన ప్రథమ సంపుటములోని 135 వ పుట యందు వ్రాసిన శాస్త్రులుగారే 'వు'కార ప్రాసఘటితమైన 'ఈవుతఱి' అనురూపమును ఏల యంగీకరింపరో తెలియకున్నది. 'ఈవుతన్' అనురూపమునకు 'ఇచ్చుతన్' అనురూపము ప్రాచీన కావ్యములందు ప్రాసఘటిత రూపముగా శాస్త్రులవారు చూపెట్టినచో బాగుండెడిది. అసంఖ్యాకములగు ప్రాచీనాంధ్రగ్రంథములందు ఈవుతన్ అను రూపమే కన్పడుచున్నది. కాన దిద్దనవసరము లేదు.

ప్రాచీనాంధ్ర కావ్యముద్రణ సంస్కరణ విషయమున సంహితా కర్తల యనుభవమెట్లు ప్రవర్తితమైనదో నేను వ్రాసిన 'బసవపురాణ ప్రయోగముల సమర్థన' అను వ్యాసమున నిరూపితమైనది. అది ఆంధ్ర పత్రిక వికారి యుగాది సంచికలో ప్రకటితమైనది. దానిని సంహితా కర్తలు పరిశీలించి సంస్కృతముద్రణముల సాధుత్వాసాధుత్వములను విమర్శించి విమర్శక కృత్యమేదియో దానిని కూడ నిరూపింతురు గాక!

నిడదవోలు వెంకటరావు.

[ప్రయోగశరణాః వైయాకరణాః — అన్నది పండితోక్తి. కాని, ఈ వివాదంలో ప్రయోగాలను దిద్దివేయవచ్చునని ఒకరి మతం, 'పలుతావుల ప్రయోగించబడిన శబ్దములనెల్ల దిద్దుట సంప్రదాయ విరుద్ధ'మని మరొక మతం అయినట్టు స్పష్టం. కనుక ఈ వివాదాని కిక స్వస్తి. —సంపాదకుడు.]

# అనంతకృష్ణులు: అభిరుచి నిర్దేశము

శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

సామాన్యముగ లోకమున సర్వ విషయములందును 'పుర్రెకొక బుద్ధి జిహ్వకొక రుచి.' కాలానుగుణముగ దేశమున క్రొత్త క్రొత్త రంజన పద్ధతులు కూడ వచ్చినపుడు ప్రజలు వానిని కోరి అనుసరించుట కూడ కద్దు. ఈ రెండును గాక ప్రతివిషయమునందును పథ్యమైన మార్గమొకటి యుండును. ఆత్మతృప్తి, సంఘమున పేరామణి, వ్యక్తిశ్రేయస్సు క్రమముగా వీని ఫలములు. తన మనసునే నమ్మనపుటలో అపథ్యమార్గమియ మొకటి ఉన్నది. ఇంక క్రొత్తదనముచే కొలువబడెడు రంజన మార్గములన్నియు తాత్కాలికములె. ప్రాతబడి పనికిరాకపోవుట అని తమపాలిట తామే వ్రాసిపెట్టుకొన్న తలవ్రాత. వానితో తాత్కాలికముగు అభిరంజన మగునేమో కాని నిరంజనత సాధ్యముకాదు. తక్కిన వానిపట్ల ఇంతయు ఎంత నిజమో సాహిత్యముపట్ల అంతకంటె ఎక్కువ నిజము. ఆనందసాధనకు కావ్యమెట్లు నిమిత్తసాధనమో పాఠకుని అభిరుచి పరిపాకము గూడ నట్టిదే. అంతరంగ వాసనల నక్కరగా పండించుటయే అభిరుచి పరమార్థము.

తెలుగు సాహిత్యమున కడచిన ముప్పదేండ్లలో కాల్పనిక కవిత, అధివాస్తవిక కవిత అని రెండు ప్రస్థానములు వచ్చి పారాడినవి. వీని రాకతో వీనికి తగిన అభిరుచి మార్గములుగూడ ఏర్పడినవి. వీనిలో క్రొత్తదనమేకాక సిద్ధాంతభేద ముండుటతో అందులో మరల రెండు చీలికలు. ఈ వెల్లువ పొలపములో ప్రాచీనమైన భారతీయ కవిత, దానికి సంబంధించిన అభిరుచి మార్గము చెడిపోవు పరిస్థితి రాగా సమయమునకు సరిగా దాని నొడ్డుకొని స్థితి స్థాపకత్వమును నిర్వహించినవారిద్దరు. ఒకరు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు; రెండవవారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. వీరుచేసినది స్థితిస్థాపకత్వమే కాదు; కవితాభిరుచిని తీర్చిదిద్ది నగిషించి నదరు నాణెముల పరిశీలనలో నాజూకుదనము చూపినవారు. సహృదయ విమర్శకులని శర్మగారిని, సాంప్రదాయిక పండిత కవియని సత్యనారాయణగారిని అనుకొనుట అందరెఱిగినదె గాని శర్మగారి కవిత్వమును, సత్యనారాయణగారి రుచిసాంద్రతను గురించి తగినంతగా తలపోసినవారు తక్కువేమి అనుకొందును. చెప్పవచ్చిన దేమనగా కవిత్వము—అభిరుచి అను ఈ రెంటియందును ఈ యిరువురుగూడ చాలవరకు తమ ప్రభావమును చూపినవారు. అభిరుచి విషయము నొక దానినే ఆలకించి చూచినపుడు వారిమార్గముల కొన్ని చాళ్ళు భేదము గనిపించుట మనము వారితోపాటు సమకాలమున నున్న దాని ఫలము. నిజమునకు, అంతయో ఇంతయో, ఉన్న భేదము చాయలకు సంబంధించినదే గాని చాళ్ళకు సంబంధించినది గాదు. తత్త్వమున నిద్దరొకటే. కవిత్వానందమెట్లో అభిరుచియందును అట్లే ఇద్దరకును ఉపదిష్ట మార్గమున అభినివేశ మెంతయున్నదో, ఉద్యుక్తమైన అభినవత్వమునందాదరము గూడ అంతయున్నది. శర్మగారు తాము నమ్మి అనుసరించి, వ్రాసి చూపిన ఆ అభిరుచి మార్గమును, దాని ప్రశస్తిని గూర్చి యించుక తెలుపుట నాయీ వ్యాసోద్దేశము.

శర్మగారు జగమెఱిగిన బ్రాహ్మణులు. భగవంతుని గూర్చిన కల్యాణగుణభావన, భక్తితో గూడిన సేవనగుణము, ఆచార్యనిష్ఠ ప్రపత్తిలోని దేశిక విశ్వాసము, వీని కనుబంధముగ నున్న వినయభరము చేరి ఆయన వ్యక్తిత్వమునకే ఒక మాధుర్యము సహజముగా నబ్బి వచ్చినది. ఆ వినయసంగతికి ఎదుటివాని యహంకారమునుగూడ చంపునంతి పదను; మాధుర్య సంగతికి ఆనందవివర్తమైన లీలాలోలత ఫలము. సంస్కృతముతో పాటు లలితములైన ప్రాకృత తెలుగు కన్నడ తమిళాంగ్లముల భావవాహినులలో ఈదులాడుటయే గాదు సంగీతగంగలో కొట్టులు వైచిన వారాయన. అన్నిటికంటె ముఖ్యముగా భావానుభవమునకు వలసి సత్త్వసంపద ఆయనకు జన్మసిద్ధము. మందహాస తుందిలమైన మాటసరళి. వార్తికమైన వాక్యరచన. ఇంతటి సాధన సంపత్తితో తమ యనుభవమును నమ్మి దాని యాథార్థ్యమును, మంచిచెడ్డలను తామే తేల్చుకొనెడు శర్మగారు అనుభవరసికులు గాక వివేక ప్రధానులగు శుష్కవిమర్శకులలో నెట్లు చేరుదురు! కవిగా ఆయన ప్రశస్తికి గాథాసప్తశతి అనువాదమే తార్కాణ. రఘువంశము ననువదించియుండి ఏదో తెలియని యొక నిర్వేదచ్ఛాయలో బడి దాని నొకనాడు తమ యెదు

టనే చించివైచిరని నా మిత్రులొకరు చెప్పినారు. ఆయనచేతి అనువాద మిట్లంతరించుట తెలుగు సాహిత్యమునకు తీరనిలోటు.

శర్మగారు చేయి వేసిన ప్రతి రచనలోను నిష్పక్ష ధర్మమొకటి మిసమిసలాడుచు కాన్పించును. ఇతరులు చాలమందిలో లోపించెడి సమ్యక్ దృష్టి, లోకజ్ఞత, వారిలో పుష్కలముగ నుండుటయే వారి రచనలలోని జీవమునకు, విలక్షణతకు, సమగ్రతకు కారణము. చిత్తవృత్తినిబట్టి చూచినచో స్వస్థాన వేషభాషాదికము నందు ప్రీతి, స్వాతంత్ర్యము, పురుషార్థ సాధనయందు నిష్ఠ, లోకజ్ఞత, ఔదార్యము — మొదలగు గొప్ప గుణములు సాధింప నక్కరలేకయే సహజముగ వచ్చినవి. ఆయన ప్రకటింపజేసిన మూడు పుస్తకములలో 'నాటకోపన్యాసములు' కళలనుగూర్చి ఆయనకుగల అభిప్రాయములను తెలుపును; 'వేమన' చారిత్రిక పరిశోధకుల కాదర్శప్రాయముగా నుండదగిన అతిశయోక్తులు లేని, అసత్యమును కాని, సమ్యక్ దృష్టిగల రచన; 'సారస్వతాలోకము' చక్కని చిక్కని చెక్కడపుతీర్పు గల విమర్శగ్రంథము. స్వదేశాభిమానముతోడి స్వాతంత్ర్యప్రీతి ఆయనను సమకాలీన సంఘ విమర్శకుడుగ మార్చివైచినది. రాయల వైదుష్యమును గూర్చి, రాయలనాటి రసికతను గూర్చి వారు వ్రాసిన వ్యాసములలో మన ఈనాటి సంఘము సత్వహీనతను చచ్చుదనమును పుచ్చుదనమును మొగముమీద కొట్టినట్లు చాటి చెప్పి పురుషార్థసాధనకు పురికొల్పినారు. రంగనాథ రామాయణ ప్రచురణను గూర్చి వ్రాసినచోట రంగనాథుని కర్తృత్వ విషయమున తమ యభిప్రాయమును సూచించి వదలిన సత్యనిష్ఠ, పరిష్కరించిన ప్రభాకర శాస్త్రిగారి పీఠిక బయటకురాని పరిస్థితుల బండారము బయటపెట్టిన ప్రజ్ఞ, మేధావులలో మేధావి యనిపించుకున్న రామలింగారెడ్డి గారంతవారిని 'ప్రాచీనుల దృక్పథము సమమో విషమో చూచుటకు కావలసిన ప్రత్యగ్దృష్టిత్వము నిచ్చు సులోచనములు రెడ్డిగారింకను ధరింపలేదని చెప్పగలిగిన ధీరత--చాలమందికి సాధ్యము కాని విషయములే అనుకొందును. ఇంత తెలుగునకు సహజమైన, తేటయైన పద్ధతిలో చేయి తిరిగిన రచన చేయగల సిద్ధహస్తులలో శర్మగారొకరు. అది ప్రత్యేకముగ వ్రాసి చర్చింపదగిన విషయము. శర్మగారి ఆసక్తి ఒక్క సాహిత్యము మీదనో, సంగీతము మీదనో మాత్రమే నిలువక కళలన్నిటిమీద కన్నాకుగా సాగినది. ఇవిగాక తత్త్వము, యోగము, మతము, చరిత్ర, హాస్యము, రసవాదము మొదలగువానిపై వారికి శ్రద్ధ. 'వేమన' లో పురాణములలోని అతిశయోక్తుల పొల్లు చూపించుచునే ఆధునిక చరిత్ర పరిశోధకుల సమ్యగ్దర్శనము లేని ఖండసత్యముల చాళ్లలో అసత్యములు ముందుకు వచ్చుచున్నవని మొగమోటమి లేక వ్రాసిన వ్రాత, వేమన తండ్రి యొకడుండినాడని చెప్పుటకు సాక్ష్యములు లేనపుడుండెనా లేదని తలచుటకే ఆధునిక చరిత్ర పరిశోధకులు సిద్ధపడుదురని చేసిన వ్యంగ్యచిత్రణ చదివినవారు మరచిపోజాలినవి కావు. నయముతోడి హాస్యము మనమింకను నేర్వవలసి యున్నదనియు విమర్శించు పట్లగూడ గాయపుమందు కత్తికేపూసి కొట్టి నల్లించవలెననియు అభిప్రాయపడిన శర్మగారు వేమన పద్యములను కూర్చి మార్చి ప్రకటించిన బందరు ప్రచురణకర్తలను విమర్శించుచు వారిచేతిలో 'సుత్తిదెబ్బలు ఆకురాయి కోతలు వేమన చాల తిన్నా'డని జాతివార్తికమైన హాస్యపు విసురు చూపినారు. అంతేనా! మరి, మతము వ్యక్తికి సంబంధించిన విషయమని నమ్మెడి శర్మగారు అద్వైతులు 'హరిని గాని, హరుని గాని ప్రత్యేకముగ గొలుచు ననుకూలము తప్పి, యిద్దరికి మ్రొక్కులు చెల్లించుట, ఇద్దరికిని దక్షిణలు కట్టుట మొదలగు పనులలో ద్విగుణశ్రమ వ్యయములకు పాల్పడవలసి వచ్చె'నని సానుభూతి చూపి హాస్యమాడినారు.

సిద్ధాంత దృష్టితో శర్మగారి శిష్టాభిరుచిని పరిశీలించుటకు ముందు కళలు శాస్త్రము నీతి న్యాయధర్మములు లోకజ్ఞత అనువానిని గూర్చి ఆలోచనాపటువులైన ఆయన అభిప్రాయముల నించుక గమనింతము. 'నాటకోపన్యాసములు'లో కళలను గూర్చి వారిట్లు వ్రాసినారు: 'ఉండునది ఉండవచ్చునది ఉండవలయునట్టిదియు నగు వస్తువును ప్రదర్శించుటతోడనే కళలన్నియు మొదలు పెట్టును. సాధ్యమైనంతవరకు ప్రతి కళయు స్వతంత్రముగా నుండవలయు నందురేని యెవరును కాదనరు. కాని ప్రతి కళకును అసాధ్యములైన ప్రమేయములు కొన్ని కలవనియు వానినట్లే వదలుటకంటె ఇతర కళల తోడ్పాటుతో సాధించుట ధర్మమనియు అంగీకరించక తప్పదు. కళలలో బహిరంగముల ఫలము చాల తక్కువ; మన చిత్తవృత్తిని వస్తువిశేషము అంతరంగము దాకా కీడ్చుకొనిపోయి విడిచి తాము వెనుకబడును. కళాకారుని ముఖ్యమగు పని ఆ చిత్తవృత్తిని ఆ చోట ఏకాగ్రముగ నిలుపుటయే కళకు అనుకరణము సాధనము. సాధ్యము చిత్తైకాగ్రత. ఫలము శాంతి.'[1] పాశ్చాత్యులు గూడ ఈ విషయమున ఇంతకంటె నెక్కువగా చెప్పిన వివేకులు లేరు. పుబ్బలో పుట్టి ముఖలో మాయమగు క్షణిక ప్రస్థానములు, ఊహలు వారిలో ఎక్కువగా కాన్పించుటకు వారి స్వాతంత్ర్యబుద్ధి కారణమని ఎంతగా అనుకున్నను

1. చెదురుగా నున్న ఈ వాక్యములను కలిపి చేర్చినాను.

జీవితమున నెమ్మది చాలనితన మొకటి గూడ ఒక బలమయిన కారణమేనని అనుకొనక తీరదు. ఆ నెమ్మది తీరు వస్తుసంపదతో వచ్చునది గాదనియు ఆత్మసంపదతో రావలసిన దనియు నేను చెప్ప పనిలేదు.

ఇంక, శాస్త్రము వస్తువును విభజించు మార్గము; కళ వాని నన్నిటిని ఒకటిగా జూచి ఏకత్వభావన చేయుట అని శర్మగారి మతము. కీ॥ శే॥ కట్టమంచి రామలింగా రెడ్డిగారు 'వ్యాసమంజరి'లో నొకచోట 'శాస్త్ర మనుష్ఠానమునకు; కళ యనుభవమునకు' అని చెప్పినారు. అనుష్ఠానము వేరు అనుభవము వేరని భావించిన రెడ్డిగారి చూపునకును కాన్పించుట, కదిసి యనుభవించుట ఒకటిగనే యుండవలెనను శర్మగారి దృష్టికిని ఎంతభేదమో చెప్ప బనిలేదు. శర్మగారి విషయమున వ్యక్తి చేష్టకు శిష్టాచారమునకు భేదముండరాదను ధైర్యబలమే బ్రతుకులో తత్త్వమును బంధురముగా చూడవలెననియు ఒకటి వస్తువులలో రెండవది పుస్తకములలో నుండరాదనియు తలచిన తలపునకు కారణమైనది. అందుకే ఆయన అనుభవరసికులు కాగా రెడ్డిగారు వివేకి మార్గమునకు చెందిన విమర్శకులైనారు.

కళకు నీతికి సంబంధము లేదను పరమార్థవాదులు కొందరున్నారు గదా! దంతపు చావళ్ళలో తలుపులు మూసుకొని కూర్చొన్నవారి మాటలు 'వివేచనఫలము కాదని శర్మగారి నిర్ణయము. ఆయన నేలమీద సాము చేయువాడే కాని నేలవిడచి చేయువాడు కాదు.

సత్వ సంపద (empathy) గల శర్మగారు న్యాయమనునది దయ, ఔదార్యము మొదలగు ఉదార భావములతో నిర్ణయింపబడునది అనియు ధర్మము ఒక జాతికో వ్యక్తికో యోగక్షేమములు కలుగవలెననియు తప్పక ఆదరింప వలసినదిగా పెద్దలు ఏర్పఱచిన నియమమనియు, నిర్ణయించుకొని న్యాయమువైపు మొగ్గు చూపినారు. 'న్యాయమున కిహలోకమందు దృష్టి, ధర్మమునకు పరలోకము. మొదటిది సార్వకాలికము. రెండవది దేశకాలముల బట్టి మారుచుండును.' ఇట్టి ఊహలతో శర్మగారు రసికత యననేమో వివరించి, న్యాయాన్యాయముల ధర్మాధర్మముల విచక్షణ అంతగ పాటింపక తాను కోరిన దనుభవింప జూచుట—అని చెప్పిన మాట లందరికీ తెలిసినవే. కాని అవి సత్వ సంపద ఉండవలెనన్న దృష్టితో దాని కుపలక్షకముగా చెప్పిన మాటలని మఱచిపోయినచో మనము శర్మగారికన్యాయము చేసిన అదర్శ రసికులమే అగుదుము! అతతాయితనము దానికి ఫలమగును.

శర్మగారి దృష్టిలోను రచనలోనుకల మరియొక గొప్ప గుణము లోకజ్ఞత (Commonsence). 'శక్తిర్నిపుణతా లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణాత్, కావ్యజ్ఞ శిక్షయా భ్యాస ఇతి హేతుస్తదుద్భవే' అని ఆలంకారికులు కవిత్వమునకు లోకజ్ఞత విడదీయరాని కారణభాగముగ చెప్పినను విమర్శకులకది అంతకంటె నెక్కువ అవసరమని గమనింప వలసియుండుట అటుండగా అసలక్కర లేనట్లుగా శుష్కవాదములు చేయుట అలవాటైనది. మనలో చాలామందిమి బుద్ధిజీవులమగుట బ్రతుకుతో లంకెవడని మన చదువుల ఫలము. ఎంత యెక్కువగా చదువుకొన్న లోకజ్ఞత అంత తక్కువగుట మన వ్యక్తిత్వ వికాస మార్గమున కన్వయించు సూత్రము. పాశ్చాత్య పండితులు తమ తమ కళాకలాపము లన్నింటి యందును తక్కిన తమ భిన్న భిన్న సిద్ధాంతములతో బాటు దీనికి గూడ అగ్రాసన మిచ్చి ఆదరించినారు. ఆదరించుట యేమి, ఏ శాస్త్రమార్గమున అయినా వాని హెచ్చుతగ్గులు నిర్ణయింప బూనినను లోకజ్ఞతతో చూచి తీరవలెనని దానికొక దర్శన ప్రతిపత్తినే కలిగించినారు.

తత్త్వమున వ్యక్తభాగముకంటె అవ్యక్తభాగ మెక్కువ. కళలో తెలిసిన భాగముతో నెక్కువగా సంవాదము నెరపును. అంతమాత్రమున పూర్తిగ తెలియని, తెలియరాని అవ్యక్త తత్త్వమును వదలుట న్యాయ్యము కాదు. అన్ని కళలలోను, ప్రతిపాదింపబడు వస్తువేదైనను, ఫలరూపమైన వస్తువు ఆనంద మొక్కటే. ఈ దృష్టితో శర్మగారు నాటకములందు నృత్తము, పాటలు — పద్యములు ఉండదగినవని వాదించినారు. అవును మరి—తాళలయాత్మకమైన నృత్తమేల ఆనందకారి కాదు? భావ ముండితీరవలెనను మొండితన మెందుకు? నటరాజు చేసినది నృత్తమే గదా? ఆయన అభినయించిన భావమేది? మనసు పొంగి కుణిసి యాడెడు పసిపిల్లలే భావము నభినయించుచున్నారు? 'గుణలగ్నోద్దీపిత గురుహ నసుహ'ని పోతన్నగారు చెప్పిన ఆ ఆనందచేతన నృత్తమున లేదా? కాని జరిగిన పొరబాటెప్పుడో జరిగినది. ఏనాడు పరమశివుని సముఖమున నే నృత్తము పూర్వాంగ పరిమితముగ నంగీకరింపబడినదో ఆనాడే దానిపై చిన్నచూపు మొదలైనది. ఆ పరిమితికి లోబడినంతమట్టుకైన మనము దాని నాదరింపవలయుట మన అక్కరయే గాని దాని యక్కర గాదు. ఇంక పాటలు—పద్యాలమాట చెప్పవలెనా? విజ్ఞాన శాస్త్రాభివృద్ధితోపాటు కళలు గూడ మేధోమార్గ లులితములు కాగా హృదయమును కాక బుద్ధిమాత్రమే నమ్మెడి స్వభావవాదులు పాటలు పద్యములు పనికిరావందురు. కాని అది అనుభవమునకు పొసగిరాని హేతువాదమార్గమని అందరికి తెలిసినదే.

# అనంతకృష్ణులు: అభిరుచి నిర్దేశము

ఇంక శర్మగారు తాము నేర్చి, భిన్నప్రస్థానముల తాత్కాలిక రంజనమార్గములకు లోపడిన మనలోని చాలమందికి నేర్పజూచిన అభిరుచికి మూలమైన సిద్ధాంతము నించుక పరిశీలింతము. ఆయనది శర్మదమైన రసమార్గము. అనాదిగా తత్త్వముతోపాటదియు నున్నదే; ఉన్నదేగాదు, అదే తత్త్వము. 'రసో వై సః'. 'ఉన్న అభిరుచికి ఉదాహరణ లిచ్చువారేకాని వానిని సరియైన త్రోవలో మార్చి తిద్దగలిగిన ధీరులు లేరై'రని శర్మగారొకచోట వ్రాసినారు. పూర్వకవుల మాట యెట్లున్నను ఆయన మాత్రము సమకాలమువారి అభిరుచిని సరియైనత్రోవలో తీర్చి దిద్దిన ధీరులనుట వాస్తవము. ఆ తీర్పుటలో ఆయన చేసిన పనియేమనగా పథ్యమైన ఆ శాస్త్రమార్గమును మన బ్రదుకున కెడము కానీక జోడించి అందించుట. కళల ఫలమును రసమనియో ఆనందమనియో ఆలంకారికుల పరిభాషలో చెప్పక సామరస్యమని, శాంతియని బ్రదుకు చాళ్ళలో పడునట్లుగ చెప్పుట శాస్త్రమును మనకు లొంగిన ఉపకరణముగ చేసి లొంగదీయుట. శాంతి యున్న నే ఆనందము. ఈనాటి మనకు శాంతి యున్న చాలును. ఆనంద మదియే రాగలదు. ఈ రెండును పర్యాయపదములే అనుట అనుభవ మార్గమున తెలిసి రావలసిన విషయమైనను ఆ తెలివిడిలోను నిర్వ్యగ్రత, నెమ్మదితనము, ఇంద్రియోపశమనము, ప్రకృతి స్థితి, దుఃఖరాహిత్యము, ఆనందముగా అధికారి భేదమునుబట్టి ఎన్నియో పేర్లుండుట గమనార్హము.

వైద్యునకు రోగిదేహారోగ్యముపై ఎంత శ్రద్ధ ఉండునో విమర్శకునకు పాఠకుల మానసికారోగ్యముపై అంత శ్రద్ధ ఉండవలెను. రసము మాట దేవుడెరుగును గాని మనకు జీవితమున శాంతి సామరస్యములు ఉండి తీరవలసినవే అన్న కొఱతమాట నేటి మన సంకీర్ణ జీవనఫలము. శర్మగారీ దృష్టితో పథ్యమును—రసమార్గమునే పేరు మార్చియో మార్పకయో మరల మన కందించినారు. కావ్య విమర్శలలో ఆయన దృష్టి ఈ సిద్ధాంతజన్యములైన మరికొన్ని సూత్రములకు కట్టుబడి నడచినది.

ఇంతకును రసమార్గమునకు చెందిన ఈ అభిరుచిని నేర్పవలసివచ్చుటకు మన కధునాతన కాలమున వచ్చిన కాల్పనిక, అధివాస్తవిక కవితా ప్రస్థానములు నిమిత్తములు. ఈ రెండును పాశ్చాత్యుల భిన్న తత్త్వదర్శనముల నాశ్రయించి మేధోమార్గలాలితములైనవి. తత్త్వము (Spirit), పదార్థము (Matter) అను వానిలో తత్త్వము ప్రధానమని నమ్మిన కాల్పనిక కవిత ఏకతావాదము (Idealism) నాశ్రయింపగా, పదార్థమే ముఖ్యమని చెప్పు భౌతికవాదమున కాలిడిన అధివాస్తవిక కవిత గతితార్కిక భౌతికవాదము నండగా జేసికొని సర్వమును యాంత్రిక దృష్టితో జూచునదైనది. దృష్టి, ప్రయోజనరూపములైన దీని సిద్ధాంతము లటుండగా ఇందలి కవుల చిత్తవృత్తులు రచనామార్గములు కూడ వేరు వేరుగా నున్నవి. కాల్పనిక కవుల మతమున తత్క్షణ భావానుభవమే ప్రధానము. సమ్యగ్దృష్టిని సమకూర్చుకొనుట కిది సాహాయ్యకారి యని వారి విశ్వాసము. శబ్దమును వాడుటలో గూడ వారు ప్రాయికముగ వాచ్య లక్షణలను కొంతవర కాదరించి వట్టి శబ్దగుంఫనము నాశ్రయించియే రచనల నెక్కువగా నడపినారు. వీరి నిర్హేతుక— అథవా ప్రతీకమాత్రమైన—దుఃఖము కవుల విషయమున ఎట్లున్నను పాఠకుల భావానుభవము విషయమున మాత్రము విపరీత చిత్తవృత్తిగా పరిణమించినది. అధివాస్తవిక కవులు అవ్యక్త తత్త్వములోని తైజస (Unconscious), విశ్వతైజస (Dream) తత్త్వముల నవలోడనచేయ సమకట్టి శబ్దశక్తులనే నశింపజేయ నుద్యుక్తులై శబ్దమును నేయార్థమున సంకేతమాత్రముగ వాడజొచ్చినారు. వీరికి గూడ ప్రాయికముగ నిమిత మనస్కృతి లేని వినాశకారకమైన విప్లావక చిత్తవృత్తి యొకటి యున్నది. కాగా, ఈ కవితామార్గముల ప్రయోజన రూపమైన సిద్ధాంత మెట్టిదైనను, ఇవి చిత్తశాంతిని సాధింపగలిగినవి కావని, మానసికారోగ్యమునకు భంగము కలిగింపవచ్చునని అనుకోక తీరదు.

రసమార్గమునందలి మేలిమి, వీనియందలి లోటు గమనించుటకు మనస్సునుగూర్చి మన స్తత్త్వశాస్త్రమేమి చెప్పునో చూతము. మనదంతయు వట్టి నరాల బ్రదుకు. మనస్సు (Mind) అనునది మెదడులోని నాడుల కూర్పులో వచ్చు సంచలనమున కలుగు విశిష్ట ప్రవృత్తి. సాధారణముగా ప్రతివాని మనసులోను ప్రధానముగా కొన్ని సౌమనస్య (Appertencies) వైమనస్యములుండును. ఇంద్రియమార్గమున ఒక సూక్ష్మమైన ప్రేరణ (Stimules) కలుగగానే అది ప్రకోప పరిణతమై ఒక విలక్షణత (Charecter)ను సంతరించుకొని భావమార్గమున క్రియాపర్యవసితమగును. దీనినే ఉద్రేకము (Impulse) అందుము. ఇటువంటి ఉద్రేకాలు కొన్ని ఒక్కొక్కవిధముగా అమరికకు వచ్చినప్పుడు ఒక్కొక్కవిధమైన చిత్తవృత్తి (Attitude) ఏర్పడుట జరుగుచున్నది. చెప్పుట కిదంతయు ఇంత తేటగా స్పష్టముగా నున్నప్పటికిని క్రియలో ఎంతో సంకీర్ణముగా జరుగును. ఒక్క చిన్న ప్రేరణవల్ల ఎన్నో వాసనావీచులు కదలిపోవును. ఆయా వాని అభి

ముఖ్య వైముఖ్యములకు సంఘర్షణ కలుగును. వీని కన్నింటికి సామరస్యమును సాధించినప్పుడే చిత్తశాంతి సాధ్యము. అంతేకాదు అన్ని వాసనలను తృప్తి పరుపవలసిన బాధ్యతకూడ ఒకటి ఉన్నది. ఈ రెండును జరుగనప్పుడు మానసికారోగ్యము చెడి రోగము కలుగుట తప్పదు. శర్మగారు రసానుభవానికి లంకెవల్లనే కళల ఫలమును ఈ దృష్టితో శాంతి, సామరస్యము, అనురూప్యము అను మాటలలో వ్యవహరించినారు.

మరి, మనుష్యజీవితము భౌతిక సాంఘిక శక్తుల చేత నియమితమై నడచునని గమనించిన శర్మగారు రసమార్గము నుపదేశించుచునే నీతినికూడ చేవిడరాదని యిట్లు చెప్పినారు: "ప్రతి రసముగూడ హద్దుమీరిన తర్వాత అసహ్యమగును...రసము ననుభవించి యానందించు మన మన సత్త్వముగూడ తక్కిన ప్రకృతి ధర్మములకు లోపడినదేకాని కేవలము స్వతంత్రము కాదు. రసమేదియైనను మనము సహజముగా నేర్పరచుకొన్న నీతి, ధర్మము, అనురూప్యము, సామరస్యము మొదలగు హద్దులను మీఱిపోయినచో దాని ఫలమగు ఆనందమును మన మనుభవింపజాలము." శర్మగారు రెంతిసేపును 'నరాల బిగువు హెచ్చించే' సత్త్వమునుగూర్చి చెప్పుటలోని నీతిని విడరాదనుటలోని ఆరోగ్యదృష్టి ఇట్టిది.

కాని అభిరుచి పథ్యముగా నుండవలెనన్నంత మాత్రమున తీరినదిలేదు. ఈ దృష్టితో విమర్శకుడు కావ్యముయొక్క 'సత్తా' (Value) నిర్ణయింపవలసి యుండును. విమర్శకసూత్రములను సాధికారముగ చర్చించి వివేచించిన రిచర్డ్స అను పాశ్చాత్య పండితుడు విమర్శకున కుండవలసిన మూడు ముఖ్య లక్షణముల నిట్లు చెప్పినాడు: He must be an adept at experiencing, without eccentricities, the state of mind relevant to the work of art he is judging. Secondly he must be able to distinguish experiences from one another as regards their less superficial features. Thirdly he must be a sound judge of values. మన ఆలంకారికులు చెప్పిన సహృదయ నిర్వచనములోని 'విశదీభూతే మనోముకురే' అన్న మాటలకు సమ్యక్ దృష్టి, సత్త్వసంవాదములని అర్థము చెప్పకొనవలసియుండగా మనము సమ్యక్ దృష్టిని మరచినాము. ఇంక కావ్యము పదసత్తుల మాట. దీని నెట్లు నిర్ణయింపవలెను. అనంతరకాలములో పాఠకునియందు కలుగు శాంతి సామరస్యములనుబట్టి చిత్తవృత్తినిబట్టి నిర్ణయింపవలెను. కావ్యముయొక్క 'సత్తా' తాత్కాలికములైన ఉద్రేకాలకు అనువుగ ఏర్పడే చిత్తవృత్తుల పొందిక, కూర్పు అనువానితో లంకెపడి యుండును. కావ్యము చదువునప్పుడు గలిగిగా మన మనుభవించెడి భావతీవ్రతనుబట్టికాని, పొంగునుబట్టికాని, హ్లాదగుణమునుబట్టి కాని, మనసు కరగుటనుబట్టి కాని 'సత్తాను' నిర్ధారణచేయరాదు. ఉద్రేకాలను (Impulses) పొందికగా అమరించి వ్యక్తి వానికి చిక్కుపడకుండా చేసి ఎంతవరకు విస్తృతిని సమగ్రతను అనుభవమునకు సాధించిన అంత మంచిదనుకోవలెను. తాత్కాలికమైన పారవశ్యమున్నప్పటికిని ఈ 'సత్తా' చాలని అనుభవప్రపంచ మెంతో ఉన్నది. భావానుభవసమయమున ఏర్పడే విలక్షణత (Character) తాత్కాలికముగా మంచిదిగా కన్పించినా ఆ అనుభవమును కలిగించిన ఉద్రేకాలు (Impulses) కూడ మంచివే అని తిరుగు లేకుండా నమ్ముట కష్టము. కనుకనే కావ్యమును చదివి ఆనందించే సమయమునకంటె అనంతరకాలములో పాఠకుని చిత్తవృత్తి ఉద్రేకాలను సామరస్యము నెంతవరకు సాధించిన అంతవరకా కావ్యము సత్కావ్య మనదగినదగును. రచనయొక్క శాశ్వతత్వముగూడ ఈ సామరస్య సాధనాశక్తిపై ఆధారపడి యున్నది. భావము, వస్తువు, రచన—అను మూడు ప్రధానలక్షణములుగల కవితామార్గముల స్పృశించి శర్మగారు రచనప్రధానమై తాత్కాలిక చమత్కారకారియైనదాని నవరమని చెప్పి, 'తృప్తి' ని కలిగించు వస్తురచ నొక్కసారికిమాత్రమే మెప్పుకొని భావప్రధాన మగు కవితనే ఉత్తమమనుట ఈ అనంతర కాల ఫలదృష్టితోనే.

శర్మగారి రసమార్గాభిరుచి రచనల విషయమున గూడ ఆధునికులకు తగినట్లుగనే మారినది. రసము లెన్నియను చింత ఆయనకున్నట్లే తోచదు. ఏమనగా ఆయన 'అనంతా వై రసాః' అను మార్గానికి చెందినవాడు. ఆధునికుల ఉద్వ్యక్తాభివశ్యమున ఆయన కాదరమున్నదంటిని. వీరి విపరీత చిత్తవృత్తులకు దూరముగ తొలగిరేకాని ఖండకావ్యరచనపై ఆయన కిష్టము మెండే. మును పెప్పుడో ఖండకావ్య రచనలోని సాధక బాధకములనుగూర్చి ఆయన వ్రాసినట్లుగూడా జ్ఞాపకము. అంతేకాక ముక్తక రచనపైగూడ అభిమాన మెక్కువ యనుటకు ఆయనయే అనువదించిన గాథా

సత్ఫలితి సాధ్యము. ఆయన రసలోలుపతచేత నే 'అనంతా వై రసాః' అను మార్గమును అవలంబించినను ఆయన పద్ధతి మనకాలమునకు శక్తికి రసానుభవమునకు గల వసతికి తగినట్లుగా నమరి వచ్చినది. ఏమనగా సంకీర్ణమైపోయిన నేటి నాగరక జీవితమున ఆధునికులది అన్ని విషయములలోను భ్రమరవృత్తి అయినది. అస్తు.

రసమార్గమునం దభిరుచి ఇట్లు ఆధునికులకు అవసరమై పథ్యమైనదిగా తలచిన శర్మగారు తమ విమర్శలను ఈ మార్గమున పుట్టి వచ్చిన మూడునాలుగు సూత్రముల ననుసరించి నడిపినారు. వీనిలో మొదటిది కవిలో విశిష్టమైన ప్రతిభ ఉండవలెనే కాని వ్యక్తిగా విపరీత చిత్తవృత్తు లుండరాదు. అనగా భావసర్వము లన్నియు సహజమైన పాళ్లలో నుండవలెను. కొల్లనిక, అధివాస్తవిక కవులలో ఈ సహజత తక్కువయని గమనించితిమి. రెండవది కవిలో గాని పాఠకునిలో గాని ఏ చిత్తవృత్తికూడ (Attitude) వ్యర్థము కారాదు. ఇది కళాసర్వము. అనగా కావ్యములో వ్యర్థచిత్తవృత్తులకు కారణమైన దేదియు ఉండరాదనుట. ఇచ్చట కళలలోని — ముఖ్యముగ కవిత్వములోని — శిల్పముమాట యించుక ఆలోచింపవలెను. ఇచ్చటనే శర్మగారి దృష్టికిని కవిసమ్రాట్టుల దృష్టికిని కొంత సహజమైన భేదమున్నట్లు కాన్పించును. శర్మగారు రసలోలుపతచే నిరంతర మననశీలి; పాఠకులకు ప్రతినిధి. విశ్వనాథవారు నిరంతర కావ్యనిర్మాణ వ్యగ్రులు; కవులకు ప్రతినిధి. శర్మగారు కావ్యానంద మందే కాక దానికైన ప్రయత్నము పొదుపుగా నుండవలెననుటలో అభినివేశము. చిరనిర్మాణవ్యగ్రతచే విశ్వనాథ శిల్పమునుగూడ ఎక్కువగా జూతురు. సంగీతమువలె సాహిత్య మాపాతమధురము కాదు; ఆలోచనామృతము. అందుచేత కావ్యము శిల్పఖనిగా నుండవలసి వచ్చును. శిల్పము ఆనంద సాధనకు తోడ్పడునంతవరకు కావ్యములలో నుండక తీరదనియు కళలో అదియొక ముఖ్యభాగమనియు శర్మగారొప్పకొనక తీరదు; ఒప్పుకొందురు గూడ. కాని ఆశిల్పమే పరమార్థమై ఒక వృథాచిత్తవృత్తిని పెంపుచేసి కవిత్వమునుండి భావానుభవమును దూరముచేసి బుద్ధిగమ్యత నాపాదింపరాదనుటయు నిజమే. రచనలో భావమున కది యొదిగియుండి చర్వణలో తేటపడవలసినదనియు, ఆ తేటపడుటలోని స్రోతోగుణము (Spontanity) సరిగా నున్నంతవరకు శిల్పదృష్టి కళాభిహితమే అనియు అనుకొనవలసి యుండును. ఇంతకును శర్మగారెంత రసలుబ్ధులో విశ్వనాథవారంత రసగద్రవనాదదక్షులు. వారి అభిరుచి భేద మిట్లు చాల కొంచెము. శర్మగారిట్టిదృష్టితోనే నాచన సోముని గురించి వ్రాసిన వ్యాసములలో ఎత్తిన పద్యములను మెచ్చుకొనుటయు సోమునిపద్యముల తీసివేయుటయు జరిగినది. సోముని 'ఘనదానాంతఃపుర తోరహారము' లన్న పద్యమున వీరరాజుగారు చెప్పిన శిల్పము వృథా చిత్తవృత్తి హేతువు. 'చెందమ్మి విరులతోఁ జిందు తేనెలువోలె' అన్న పద్యమున కవి సహజచిత్తవృత్తిని (Normalcy) మాపక చమత్కార లోభమునకు పాల్పడినాడు.

శర్మగారు ముఖ్యముగా పాలించెడి మూడవ సూత్రము: కవిత్వమే కాదు రచన ఏదైనను సంకేత దూషితము కారాదనునది. ఆయన వ్రాసిన వ్రాతలలో నెక్కడకూడ పారిభాషికపదజాలమును వాడక పోవుట గమనార్హము. విమర్శలలోనే యిట్లుండగా నింక కావ్యమున సంకేతపదముల నెట్లు వాడవచ్చును? సంకేతము నెఱుగుట సాధ్యమే అయినను అది పని చేయగల రంగము విస్తృతి చాలకొద్ది. భావస్పందము కల్గించుట కది పనికిరాదు. మనుష్యుల చిత్తవృత్తుల మార్చుటకు, సామరస్యము కల్గించుటకు భావమార్గమే సాధ్యము నిపుణమును అగును గాని సంకేతమార్గము కాదు.

శర్మగారు తమ అభిరుచిలో అనుసరించి అనుభవించిన రసమార్గము మనలోని అంతరంగ వాసనల నన్నిటిని పండించునది; మన మనసులోని సౌమనస్య వైమనస్యములకు సామరస్యమునుగూర్చి శాంతినొసగునది. ఇది పథ్యమైనదని చెప్పుచున్నను అంతకంటె మనసు లోగొనగల మార్గము లేదనుట అంద రెఱిగినదే; తియ్యని తేనెమందు — సత్త్వముగలవారికి మాత్రమే అది యనుభవింపసాధ్యము. తిక్కనవారు మాటలతో తృప్తిపడవలసినదే.

కావ్యాచ్చ ఫలసంస్పృష్టాత్
రసాలా దివ బాలకైః,
లోభ్యతే బహుభిః, కైశ్చిత్
భుజ్యతే సాత్త్వికైః ఫలమ్.

# దుగ్ధపథము

శ్రీమతి పి. అరుణకుమారి

ఏంత క్రొంజిగితో నభోంతరాళమున
ఎంత చక్కని బాట యీ రేయి వెలసె!

పాలరాళ్ళను రత్నపాళితోఁ జేర్చి
నీలాంబరపుఁ ద్రోవ నిర్మించి రెవరొ!
కమనీయ దీప్తి పుంజములు చిమ్ముచును
రమణీయ రథ్యమై రాణించె నద్ది.

అరవిచ్చు మల్లెక్రొవ్విరుల పందిళ్ళు
విరజాజి పొదరిళ్ళు విన్నాణ మొలికి
ఎలదోఁట లా బాట కిరువైపులందు
దళుకొత్తె నిగ్గు దొంతులు తీర్చినట్లు.

ఆ వియత్తల మనోహర దుగ్ధపథము
నా వికస్వర లతాంతారామసీమ
బహువు నిద్దుర కంటఁ బరికించి ఇట్టె
పరవశత్వము నొంది భౌమ్యబంధముల

పొలిమేరలను దాఁటి కల నౌచుఁ దేలి
అల మంజుసుమవాటి నల పాలబాట
నలరునై వికసింప నాశింతు—కాంతి
కలికనై దీపింపఁ గాంక్షింతు—నేను.

# పర్వ ప్రభావానుభవము

శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఏమి కారణమో కాని, దాదాపు రెండు దశాబ్దముల క్రిందటి కథ ఒకటి ఆకస్మికముగా ఇప్పుడు జ్ఞాపకమునకు వచ్చినది. 'భారతి' అనుగ్రహమున పాఠక మహాశయులకు దానిని నివేదించుటకై సంకల్పించితిని. నా దృష్టిలో, అది యొక అసాధారణమగు అనుభవము. దానితో జ్యోతిశ్శాస్త్ర సూత్రములకు కొంత సంబంధమున్నదని నా నమ్మిక.

"అసాంకేగ ఒదరీ చక్రం
యుహాంకం ఒరీక్షకః,
బాహ్యరాణాం సంబంధో
యూహసం యూహసం వయం వయం."

అనుగనపు సంబంధము కేవలములని భావింతురేమో? ఎట్టిద నాపలే, దిగునగాలకు విన్నసించిరో, నా హృదయభారము తగ్గును.

ఆ దినములలో నేనొక పురమున దండనాధికారిగా పని చేయుచుంటిని. కార్యస్థానపు పనులకు అంతరాయము కలుగకుండునట్లుగా, విరామ కాలమంతయు నా నాయక చోప్పన జాతకశాస్త్ర వ్యాసంగమందే కడపుచుండెడివాడను. అసాధారణములగు అనుభవ విశేషములు కల జాతకములను వ్యక్తుల ప్రయాసల కోర్చి సంపాదించుట, వాని అనుభవములకు శాస్త్రదృష్టితో కార్యకారణ సమన్వయము చేయుట, దైనిక జాతక యోగములకు వ్యక్తిజీవిత సంఘటనములతో కల సంబంధమును పరిశీలించుట, ఇత్యాది కార్యములతో కాలక్షేపము జరుగుచుండెను.

అక్టోబరు నెల 23 వ తేదినాడు రానున్న అమావాస్య (రవిచంద్ర సంయోగము) సాయన తులా రాశిలో 29¼° వ భాగలో వచ్చునని రమారమి పది దినములకు ముందుగనే గమనించితిని. నా జాతకమందు కుజుడు ఆ తులారాశి 29° వ భాగలోనే ఉండుట. చతుర్థ లాభాధిపతియై దశమకేంద్ర మున్న మందున్న గ్రహము ఈ కుజుడు. గ్రహరాజగు రవితో నిండుగా (త్రికోణ) ప్రత్యక్ష మిత్రదృష్టి, లగ్న ధనాధిపతియగు శనితో (కేంద్ర) గుప్త శత్రుదృష్టి ఈ కుజునికి కలవు. అధికారుల ఆదరము, ప్రజల విశ్వాసము, సంపాదించి ఇచ్చు శక్తిగల రవి కుజమైత్రి ఉద్యోగ కార్యముల విషయములో మాత్రము హితమైనదే కావచ్చును. కాని, కాయక్లేశము, ద్రవ్యనష్టము, ప్రమాదములు, మున్నగునవి సూచించు కుజ శని కేంద్రదృష్టి కొంతయయినా, అహితకరము కాకపోదు. నా రాజ్యస్థానపు కుజుని కార్యములలో ఈ దృష్టియోగముల సమష్టి ఫలము మాటవేసియుండును. ఇట్టి కుజుడు జన్మకాలమున తన ప్రభావమును తులా రాశిలో 29° వ భాగలో నిలిపినాడు. ఆ చోటనే ఇప్పుడు పర్వము పడుచుండెను! పర్వకాలమున రవి చంద్రకిరణ సంయోగమువలన ఆకాశరంగమునం దుద్భవించి భూమిపై ప్రసరించు ప్రపంచశక్తి ఆ తులారాశి 29° వ భాగయందు నిక్షిప్తమైయున్న నా జాతక కుజ శక్తిని బాగుగా కదలుకొలిపి వచ్చు కెప్పగలదు కదా?

ఇది స్ఫురించినంతనే, కొంచెముగా, గుండె జలదరించినది. పర్వము పిచ్చె ప్రేపెతెను. వలదని నా రాకమానదు. నా కుజస్థానమును అది ఉద్రేకింప చేయుట సహా తప్పదు. ఈ ఘర్షణమువలని ఫలము ఏదో రూపముగా నా జీవితములో అనుభవమునకు రావలసినదే? "కాలోహి దురతిక్రమః" అను అభియుక్తసుభాషితమునకు అర్థమిదే.

నా దశమాంగారకుని స్థానమునకు రానున్న ఈ సంఘర్షణమువలన ఉద్యోగధర్మములో ఆందోళనము, క్లేశము, నష్టము, కలుగనున్నవని సామాన్య సూచన. ఏ రూపముగా ఈ ఫలము వ్యక్తమగునో, కర్తవ్యమేమో, అనునవి సమస్యలు. "దేవోపి తం లంఘయితుం న శక్తః" అను సంప్రదాయముపై అభిమానము కలవారగు పెద్దలు రానున్న మంచిచెడ్డలను గూర్చి ఏమియు ఆలోచించక చేతులు కట్టుకొని మూల కూర్చుండుట సామాన్యముగా అసంభవము. యోగసిద్ధులమాట ఏమోకాని, అట్టి చర్య సామాన్య మానవ ప్రకృతికి విరుద్ధమైనది. తత్త్వజ్ఞానమో, విరక్తియో, ఎంత ముదిరినా, కర్తవ్యమును గూర్చి ఆలోచించక ఉండజాలము. "తనబలముతో, తన వీర్యముతో, తన తేజస్సుతో, తన కర్మతో, తానే, తనకొరకే, తన ప్రీతికై, భగవంతుడు 'నాతో' ఈ కార్యమును చేయించుచున్నాడు." అని సంకల్పించి,

సాత్త్విక త్యాగము చేయు పరమైకాంతులు సయితము 'నా' అను పదమును వదలలేరు. వదల లేరుకూడ.

పోనిండు. ప్రకృత సందర్భమున దైవశక్తి ప్రబలమైనది.

"ఏకగ్రహేణాంశగతో,
యథోక్త ఫలద శ్శశీ గ్రహవశేన."

అని వరాహమిహిరాచార్యులు చెప్పినట్లు, నా కుజస్థానమునందే నికరముగా పడుచున్న ఈపర్యాయము పూర్ణ ఫలమును జూపకపోదు. దైవికముగా పరిస్థితులలో ఏమార్పులు వచ్చునో, ఏనూతన సన్నివేశములు ఏర్పడునో, ఊహించుట కష్టము. సన్నివేశములు, పరిస్థితులు మన అధికారమునకు లోబడినవి కావు. వానిని మనము అనువుగా నుండునట్లు చేసుకొనజాలము. మన ఇంద్రియములే మన మనస్సే మన అధీనములో నుండుట కష్టము కదా? కనుక పట్టుదలతో ప్రయత్నించినచో, మనకు సాధ్యమగునది మనపురుషకారము మాత్రమే. దీనికి మనోనిగ్రహము, సంకల్పదార్ఢ్యము కావలసియుండును. దైవము సృష్టించు పరిస్థితులలో హితమగురీతిని ప్రవర్తించుటకు పురుషకారమును జరుపుట మాత్రమే మన కర్తవ్యము.

సరే. పరిస్థితులలో, సన్నివేశములలో ఏ మార్పులను దైవము తెచ్చిపెట్టునో చూడవలసియున్నది. ప్రమాదముల కవకాశమిచ్చు ప్రయాణముల సందర్భము కానరాలేదు. అనవసర కష్టములకైనా కారణములు చూపట్టలేదు. కుటుంబములో అందరి ఆరోగ్యము తృప్తికరముగా నుండెను. ఉద్యోగ ధర్మములో కార్యక్రమము తొందరలేక జరుగుచున్నది. మరి పర్వముచే ఉద్రిక్తము కాగల కుజప్రభావమును ఏరీతి సమన్వయ పరచుకోవలయునో బోధపడలేదు. ఆలోచించుచునే యుంటిని.

అమావాస్య మూడుదినము లున్నదనగా తలవని తలంపుగా తపాలులో మనఃక్షోభము కలిగించు సమాచారమొక్కటి వచ్చెను. పర్వమునాటి ఉదయము పది గంటలకు మండల దండనాధికారి ఆగ్రామమునకు వేంచేయుచున్నారట! దైవము సిద్ధపరచిన సన్నివేశమిది! లోగడ ఆ ఉద్యోగమును నిర్వహించుచుండిన వ్యక్తి నెలదినముల క్రింద మారిపోయి, క్రొత్తవ్యక్తి ఆపీఠము నెక్కియుండెను. అతడధికార స్వీకారము చేసిన శుభదినమున మండలమందలి అధికారులందరు హారములు, పూలగుత్తులు, పండ్లబుట్లు సేవకులతో మోయించుకునిపోయి, అతనిని సందర్శించి ఉపాయనము లర్పించి, పరిచయభాగ్యమును సంపాదించుకొనియుండిరి. సాధారణముగా, ఇట్టి సందర్భములకు వెళ్ళుట నాకు రుచించనిది. మండలమందు దండనాధికారి హోదాకుతగ్గని ఉద్యోగు లందరిలో ఆఉత్సవమున పాల్గొనని అభాగ్యుడు నేనొక్కడనే! గర్వమని కొందరు, ఔదాసీన్యమని మరికొందరు, అవివేకమని వేరొకొందరు, నన్నుగూర్చి అచట రకరకములుగా వ్యాఖ్యానము చేసిరట! "ఆనాడు తన సందర్శనమునకు రాని ఉద్యోగి నేనొక్కడనే" అని ఆ నూతనాధికారి కర్ణపుటములకు సైతము సోకినదట! నాపైన అకారణ వాత్సల్యముగల తోడి ఉద్యోగులు కొందరు సమయమును కనిపెట్టి యీ పుణ్యమును కట్టుకొన్నారు.

ఆఉత్సవమున పాల్గొన్నవారిలో నా మిత్రుడొకడు తరువాత కొన్నాళ్లకు నన్ను కలుసుకున్నప్పుడు ప్రస్తావవశమున వివిధ విషయములు నాకెరిగించి, నేను పొరపాటు చేసితినని సంచలించినాడు. ఆక్రొత్త అధికారికి పరిపాలనములో ఇతర విషయములపైన శ్రద్ధలేదట! దండనాధికారులపై ప్రతిదినము ఏదోరీతిగా దండయాత్ర సాగించుటమాత్రము అతని ఆదర్శమట! తీర్మానములను అనిశ్చితముగా తనశైల్య పరీక్షకు గురిచేసి తీక్ష్ణముగా విమర్శించుట, ఆకస్మికముగా కార్యస్థానములకు వెళ్ళి ఏదో ఒకటి తప్పుపట్టుట, అనునవి అతని దినచర్యయందలి కార్యక్రమమట! కోపము వచ్చినప్పుడు అతని వాగ్ధోరణికి హద్దు లేదనియు, అప్పటికే ఇద్దరిమీద [illegible] చేసినాడనియు, నా మిత్రుడు వర్ణించి వర్ణించి చెప్పెను.

"నేను దర్శనమునకు పోయియుండవలెను కాబోలు?" అని ప్రశ్నించితిని.

"రాకేమి? వచ్చియుండిరి."

"మరి, నజరానా సమర్పించలేదేమో?" అంటిని.

"అదే వింత! అందరికంటె వారిదే పైచేయి. స్వయముగా బెంగుళూరికిపోయి మేలురకపు జరీకుచ్చుల పూలహారాలు, శ్రేష్ఠమైన సీమరేగుపండ్లు, కాబూలు ద్రాక్ష మొదలగునవి సమృద్ధిగా తెచ్చుకొనియుండి సమర్పించినారు. వారి భాగ్యమునకు మేము కొందరు సిగ్గుపడితిమికూడ." అని నా మిత్రు డుపన్యసించెను.

"మరి, దాని ఫలమేనా ఈ అనుగ్రహము?" అంటిని. నా కేలనో చిన్నగా నవ్వు వచ్చినది.

"వారి గ్రహచార మందువు. సరే లెమ్ము. అయినా, మన జాగ్రత్త మనది." అని నా మిత్రుడీ కథ చాలించెను. అతని సానుభూతికి కృతజ్ఞతను తెలిపితిని.

మండలాధికారి రాకనుగూర్చిన సమాచారము వచ్చిననాడు నాకీవిషయమంతయు స్ఫురణకువచ్చినది. ఆనాటి సాయంకాలమున తాలూకా అధికారి

# పర్వ ప్రభావానుభవము

నాకడ కొక రాయబారిని పంపెను. సంజయునికంటే చతురుడా రాయబారి; సహాయుక్తిపరుడు. ఏమేమో విషయములనుగూర్చి మాటలాడుచు, సందర్భమున మండల దండనాధికారి రాకను ప్రస్తావించి, అతడు వచ్చినప్పుడు సముచిత గౌరవ సత్కారములు జరుపుట స్థానికాధికారుల కర్తవ్యమని నిరూపించి, అతిధికారం స్వీకారము చేసిననాడు నేను వెళ్ళియుండని కారణమున అతనికి నాపట్ల కొంత అతృప్తి కలిగి యుండుట సహజమని సూచించి, ఆ దోషమును నివృత్తి చేసుకొనుట ప్రాపంచిక దృష్టితో నాకు హితమని సిద్ధాంతీకరించి, అందుకొరకై తగిన రీతిగా ఫల పుష్పాదులు తెప్పించి అతడు వచ్చినప్పుడు సమర్పించు కార్యమునకు నేను పూనుకొనుట యుక్తమని ఉపన్యసించినాడతడు. ఇది అంతయు తాలూకా అధికారి చేసిన చాణక్యతంత్రమని అర్థమైనది. ఇట్టి సందర్భము లలో ఇతరులతో సంబంధాలు ప్రోగుచేసి మెలకువతో స్వామి కార్యమును స్వకార్యమును జరుపుకొను ప్రజ్ఞాశాలి అతడని ఎరుగుదును. ఇట్టి పనులు నాకు రుచింపవని కొంత కటువుగానే ప్రతి చెప్పితిని. ఆ రాయబారి ముఖమింత చేసుకొని చప్పగా వెళ్ళిపోయినాడు. తాలూకా అధికారియొక్క అసూయ తప్పదనుకొంటిని.

సరే. పర్వకాలమున గ్రహస్థితి ఎట్లుండునో, పరిశీలింతమని కుండలిని సిద్ధపరచితిని. ఆచక్రము ఇదే:-

| | | | |
|---|---|---|---|
| | శ 13-2[illegible] (వ) | వ 16-28<br>కే 18-34 | |
| I 22-45<br>గు 22-25 | (సాయనము)<br>—<br>పర్వకాలపు<br>గ్రహాభావస్థితి<br>— | | |
| | | | య 1-27 |
| శు 3-56<br>X 1-0 | బు 7-47<br>రా 18-34 | ర<br>చ } 29-16 | ఇ 22-16<br>కు 28-49 |

రవిచంద్ర సంయోగము నా జన్మకుజునిపైన వచ్చుచున్నదని మనవి చేసి యుంటిని కదా? అది యట్లుండగా, ఆనాటి వరుణకేతువుల సరిసమము నా జన్మచంద్రుడు నిలుచుట మనశ్శాంతికి భంగకరము. సప్తమాధిపతియై పంచమభావములో నా చంద్రుడుండుట కుటుంబ విషయకముగా అశాంతి కలుగ వచ్చునేమో! లేదా, భార్యా పుత్రులకు ఖేదము కలిగించు ఆకస్మికప్రయాణక్లేశమైనా కలుగవచ్చును. ఆనాటి వరుణుడున్న భాగ హత్యలకు సంబంధించినదని పాశ్చాత్య శాస్త్రజ్ఞులు వ్రాసిరి. నా ఉద్యోగ ధర్మములలో అప్పుడప్పుడు హత్యాప్రసంగములువచ్చుట సామాన్య విషయము. అట్టి సందర్భమొకటి సిద్ధము కావచ్చును. కాని, దానిచే నా మనస్సు కలవరపడుట సాధారణముగా సంభవించదు. మరి ఏ అసాధారణ స్థితి రాగలదో? జన్మకాలమున నా కుజశనులకు కేంద్ర వేధ కలదు కదా? ప్రశంసలో నున్న పర్వము ఆ కుజశని వేధాఫలమును సయితము ఏకొంత అయినా రగులు కొలుపక తీరదు. ఇట్లుండగా, ఆనాటి యముడు నా జన్మశని మీదనే ఆవాహనమగుట పులిమీద పుట్రవంటిది. ఇది ఏదో ప్రమాదసూచకము. మొత్తముమీద, ఉద్యోగమునకు సంబంధించిన కార్యక్రమములో అశాంతి, గొప్ప సంచలనము, విషమ పరిస్థితి, ఆకస్మిక సంఘటనము, ప్రమాదకరమగు ప్రయాణము, ఉద్రిక్తస్థితివలని ఆందోళనము, ద్రవ్య నష్టము సూచితములగుచున్న వనవచ్చును.

ఆనాటికి దైనికజాతకమును సాధించిచూచితిని. దైనికలగ్నము కన్యారాశిలో 29° వ భాగకు వచ్చును. ఏమి విధి విలసితమో ఇది? ఆ పర్వము నా జన్మకుజుని ఉద్రేకింపచేయుచుండగా ఆనాటికుజుడు దైనికలగ్నము నే చేరుకోవలయునా? "ఏకాంశస్పృష్ట్యా తు [illegible]నే ఫలం స్యాత్" అను జ్యోతిష న్యాయరీత్యా, పర్వ ప్రేరితమగు కుజఫలము ఆనాడే అనుభవమునకు రావలసియుండునని సారాంశము.

దైనిక లగ్న దశమాధిపతి బుధుడు. దైనిక లగ్న పంచమి చంద్రునితో బుధునికి అర్థకేంద్రవేధ! అది కలు, అసత్యములు, కూటసాక్ష్యములు, మోసము, ద్రోహము ఇత్యాదుల సంబంధము నీయోగము సూచింప గలదు. మండలాధికారియొక్క అవిశ్వసనీయ చిత్తవృత్తియైనా ఇది తెలుపవచ్చును. లేదా, ఎవరైనా మహానుభావులు నాపైన అతనికి కొండెములు చెప్పుదురేమో? దర్పనమునకుపోని లోపమొకటి నాలో నున్నది కదా? తన రాయబారమును తిరస్కరించితినని తాలూకా అధికారికి అతృప్తియున్నది. ఇట్టి అవకాశము ఉపయోగించుకొను చాతుర్యములో అతనిది అందెవేసిన చేయి!

మండల దండనాధికారి ఆనాడే నా కార్యస్థానమునకు రావచ్చును. ఉన్నదో, లేనిదో ఏదో

తప్పు పట్టవచ్చును. నాకు రక్తోద్రేకము కలిగించు మాటలు పుట్టవచ్చును. అకారణముగ తప్పు పట్టినచో మాత్రము సహింపను ఏమయినా సరే, తగిన ప్రతి చెప్పక ఊరకుండుట నాస్వభావము కాదు. ఏమి చెప్పినా 'చిత్తమని' తలయొగ్గుట నా దశమభావమందలి కుజ వర్గణలు నేర్పనివిద్య. ఏ అధికారిని కాని 'దేవరా' అని సంబోధించి ఎరుగను. వారితోటి సంభాషణమందు సర్వదా మధ్యమ పురుషకు మారు ప్రథమ పురుషనే ఉపయోగించుట నాఅలవాటు. కాని, మండలాధికారికి నావంటి ఉద్యోగులపైన సర్వాధికారము కలదు. అతను పగపట్టినా, నిస్సంశయముగా కష్టమే.

అయినా,

"వరాకోऽపి కంఠీరవః కిం ద్వితీయః." అని జ్యోతిశ్శాస్త్రవేత్తలచే ప్రశంసింపబడినవాడు రాజ్యస్థానమందలి కుజుడు. పైగా, ఆ కుజునికి గ్రహరాజు నుండి పరిపూర్ణ మిత్రదృష్టి. సేనాపతికి రాజానుగ్రహము సమృద్ధిగా నున్నప్పుడు అతని అధికారమునకు లోపమెట్లు రాగలదు? కనుక, ఉద్యోగ విషయమున గౌరవహాని రాగలదను భయము సాధారణముగా నాకు లేదు. కుజ శని వేధా ఫలముగా, కష్టమో, నష్టమో రావచ్చును. తలవని తలంపుగా, క్లిష్ట పరిస్థితులున్న గ్రామాంతరమునకు నాకు మార్పు రావచ్చునేమో?

తాజక సంప్రదాయము ననుసరించి ఆ నాటికే దినజాతకమును గుణించి చూచితిని. దిన ప్రవేశకాలములో లగ్నము సింహరాశిలో 24°వ భాగకు వచ్చినది. పుణ్య సహమము నికరముగా వరుణుని కేంద్ర వేధలోనుండును. ఆకస్మికముగా పుణ్యమునకు దెబ్బ తగులునేమో? పర్వక్షణమున ఉదయించు బృహస్పతి దినలగ్నమునకు సప్తమ భావములో నుండగలడు. గురుదృష్టి యోగ్యమే కాని, అతనికి ఆ దినజాతకములో మృత్యుభావాధిపత్యము వచ్చుట మాత్రము రుచికరము కాదు. "కళత్రతోపాత్ మృతిస్భవేత్ నూనం" అను సూత్రము అష్టమాధిపతియొక్క సప్తమ భావస్థితికి గుప్తఫలమును చెప్పుచున్నది. భార్యాదోషము వలన మరణము రావచ్చునట.! శ్రీమతి ఏమైనా పొరబాటుచేయునేమో? కాని, నా జాతకమున లగ్నాధిపతి సప్తమభావమందుండుటచే, "లగ్నేశే సప్తమే యస్య తస్య భార్యా వినశ్యతి" అను పరాశర వలన శ్రీమతికి సౌభాగ్యము చెడుసంభవము మాత్రము లేదను ధైర్యమున్నది. 'కళత్ర' మను పదమును ఉపలక్షణముగా గ్రహించినచో, ప్రబల శత్రువులవలన కాని, చోరులవలన కాని, ప్రయాణమువలన కాని, కాయక్లేశము సంభవింపవచ్చునను అర్థము సిద్ధించును. అట్టి శత్రువులేమో నాకు లేరు. ఇక చోరుల విషయమా, ఊహకు మించినది. ప్రయాణ క్లేశము రావచ్చును. ఇది ఇట్లుండగా ధనాధిపతియగు బుధునికి ఇంద్రుని అర్ధకేంద్రస్థితి ద్రవ్యనష్టమును సూచింపగలదు. ఆ నాటి శని (షష్ఠ సప్తమాధిపతి) యుండు మేషరాశి 13°వ భాగ "తిండి తీర్థ"ములకు సంబంధించినదట! ఆ శనికి నా జాతకమందలి ఇంద్రుని నుండి అర్ధకేంద్ర వేధ నికరముగానుండును. దోషయుక్తమగు ఆహారమో, అనాహారక్లేశమో, ఆరోగ్య భంగమును తెలుపును. "లంఘనం పరమౌషధం." అను రీతి ఆ దినమున ఉపవసించుటే క్షేమము కాబోలు. తేలిన దేమనగా శరీరక్లేశము, అశాంతి, కష్టము, ఏదో రూపముగా రావలయునని దైవము సూచించినదనుట.

ఇట్టి పరిస్థితులలో ఆనాడే మూడు మండలాధికారిని ప్రత్యక్షముగా చూడవలసి వచ్చుట నా అభాగ్యమహిమ. పర్వము సూచించు ఫలములకు అతని రాకతో సంబంధము ఉండితీరవనుట నిస్సందేహము. ఆనాడు అతడు రానిచో, మంచిదే. కాని, అతనిని రాకుండ చేయుట సాధ్యము కాని పని. వచ్చిన తరుణమందే అతని దర్శనము చేయుట కూడ తప్పనివిధి. ఇదే ప్రబలదైవము తెచ్చిపెట్టిన చిక్కు. ఆనాడు అతనిని చూడకుండుట సాధ్యమైనచో, చాలవరకు పీడ తొలగినట్లే. కాని, నా ఉద్యోగ స్వభావములో కార్యస్థానము వదలి గ్రామాంతరములకు పోవుట సాధారణముగా సంభవించదు. ఇక, సెలవునకు వ్రాసుకొని వెళ్ళినచో, ఉద్దేశపూర్వకముగా ముఖము తప్పించుకొంటినను అభిప్రాయము పుట్టుటకే అవకాశమున్నది. చెప్పుకొనుటకైనా, అత్యవసర కార్యభారము నాకేదియు కానరాలేదు. మరి, తాలూకా అధికారి ఇష్టానుసారము పోరమో, గిరమో, తెప్పించినచో, ఉద్యోగపు కారణమున ధన నష్టమను ఫలము వచ్చినట్లే అగును. కాని, ఈ నజరానాపద్ధతి నాకు గిట్టనిది పోగా, ఇంద్రబుధుల యొక్క, చంద్రవరుణుల యొక్క వేధాఫలము ఏమైనట్లు? నాకు రుచించని స్థలమునకు మార్పు వచ్చునా?

దైవగతి అపరిహార్యము. దానికొక్క స్వరూపము కల్పించుట మాత్రమే పురుషకారపు పని. ఉన్న పరిస్థితులలో సాధ్యమయినంతవరకు హితమగు రీతిగా, సహ్యమగునట్లుగా, దైవఫల మనుభవించుట యుక్తము. ఉద్యోగధర్మములో మండలాధికారితో మాటపడరాదని నా సంకల్పము. సాధ్యమయినచో, మార్పు రాకుండవలయుననియే నా కోరిక.

ఆలోచించిన కొలది, అమావాస్యనాడు మండలాధికారిని చూడకుండుటే హితమని తోచినది. కాని

దీనికి తగిన ఉపాయము పొడగట్టలేదు. కాలము కడచి పోవుచుండెను. ఏది నిలచినా, కాలచక్రముమాత్రము నిలువదుకదా ?

అంతలో చతుర్దశి రానేవచ్చెను. మరుదినమే పర్వము. ఆందోళనము అధికము కాసాగినది. నా సంకల్పము నెరవేరుటకు ఉపాయము కానరాలేదు. రెండు మూడు దినములుగా తపాలులోవచ్చిన విన్నపములు, ప్రథమ సమాచార లేఖలు, పోలీసు రిపోర్టులు, విమర్శించి చూడసాగితిని. దొంగతనములు, ద్రోహములు, కొట్లాటలు, ఘాతలు, ఆకస్మిక మరణములు, విశ్వాసఘాతకచర్యలు, అక్రమ ప్రవేశములు, మున్నగు నేరములకు సంబంధించిన వ్రాతలవి. వానిలో ఆత్మహత్యకు సంబంధించిన శవపంచాయతీ రిపోర్టు ఒకటి. దాదాపుగ 35 మైళ్లదూరమందలి ఒక పల్లెలో నిండు యౌవనములోనున్న ఒకానొక కాపుకోడలు, ముట్టికుట్ల బాధ సహించలేక, ఇంటిలోనే దూలమునకు త్రాడుకట్టి ఉరివేసుకొని మరణించినదట! ఇట్టి మరణములలో అనేకములు మూసి పెట్టబడిన హత్యలనుట సుప్రసిద్ధ విషయము. కాని, మరణించిన వ్యక్తియొక్క సన్నిహిత బంధువులు, గ్రామాధికారులు, ఇరుగుపొరుగు వారును, ఏకవాక్యముగా ఆత్మహత్యయని సిద్ధాంతీకరించినచో, నేరపు ప్రశంసయే పుట్టదు. సాక్ష్యములేని కారణమున, న్యాయము జరుగదు. ఇది సయితము అట్టిదే కావచ్చును. పంచాయతీ రిపోర్టునందలి వివరములను శ్రద్ధతో పరిశీలించితిని. ఉరివేసుకొనుటవలన కలుగు మరణ చిహ్నములన్నియు తు. చ. తప్పక వ్రాయబడియుండెను. భర్త అత్తమామలు, ఇతర బంధువులు, ఎవరుకాని ఆత్మహత్యను సందేహించలేదు. శవముపైన ఇతరములయిన ఘాత చిహ్నము లేమియులేవు. కాని, ప్రత్యక్ష సాక్ష్యములేని కారణమున శవము డాక్టరు పరీక్ష కొరకు పంపబడినదట! సందేహ కారణము లేమియు గోచరించలేదు. కాని, నేలమట్టముమీద శవము వ్రేలాడుచుండినఎత్తు, ఉరిత్రాటి పొడవు, శవపు కొలత, మొదలగునవి గమనించినచో, ఆ యింటి మిద్దె రమారమి 13 అడుగుల ఎత్తులో ఉండవలయునని తేలినది. పల్లెటూళ్లలో కాపులఇండ్లు,సాధారణముగా,అంత యెత్తుగా నుండవని నా అనుభవము. ఈ కథలో ఏదో "కుంభకోణము" ఉండునని తోచినది. అవకాశము లభించినదని తటాలున స్ఫురించెను. ఈరహస్యమును భేదించవలెనని సంకల్పించితిని. దానికొరకు ఆ గ్రామమునకు వెళ్లినచో, పర్వమునాడు మండలాధికారిని చూచుట తప్పును. ఈ ప్రయాణము నేను చేయవలసిన అవసరమేమీలేదు. చేయుమని నాకు చెప్పినవారులేరు. చేయనిచో నన్ను తప్పుపట్టువారునులేరు. అయినా, వెళ్లవలయుననియే నిశ్చయించితిని.

ఏదో బాడుగ మోటారుకారు సంపాదించుకొని, అమావాస్యనాడు తెల్లవారకపూర్వమే హుటాహుటిగా ఆపల్లెకు బయలుదేరితిని. త్రోవలో ఒకనదిలో ప్రవాహమున్న కారణమున ప్రయాణమునకు కొంత ప్రతిబంధకమయినది. ప్రక్క పల్లెనుండి నాల్గుజతల ఎడ్లు రప్పించి, వాని సాహాయ్యమున పది రూప్యముల వ్యయముతో, మోటారుకారును అవలిగట్టునకు లాగించునప్పటికి మధ్యాహ్నము మీరెను. తోడనే ప్రయాణము సాగించగా, సాయంకాలము 3 గంటలవేళకు గమ్యస్థానము చేరుకోగల్గితిని. ప్రశంసలోనున్న ఇంటికిపోయి చూచునా, ఆత్మహత్యాకథ అచ్చముగా "విశ్వామిత్ర సృష్టి" అని స్పష్టమైనది. నా ప్రయత్నము నిరర్థకముకాలేదని ఎంతో ఉత్సాహము!

ఆ ఇంటి మిద్దెఎత్తు 9 అడుగులు మాత్రమే. శవము వ్రేలాడుచుండినదన్నచోట, కాళ్ళకు అందుబాటున ఎత్తున, రెండు ధాన్యపు గాదెలుండెను. మరణ కారణము ఉరి కాజాలదనుట స్పష్టము. ఆత్మహత్యాగాథ విశ్వాసార్హము కాదు. మరి, హత్యఅనునా? నడియూరిలో మిట్టమధ్యాహ్నపువేళ, సొంతఇంటిలోనే హత్య! ఎంత ఘోరము !

పంచాయతీ రిపోర్టు వ్రాసిన పోలీసు అధికారిని, పంచాయతీదార్లనుసహా, పిలిపించితిని. క్రొత్తగా కొలతలు వేయించి ఆ ఇంటి నక్షా సిద్ధముచేసి, వారితోనే హస్తాక్షరములు వేయించితినికూడ.

"మేము లోపలికివెళ్ళి చూడలేదు. మాకేమీ తెలియదు. పోలీసు అధికారి చేవ్రాళ్ళు చేయుమనగా చేస్తిమి." అని పంచాయితీదార్లు తడబడు స్వరములతో పెదవులు తడుపుకొనుచు చెప్పి, తమ బాధ్యతకు జలాంజలి ఇచ్చిరి. పోలీసు అధికారికి చేతులు కాళ్లు వణకుచుండెను. నోటి మాట పలుకుటే కష్టము. "ఇంటివారు, ఇరుగుపొరుగులు, ఆత్మహత్య అంటే, నమ్మి మోసపోయినాను." అన్నాడతడు. ఇంటివారు ఆత్మహత్య అని సాక్ష్యమిచ్చుటకే సిద్ధముగా నుండిరి. లాభము లేదని వారినందరిని అచటనే వదలి, ఒంటరిగా గ్రామములోనికి వెళ్ళి రహస్యముగా కొందరు స్త్రీలను, పిల్లవారిని,ప్రత్యేకముగా విచారించి,ఆశ్చర్యకరములగు ఆవిషయములు గ్రహించితిని. ఇంటి యజమానునికి గతించిన యువతి భర్త దత్తకుమారుడని, కామాంధుడై

ఆమెను లోబరచుకొనదలచి మూడు నాలుగు సంవత్స
రములుగా దుష్టుడగు మామ ఎన్నియో మార్గముల ప్రయత్నిం
చినా, ఆ శీలవతి అతని ఆటలు సాగనియ్యక తిరస్కరిం
చుచు వచ్చినదని, ఈ రహస్యము తెలిసి యుక్తిగా
రాలను అత్త భర్తకు చెప్పినా ఫలము కానరాకుండు
టచే, అతనికి అవకాశము లభించకుండునట్లుగా కోడలిని
కాపాడుచు వచ్చినదని, ప్రస్తుతము జరిగిన రోజు మధ్యాహ్న
వేళ, కోడలు ఇంటిలో కొర్రలు దంచుచుండగా
ఏదో అత్యవసర కార్యముండి అత్త గ్రామములో
బంధువుల ఇంటికి వెళ్ళుట గమనించి మామ ఇంటికి
వచ్చి కోడలిని నిర్బంధించి, ఆమె నిరాకరించి కూతలు
పెట్టగా, కోపముతో ఆమె చేతిరోకలినే లాగుకొని
ఎదపై మోదినందున ఆమె పడిపోయినదని తెలిసినది. తరు
వాత, అత్త ఇంటికివచ్చి చూచి, పొలములోనున్న కుమా
రుని రప్పించి, బంధుమిత్రులతో సంప్రదింపులు జరిపి,
గ్రామాధికారుల సాహాయ్యముతో, ఉరిత్రాటికథ
అల్లినదట! కోడలిని కోలుపోయినదిగాక, మొగునికి
సైతము ముక్తిమార్గము చూపుటకు, పాపము ఆ ఇల్లాలు
ఎట్లు పూనుకొనగలదు? సరేకాని, నీతిని నీటకలిపి కోడలి
నిండుప్రాణము నిట్లు నిలువున హతమార్చిన ఆ నీచుని
సంఘములో నుండుట కష్టముకాదా. వివరములు
తెలిసినకొలది నాకు కల్గిన ఆరాటము చెప్పనలవికానిది.
ఎన్ని ఘోరహత్యాపరాధము లిట్లు మూసిపెట్టబడు
చున్నవో? హృదయము తల్లడిల్లినది.

సత్యము తేలినదేకాని, న్యాయస్థానమునకు
కావలసిన సాక్ష్య సామగ్రి లభించనిదే, దోషి
శిక్షించబడుట అసంభవము. విశ్వామిత్ర సృష్టికి ఇంత
ఆస్పదము కలిగినతరువాత, న్యాయస్థానములో సత్య
మునకు విలువుండదు. అయినా సత్యమునకింత
ద్రోహము జరిగినదని బహిరంగపరచుట నాకర్తవ్యమని
భావించి ముఖ్యులను సాక్షులను విచారించి వాఙ్మూ
లములను వ్రాసుకొన నారంభించితిని. కోడలిహత్యకు
మామదే బాధ్యత యని చెప్పుటకు పూనుకొనువారు లేరు.
తనభర్త శీలవంతుడు కాడనియు, ఆవిషయమున అతనిని
తాను దండించినది సత్యమనియు అత్త చెప్పినది.
దత్తుతండ్రిపైన దోషారోపణ చేసినచో, అతడు తనకు
ఆస్తి దక్కనీయడనుభయమున మృతవ్యక్తిభర్త తన
కేమీ తెలియదనెను. తుదకు మామను పిలిచి ప్రశ్నించి
తిని. అప్పటి అతని స్థితి వర్ణించుట అసాధ్యము. ప్రమా
ణము చేయుమనగా, అతడు గడగడ వణుకుచు ఆకా
శము చూచి గుటకలు మ్రింగుచు, నోట మాటలేక
చేతులాడించుచు, ఎదబాదుకొనుచు, క్షణకాలము
వికారచేష్టలచేసి. తటాలున "పాపిముండ! నా నెత్తిన
రాయివేసి పోయినది. నేనేమి చెప్పగలను?" అని నిలు
వున కూలి, ఉన్మత్తునివలె విలపించుచు "అయినది.
నాపని అయినది" అని నేలపైబడి పొరలాడి, కొంత
సేపటికి లేచి కూర్చుండి, తలపై చేతులానించి, 'మాట
వినలేదండి. వినలేదు. రాక్షసి! ఫోనీయని బలముగా నా
చెంపకు కొట్టినది. తల తిరిగిపోయి నేనూ కొట్టితిని.
కోపమువచ్చి రోకలితో వేస్తిని. నిర్భాగ్యురాలు! పడిపో
యింది. నేనేమి చేతును? వ్రాసుకోండి. మీ ఇష్టము
వచ్చినట్లు వ్రాసుకోండి. నా కొంప కూలిపోయినది."
అని కూతలు పెట్టెను.

నా గ్రంథము ముగియునప్పటికి రాత్రి 11
గంటలు మీరినవి. ఆహారము లేదు. ఆ గ్రామములో
త్రాగుటకు దిగుడుబావి నీరే. ఊరిలో ఎందరో వారి
పుండ్లు కట్లతో నుండగా సాయంకాలము చూచి
యుంటిని. కనుక ఆ నీరు త్రాగుటకు ప్రయత్నించలేదు.
తాంబూలముతోనే ఆకలిదప్పులకు కొంత సమా
ధానము చెప్పుచు పని జరిపితిని. కాని, సన్నివేశము
వలని ఉద్రేకముతో, రహస్యము భేదించగలిగితినను
ఉల్లాసముతో, నాకు క్లేశము తోచనేలేదు.

అర్ధరాత్రి వేళ స్వస్థానమునకు మోటారుకారులో
ప్రయాణ మారంభించితిని. ఉదయమునకే గ్రామము
చేరుకోవలయునని ఉత్కంఠ. కాళికాదేవి ఆలయము
నకు తీసుకొనిపోబడుచున్న మేకవలె 'కం. కిం.' అనక
పోలీసు అధికారి కారులో ఒకమూలకు ఒదిగి నిశ్శబ్ద
ముగా కూర్చుండియుండెను. అతని స్థితి చూడగా కర్మ
మనిపించుచుండినది. ఉపకార వేతనమునకు అర్హ
మయిన వయస్సు! అమాయకత ప్రతిబింబించు
ముఖము! పాపము! గ్రామాధికారులను నమ్మి మోస
పోయినాడు కాబోలు? మండలాధికారిని చూచి
నపుడు అతని ప్రశ్నల కెట్లు సమాధానము చెప్పవల
యునో, హత్యాపరాధమునుగూర్చి ఎట్లు వివరించవల
యునో, పరిణామమేమో నాలో నేను ఆలోచించు
కొనుచుంటిని.

కారు వేగముగా పోవుచు మైళ్ళు దాటుచున్నది.
రాత్రి రమారమి ఒంటిగంటకు 10, 12 మైళ్ళుదారి సాగి
యుండెను. లైటుదీపముల ప్రకాశముతో గాఢాంధకార

ముసు చీల్చుకొనుచు కారు పోవుచుండినది. అది బాటకాదు, పల్లెటూరు బండ్లదారి. చూచుచుండగనే, రెండు గుట్టల నడుమ కట్టబడియుండిన చెరువుకట్టమీద ఇరుకుదారిలో కారు ప్రయాణము సాగుచుండెను. కట్టసగము దాటునప్పటికి మార్గము కొంత ఎగుడు దిగుడై గతుకులు కలిగినది. "జాగ్రత్త" అని సారథిని హెచ్చరించితిని. వెంటనే 'కిర్రు'మని బ్రేకుల శబ్దము వినవచ్చెను. అంతలో ఏమి దుర్దైవ మహిమయో కాని, అకస్మికముగా కారుదీపము లారిపోయి కటిక చీకటి ఆవరించినది. గుండెలు ఆగిపోయినట్లయ్యెను. కారునిలువ లేదు. పాతాళ లోకమునకు ప్రయాణము చేయుచున్నట్లు తోచినది. అంతే జ్ఞాపకము!

నాకు తెలివి వచ్చునప్పటికి ఎన్ని నిమిషములు పట్టెనో, చెప్పలేను. పరిస్థితి అర్థము కాలేదు. కొంత సేపటికి తలదిమ్ము వదిలినది. ఏదో ప్రమాదము జరిగినదని, నేను బ్రతికియున్నానని, బోధపడినది. కారులో మూల్గులు వినవచ్చుచుండెను. ఎవరెవరు ఏమైయుండిరో తెలియదు. నా కుమారుని అనుగ్రహము కాబోలు, నాకుమాత్రము ఏమీ దెబ్బలు తగిలియుండలేదు. చుట్టును తడవి చూడగా, కారు ప్రక్కవాటు పడియుండెననియు, పై ప్రక్క తలుపు నిలువుగా పట్టుకొని యుంటిననియు తెలిసినది. ఎట్లో ప్రయాసపడి కొంతకాలము సాముచేయగా, బైటనుండిన ఉత్తరేణి చెట్ల ముండ్లకంపలపైన పడితిని. ఆకాశమున మినుకు మినుకుమని మెరయుచున్న నక్షత్రములు నన్ను చూచి నవ్వుచు కన్నులు మిటకరించుచుండినట్లు తోచినది. బండిలోనివారి గతి ఏమైనదో? మరియొక శవపంచాయతీ చేయవలయునేమో అని భయమైనది. పలుకరించగా, ముందరివైపున నుండిన సారథి, సేవకుడు, మూల్గినారు. బలమయిన గాయములు తగిలినవట! పోలీసు అధికారికి మూగి దెబ్బలుమాత్రము తగిలి యుండినవి. అతి ప్రయాసతో అతనిని చేయిపట్టి ఎట్లో బైటకి లాగితిని. సారథి 'దాహం' మనుచుండెను. కాని, నీరెందున్నది? చుట్టును చూడగా సుమారు 3, 4 ఫర్లాంగుల దూరమున ఏదో దీపమొకటి మినుకు మినుకు మనుచుండినది. ఆ ప్రాంతములో ఏదో పల్లెయుండునని ఊహించి, గత్యంతరము కానక, పోలీసు అధికారిని మంచి మాటలతో ప్రోత్సహించి, అచటికి పంపితిని. గంట ప్రొద్దునకు పైగా కాచుకొని యుండునప్పటికి, రెండు పెట్రోమాక్సు దీపములు, పాలు, నీరు, త్రాళ్లు, గడార్లు, పారలు, తీసుకొని పది ఎద్దులతో ఏబదిమంది పల్లెటూరివారు వచ్చినారు. ఆ దీపముల వెల్తురులో చూడగా, గుండెలు గుభేలు మనెను. చెరువులోపలి వైపున ఒక గుంటలో కారు ప్రక్కవాటున పడియుండినది. ఎట్లు మృత్యుదేవతనోట దుముక్కొట్టగలిగితిమో, దైవమాయ!

"త్వయి రక్షతి, రక్షకైః కిమన్యైః
త్వయి చారక్షతి, రక్షకైః కిమన్యైః."

అని సర్వప్రాణనాయకుడగు భగవంతుని స్మరించితిని.

పల్లెటూరివారు పట్టి కారును పైకెత్తినారు. అద్దము ముక్కలు ముక్కలయి యుండినది. చక్రము పైని ఇనుప రేకొకటి విరిగిపోయి యుండెను. దీపమొకటి ముక్కలై పడియుండినది. సేవకుని, సారథిని వెలికి తీయించి చూడగా, వారివస్త్రములు రక్తముతో తడిసి యుండినవి. సారథికి మూడునాలుగుచోట్ల బలమయిన గాయములు తగిలియుండెను. అతనికి దాహము తీర్చి, పాలు త్రాగించి, కట్లు కట్టించితిని. అతి ప్రయాసతో కారును చెరువుకట్టమీదికి ఎత్తించునప్పటికి రమారమి 4 గంటలకాలమగుచుండెను. ప్రక్కపల్లెలలో తొలి కోళ్ళు కూయుట గడియకు పూర్వమే వినియుంటిమి. నాకు చూపిన ఆదరణ కరుణకై ఆ పల్లె జనులకు కృతజ్ఞతను తెలిపి పంపితిని. తెల్లవారి వెలుతురు వచ్చువరకు సారథి కొంత తెప్పరిల్లి కారును పరీక్షించి ఇంజనుమాత్రము చెడలేదని కనుగొని ధైర్యముతో ప్రయాణము సాగించెను. 10 గంటలకు ఎట్లో స్వస్థానము చేరుకొనగల్గితిని

మా మునుసార్లు మండలాధికారి నా కొరకు సేవకుని పంపియుండెననియు, అతనికి ఆగ్రహము వచ్చియున్నట్లు తెలిసెననియు చెప్పి ఇంటిలో శ్రీమతి చాలా కంగారుపడినది. సేవకుని రక్తపుగుడ్డలు చూచి వానిని ప్రశ్నించి, దారిలో జరిగిన ప్రమాదమును తెలుసుకొన్నప్పుడు, ఆ సుమంగలికి కలిగిన భయము, ఆందోళనము చెప్పనలవికాదు. ఎక్కడ, ఎప్పుడు, ఎల, అని మున్నుగా ఏవేవో నూరుప్రశ్నలు వేసినది. "నీ మంగళసూత్రము భద్రమైనది." అని నవ్వుచు సమాధానము చెప్పితిని. తప్పాలులో డాక్టరు రిపోర్టు వచ్చి

యుండెనది. ఎవరో ఒకవైపున ఎముకలు ముక్కలై యుండెననియు, ప్రబలమగు ఘాతి మరణకారణమనియు, అతడు అభిప్రాయమిచ్చినాడు. నాపరిశోధన ఫలితమునకు ఇది గొప్ప చేయూత. మండలాధికారితో ధైర్యముగా మాటలాడ వచ్చునుకదా?

త్వరలో స్నానపానములు తీర్చుకొని వసతి భవనము నకు హాయిగా బైటవరండాలో పాదచార్యములు వేయుచుండిన "సముయమాణిక్యము" తాలూకాధికారి నన్ను చూచి సంతోషముతో "ఏమండీ! నిన్న ఎక్కడ?" అనెను. నాచిరునవ్వే ప్రత్యుత్తరము. నారాకవిని మండలాధికారితో నాకు "మంగళహారతి" అగునని భావించి ఆ దృశ్యమును కన్నులారా చూచి ఆనందించుటకై ముందుగావచ్చి కాచియున్నాడతడు. ఎంత అనుగ్రహమో నాపైన?

మండలాధికారిని సందర్శించినప్పుడు, గ్రామము వదలిపోయిన కారణమేమని, గూఢదృష్టితో చూచుచు కటువుగా ప్రశ్నించినాడతడు. ఇది నేను ఊహించియుండినదే.

"హత్యాపరాధమును పోలీసువారు అణచిపెట్టియుండగా వాస్తవమును పరిశోధించుటకై అకస్మికముగా పోవలసి వచ్చినది." అని, సవినయముగా, తొట్రుపాటులేక ప్రతి చెప్పితిని.

"ఏమీ! హత్యయా? అణచియుండిరా? నీకెవరు చెప్పిరి?"

"ఎవరూ చెప్పలేదు. శవపంచాయతీ రిపోర్టు చదువగా, ఆ మరణము ఆత్మహత్య అయియుండదని సందేహించి, వంటనే పల్లె స్థలవిచారణ చేయగా, అది హత్య అని ఏర్పడినది." అంటిని.

ఆశ్చర్యముతో నన్ను ఎగా దిగా చూచినాడతడు. అతని ముఖవైఖరి మారినది. కథ అంతయు ఆమూలాగ్రముగా కార్యకారణ సమన్వయ పూర్వకముగా నెమ్మదిగా వివరించి చెప్పితిని. సావధానముగా వినినాడతడు. సాక్షులవాఙ్మూలములను, ఇంటినక్షాలును, డాక్టరు అభిప్రాయమును జాగ్రత్తతో పరిశీలించినాడు. రానురాను అతని ముఖము ఎర్రవారినది. కటము లదరసాగెను. నాపైనుండిన కోపము నూరంత [illegible] పొంగి, మహాప్రవాహమై, పోలీసుశాఖ వైపునకు పారినది. వెంటనే తాలూకా పోలీసుఅధికారిని అతడు పిలువనంపి నోటికని దీగునట్లు ఆ అధికారికి సహస్రనామపూజ సమర్పించి, అంతటితో నిలువక స్వయముగ తానే వచ్చి విచారించవలయునని, రాష్ట్రీయ రక్షకశాఖాసర్వాధికారికి తంత్రివార్తపంపినాడు; తరువాత ప్రసన్నముఖముతో సన్నెంతో అభినందించినాడుకూడా. నన్ను గ్రామాంతరమునకుమార్చు ప్రమేయమొకటి కలిగియుండెననియు, ప్రస్తుత పరిస్థితులలో తానాఅభిప్రాయమును మార్చుకున్నాననియు, అతడు చెప్పగా కృతజ్ఞత తెలిపితిని. తరువాత కథ మన కనవసరము. సంఘటనలు విడిచిపోవునంతవరకు అతడు నాపైన విశ్వాసము చూపుచుండెననుట చాలు.

పాఠకమహాశయులకొక మనవి. దైవస్వభావము నకు పురుషకారము తెచ్చిన స్వరూపమును వారు గమనించియుందురు. ధనవ్యయము, ప్రయాణక్లేశము, ఆహారాభావము, ఉద్యోగకార్యభారము, హత్యాపరాధ పరిశోధనము, సాహసప్రయాసము- ఇవియన్నియు గ్రహచారఫలమునకు తగినవేయున్నవి కదా? కాని శ్రేయమని తోచలేదు. పైగా పూలు పంక్తులేనే మండలాధికారి ఆగ్రహమును అనుగ్రహముగా మార్చ గలిగితినని కొంత సంతోషమే.

ఇవి అన్నియు స్వయంకృతాపరాధముయొక్క ఫలముకదా? అని హేళనము చేయువారుందురేమో! వాస్తవమే. ఈ కష్టనష్టములన్నియు నేనుకోరి తెచ్చుకున్నవే! ఆ పర్వకాలమున నేను మండలాధికారిని చూచియుండినచో, ఈ దైవఫలము ఏ రూపమున అనుభవమునకువచ్చియుండునో, ఎవరి ఊహకు తోచినట్లు వారు నిర్ధరించుకోవచ్చును. నేనుకోరినఫలమేమో నాకు లభించినది. చెప్పదలచిన విషయమింతే!

ఉండనిండు. పురుషకారము ననుసరించి దైవఫల స్వరూపము మార్పు చెందగలదనుటకై, ఉదాహరణార్థము ఆత్మకథను వ్రాయబూనిన నా చాపలమును పాఠకమహాశయులు క్షమింతురుగాక.

"అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధం,
వివిధాశ్చ పృథక్చేష్టాః దైవం చైవాత్ర పంచమం.
శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః"

(భగవద్గీత)

# గ్రీష్మ వేగము

శ్రీ శనగన నరసింహస్వామి

ద్యుమణి ప్రచండరూపమున దోచె వియత్పథమందు, గాముకీ
భ్రమణము గోరె భూజనము, వారిచయమ్ము సదావగాహన
క్షమత వహించె, మన్మథుడు శాంతిని బొందెను, రమ్యమయ్యె లో
కమున దినాంత, మిట్లు శుచికాల ముపాగతమాయె, ప్రేయసీ !

ఒకపరి తారకాప్రియ తమోదయధూత తమస్తమస్వతీ
నికరము, నొక్కచోట కమనీయ పయోమయయంత్రమందిర
ప్రకరము, నొక్కనాడు మణివర్గవిశేషము, నార్ద్రచందన
మ్మొకయెడ లోకసేవనము నొందు నిదాఘమునందు, సుందరీ !

వాసితరమ్య హర్మ్యతలవాస సుఖమ్ము, ప్రియాముఖాంబుజో
చ్ఛ్వాస వికంప్యమాన మధుసార పరిచయ భాగ్య, మంగజ
ధ్యాసవిలాసదీపన సుతంత్రిసుగీతము; నర్ధరాత్ర మీ
వేసగి వేళయం దనుభవింతురు కాముకు లంగనామణీ!

సురుచిర శుభ్రహర్మ్య సుఖసుప్తమృగీచకితేక్షణా ముఖాం
బురుహవిలోకనోత్సవము బొంది, చిరమ్ము, భృశమ్ముగా, నిశో
దరములయందు; పాండురత దాల్చు నిశాక్షయమందు యామినీ
కరు డతులత్రపాయుత వికారుడు వోలె, విసీల కుంతలా !

అరుణగభస్తి చండజరతాతపతప్త, మసహ్య వాత సం
చరణ నిరంతరోద్ధుతరజఃపటలీవికటీకృతమ్ము, దు
ష్కరము నశక్య మయ్యె కనగా, మహి యెల్ల ప్రియావియోగ దు
ర్భర దవదగ్ధ చిత్తులు ప్రవాసుల, కర్ధనిమీలితేక్షణా !

కంజహితప్రచండకర ఘర్మనిరంతరతప్త, మాత్త తృ
డ్భంజిత శుష్కతాలు వికటమ్ము కురంగబలమ్ము, ముందు భి
న్నాంజన సన్నిభమ్మును నభాంచలముంగని, తోయశంక త్రా
వం జపలమ్ముగా పరుగువారు వనాంతరమందు, మానినీ !

(ఆంధ్రీకృత 'ఋతుసంహార' కావ్యమునుండి)

# తిరుగుబాటు: ఒడబాటు

## శ్రీ స్టూవర్ట్ హాల్‌రాయ్డ్

సాధించడానికి చాలిన లక్ష్యార్థం దొరకని నిరాశతో మేము తిరుగుబాటుదార్లమైనామని మా తరంవారినిగూర్చి సాధారణంగా అనేమాట. మేము తిరుగుబాటు అయితే చేశామట. కాని మా ఆవేశాలు ఆక్రోశాలు ఊతచేసుకొని ఏలాంటి సార్థకమైన ప్రయోజనం కాని సాధించలేమని మాకు తెలుసునట. దానితో మా ఆవేశాలు, ఆక్రోశాలు పెచ్చుపెరిగినవట. ఇక జనసామాన్యంలో ఉన్న అభిప్రాయం ఏమంటే మా తరంవారు మోటుమనుషులని, మాకు కొట్టవచ్చినట్లుగా కొంచెంత అహంభావం ఉన్నదనీని.

కలలు కల్లలుకాగా ఆనందవిహీనులుగా ఉన్నవారని, నిర్దిష్టదివాణం లేనివారని, కోపిష్ఠులని ఒక తరంవారినిగురించి చెప్పవచ్చు. సాంస్కృతిక వాతావరణంలో భావోద్రేకాలలో సంభవించే కొన్ని పరిణామాలను సూచించడానికి ఇదొక సులభమైన పద్ధతి. కాని తరానికి తరానికి ఉండే అంతరాలను పుస్తకాలలో చెప్పేనట్లుగానే పరిగణించినప్పుడు ఈవిధమైన వ్యాఖ్యలు అపోహలకు దారితీయగలవు. ఈనాడు మనమందరము—యువకులు వృద్ధులుకూడా—ఒకవైపునకే ఈడుకపోతున్నాము. వేర్వేరు తరాలను గురించి ఎంతయినా చెప్పవచ్చు. ఏమైనా నేటి మన స్థితిని అర్థంచేసుకొనడానికి అది రవంతకూడా ఉపకరించదు. చివరకు మనకు మిగిలేది ఒక అత్యావసరమైన పరిస్థితి. ఈ పరిస్థితి అందరికి సంకటమైనది. దీనిని ఎదుర్కొనడంలో మానవులు కొందరు కొందరు కొన్ని కొన్ని విధాలుగా ప్రవర్తించే అవకాశం ఉన్నది.

ఈనాడు వేరువేరు తరాల రకరకాల మానవుల జీవితాలు ప్రపంచభవితవ్యంతో పెనువేసుకొని ఉన్నవి. ఈ భవితవ్యాన్ని నిర్ణయించే సమస్యలు అతిమాత్రమైనవి; అతిజటిలమైనవి. ఈ భావమే ప్రాయశః అన్ని తరాలవారిని రకాలవారిని బంధించే ఏకైక సూత్రం కావచ్చు. యావచ్ఛక్తిని ధారపోసి సాధించే కృషిచేయడానికి నాతరంవారికి ఒక లక్ష్యమంటూ లేదు. వస్తుతః లక్ష్యాలే లేకపోవడం దానికి కారణంకాదు. పరిస్థితి బ్రహ్మాండమైనది. ఉన్న లక్ష్యాలేమో దానితో పోల్చడానికికూడా తగనివి.

నా తరంవారికి ఒక లక్ష్యమంటూ లేకపోవడానికి ఇదే కారణం. 1956 వ సంవత్సరం ఆఖరిలో రష్యా ఆధిపత్యంనుంచి విముక్తి పొందడానికి హంగరీ ప్రజలు తిరుగుబాటు చేశారు. అది విఫలమైనది. ఆ తరువాత మధ్యతరానికి చెందిన ప్రసిద్ధ బ్రిటిష్ రచయిత ఒకరు యువజనులను కూడగట్టుకొని నిరసన వెలిబుచ్చే నిమిత్తం హంగేరి సరిహద్దులవరకు నిరసన ప్రదర్శనం జరుపడానికి ప్రయత్నించారు. ఎందుకు అన్న ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు. దానితో ఆ ప్రయత్నం విఫలమైనది. ఇరవై ఏండ్లక్రిందట ఉన్నట్లుగ కేవలం నిరసన వెలిబుచ్చడానికే నిరసన వెలిబుచ్చే ప్రయత్నాలకు ఇప్పుడు అంతగా ప్రజాదరణం లభించడంలేదు. నా తరం వారిలో రాజకీయాలపట్ల ఔదాసీన్యం ఉన్నదని అనుకొంటున్నారు. ఇది నిజంకాదు. ప్రపంచంలో జరిగే సంఘటనలేవి ఎటుపోతున్నాదనితోనూ మాకు సంబంధం లేదనే భావమే మా తరంవారిలో ఉన్నది. ఆర్థిక రాజకీయశక్తులు బ్రహ్మాండమైన హిమానీనదాలవలె అమానుషమైన విధంగా దేనినీ లక్ష్యపెట్టక క్రమంగా తమ దారిని సాగిపోతూ ఉంటవి. మానవుడు దీనిని అర్థంచేసుకొనలేడు. నిరోధించడానికి అశక్తుడు.

వ్యక్తిగతమైన అనుభవంద్వారా తెలుసుకొని ఆమోదించిన విలువలు కొన్నిటిని సమాజానికి వర్తింపజేయడమే సమస్య. ఆ విలువలను సమాజానికి వర్తింపజేసి, వైయక్తికమైన జీవితానికి సామాజిక జీవితానికి నిరంతరాయమైన సంబంధం ఉన్నదని భావించలేని స్థితి ఏర్పడితే మానవుడు సమాజంనుంచి విరమించుకొని కేవలం తనకుమాత్రమే సంబంధించిన లోకంలో జీవితం సాగించడం సంభవం. అది దురహంకారపూరితమైన ఉద్రేకాలతో నిండిన లోకం కావచ్చు. లేదా వ్యక్తిగతమైన ఆధ్యాత్మిక అనుభూతితో కూడిన లోకం కావచ్చు. ఏమైనా అతడు తాను ఏ సమాజంలో జీవిస్తున్నాడో ఆ సమాజానికి ఏ విధంగానూ బాధ్యత వహించడు. ఒకవేళ ఆ సమాజానికి సంబంధించిన రాజకీయ వ్యవహారాలపట్ల ఆసక్తి ఏమైనా చూపినా తిరుగుబాటు చేయాలనే నిశ్చయం దృఢతరం అవుతుందికాని అతనికి సమాజంతో ఏకీభావంమాత్రం ఏర్పడదు.

# తిరుగుబాటు : ఒడబాటు

సజీవము, సృజనాత్మకము అయిన సంబంధం ఉన్ననాడే సమాజంతో కాని ప్రకృతితోగాని ఇతర మానవులతో కాని నాకు ఏకీభావం ఉండగలదు. అంటే నేను అర్థంచేసుకొన్న విలువలను వారికికూడా తెలియజేసి వాటిని వర్తింపజేయగలిగినప్పుడు మాత్రమే నాకు వారితో ఏకీభావం ఉంటుంది. వాటిలో నిరంతరాయంగా ప్రవహించే జీవనస్రవంతిలో చైతన్యవంతము, సృజనాత్మకము అయినవిధంగా పాల్గొంటున్నాననే భావం నాలో ఏర్పడడం ఆవశ్యకం. నేటి పరిస్థితిమూలంగా ఆవిధంగా పాల్గొనడం అసంభవం అవుతున్నది. నేటి ప్రపంచ రాజకీయ జీవితంలో న్యాయమైన విధంగా పాల్గొనడానికి నాకు ఒక్కటే మార్గం ఉన్నది. పూర్తిగా వ్యతిరేకించడమే అది. కొన్ని చర్యలను నేను గర్హించగలను; విమర్శించగలను. వైయుక్తికమైన నా విలువలను సమాజానికి వర్తింపజేయడంలో అంతకుమించి నేను చేయగలిగినది లేదు. కాదనగలనే కాని అవుననలేను. కనుకనే ప్రపంచంలోని రాజకీయ ఘటనాక్రమాలతో చైతన్య విలసితము, సృజనాత్మకము అయిన సంబంధం ఉన్నదని భావించలేను.

పలువురు యువజనులు ఈనాడు సమాజంతో తమకు ఏలాంటి సంబంధము లేదని తలంచడానికి ఇదే మూలకారణం. 1930 లలో కూడా మనుషులు ఏదైనా ఒక అభిప్రాయానికి వశులై దానికొరకు పోరాడేవారు. తమ పోరాటం ప్రపంచప్రగతికి అనుకూలమైనదని, దానికి తగిన ఫలితం ఉంటుందని విశ్వసించేవారు. ఏమైనా ఈనాడు అభిప్రాయాలకుగాని, ఆదర్శాలకుగాని ఆదరణలేదు. తత్పరిణామంగా ఈనాడు రాజకీయంగా కేవలం రెండు సమంజసమైన వైఖరులుమాత్రమే అవలంబించడానికి అవకాశం ఉన్నది. ఆదర్శాలతో ముడిపెట్టకుండా నిర్దిష్టము పరిమితము అయిన లక్ష్యాలను కోరుకొని అంగీకరించడం ఒకటి; తిరుగుబాటుచేయడం రెండవది.

సుస్పష్టంగా నిర్వచించుకొన్న విలువలు కూడా ఉన్నట్లయితే తిరుగుబాటు ప్రపంచ ప్రగతికి అనుకూలమైనది కాగలదు; సృజనాత్మకమైనదికూడా కాగలదు. కాని ఈవిధమైన నైతిక ధిక్కారం నేడు కనుపించదు. వాతావరణం ఆవేశాలతో హింసతో నిండి ఉన్నది. అయితే ఆ ఆవేశాలకు హింసకు మూలం నైతిక కారణాలు కావు. అవి వ్యక్తిగతమైన నైరాశ్యంలోనుంచి అన్యాయంలోనుంచి ఉద్భవించినవి. ఈవిధమైన రోదనమే నేడు మన సమాజంలో వినవస్తున్నది. మనసమాజం శిథిలావస్థలో ఉన్నదని చెప్పడానికి అదే తార్కాణం. సమాజంలో భాగమైనవారు వ్యక్తిగతమైనకారణాలుకాక ఇతర కారణాలు పురస్కరించుకొని సామాజిక జీవితంలో పాల్గొనడము, వ్యక్తుల ప్రయోజనాల సంఘర్షణకాక నైతికము వైయుక్తికేతరము అయిన ప్రయోజనాలే సామాజికజీవితాన్ని శాసించడము సామాజిక స్వాస్థ్యానికి చిహ్నాలు. దురదృష్టవశాత్తు నేటి విప్లవకారులలో పలువురు మనఃపూర్వకంగా నైతికపు విలువలకు కట్టుబడిన వారు కాని, సునిశితమైన రాజకీయ విమర్శకులు కాని కారు. వారు వర్గవిభేదాలకు లోనయి పగతీర్చుకొనడానికి ప్రయత్నించే అభివృద్ధి నిరోధకులు మాత్రమే. ఏమైనా "ద్రష్టలు కాని మానవులు నశిస్తా"రంటూ బైబిల్‌లో చెప్పినది ఈనాటికీ వర్తిస్తుంది. ఎవరయినా వేరొక చింతలేకుండా ప్రత్యేకమైన ప్రయోజనాలు కోరినప్పుడు సహజంగానే అతనిదృష్టి చాలా సంకుచితం అవుతుంది. అతనికి సమగ్రమైన దూరదృష్టికాని, వైయక్తికేతరము, సువిశాలము అయిన నైతిక దృక్పథంకాని ఉండవు. మనం ఆక్రందిస్తూ, ఆక్రందిస్తూ అతిహేయమైన విధంగా అంతరించకుండా ఉండాలంటే అలాంటి దూరదృష్టి, దృక్పథం అత్యంతావశ్యకాలు.

భ్రమలు తొలగిపోగా తొలుత కలిగిన ఆశాభంగాన్ని ఇప్పుడునే విస్మరించి, రాజకీయ విషయాలు గురించి నిదానంగా ఆలోచించగలుగుతున్నాను. ప్రపంచ చరిత్రలో ఎన్నడూ ఎరుగనంతటి ఇంత గడ్డుకాలమే గనుక ఈనాడు దాపురించి ఉండకపోతే రాజకీయాలతో నాకు ఈమాత్రం సంబంధం కూడా ఉండేదికాదు. ఏమైనా థామస్ మాన్ చెప్పినది నన్ను చిన్నతనంలోనే ఆకర్షించినది. "మనకాలంలో మానవుని మనుగడను రాజకీయాలే నిర్ణయిస్తున్నా"యని ఆయన అన్నారు. ఆతరువాత సంవత్సరాల తరబడి ఆలోచించాను. అనుభవం గడించాను. తద్వారా థామస్ మాన్ మాటలలో ఎంత నిజమున్నదీ మరింత బాగా గుర్తించగలుగుతున్నాను. కొన్ని సంవత్సరాల క్రిందట నా దినచర్య గ్రంథంలో ఈదిగువ పేర్కొన్న విధంగా వ్రాశాను.

"ఈనాడు మానవజాతి మనుగడను రాజకీయాలు నిర్ణయిస్తున్నాయని థామస్ మాన్ చెప్పారు. ఇది నిజమే. అయినా మనుషుల మనుగడ మాట ఏమిటి అని ప్రశ్నించగోరుతున్నాను. నా భవితవ్యం, ప్రపంచంలో ఉన్న ప్రతి ఒక్కరి భవితవ్యం కూడా రాజకీయాలపైనే ఆధారపడి ఉన్నవా? లేదు. ఆవిధంగా ఆధారపడిఉండడం సాధ్యంకాదు. ఏమంటే మేము కేవలం రాజకీయ పశువులంమాత్రమే

కాము. మేము కేవలం కాలానికి ప్రపంచానికి మాత్రమే కట్టుబడి మా మనుగడ సాగించడం లేదు. శాశ్వతము పరమోత్కృష్టము అయిన వానితో కూడా మాకు సంబంధం ఉన్నది. ప్రపంచభవితవ్యంతోను మానవజాతి మనుగడతోను నా జీవితం పెనవేసుకొని ఉన్నది. కాని పూర్తిగా కాదు. ఆ రెండింటితోను సంబంధంలేని భవితవ్యము, మనుగడ నాకు ఉన్నవి. అందుచేతనే ప్రపంచం ఎంతటి సంకట పరిస్థితిలో ఉన్నది పూర్తిగా అర్థంచేసుకొన్నప్పటికీ నేను ఎప్పటికీ నైరాశ్యంలో మునిగిపోలేను.”

ఈలా వ్రాసినప్పుడు ప్రపంచ భవితవ్యంతో ఉన్న సంబంధం కాక నామట్టుకు నాకు ఒక భవితవ్యం ఉన్నదని, మరిదేనిని లక్ష్యపెట్టకుండా నా భవితవ్యాన్ని రూపొందించుకోవాలని నేను భావించేవాడిని. ఈ రెండింటికి ఎక్కడో సంబంధం ఉన్నదని కూడా అంగీకరించేవాడిని కాను. వ్యక్తిగతమైన భవితవ్యం సఫలం కావడానికి సమాజంతో నిమిత్తం ఉన్నదని భావించలేనప్పుడు, సమాజం ఆమోదించిన మార్గం ఏమీ గోచరించనప్పుడు, దాని సాఫల్యానికి సమాజం విఘ్నంగాను దోహదం చేయనప్పుడు మాత్రమే సమాజంతో సంబంధం లేదనే భావం ఏర్పడుతుంది. కాని అప్పట్లో ప్రపంచంలోని రాజకీయపరిస్థితిగురించి దానితో సంబంధం లేదని కాక అంతకుమించిన భావమే నాకు ఉండేది. నేను మహోద్రేకంతో దానిపై తిరుగుబాటు చేశాను. అయితే అది వట్టి తిరుగుబాటు మాత్రమే. ఆ పరిస్థితి చక్కబరచే ప్రయత్నాలతో నాకు ప్రమేయమేమీ లేదు. దానికి నేను ఏలాంటి బాధ్యతకాని వహించలేను. ఆ పరిస్థితి నాకు భీతిగొల్పినది. కనుక దానిని ద్వేషించాను. అలాంటి పరిస్థితి ఏర్పడడానికి కారణమైన వారందరినికూడా ద్వేషించాను. అది ఏవిధంగా ఉన్నప్పటికి నామట్టుకు నేను అభివృద్ధిచెందడానికి, ఆనందించడానికి తగిన ప్రశాంతిని మాత్రమే కోరుకున్నాను. అలాంటి సంకటం ఏర్పడడానికి కారణమైనవారు తమంతట తాముగా దానిలోనుంచి బయటపడవచ్చు. అందుకొరకు వారు నా స్వేచ్ఛను ఏమాత్రం హరించకూడదనే నా కోరిక. వారుచేసిన పొరపాటుమూలంగా నా జీవితం ప్రమాదానికి గురికావడం అన్యాయం. అదిచాలు. అలాంటప్పుడు వారిమూలంగా ఏర్పడిన పరిస్థితికి నేను బాధ్యతవహించాలని ఎవరయినా కోరడం సమంజసం కాదు. వారితోకాని, వారి పిచ్చిప్రపంచంతోకాని నిమిత్తంలేకుండా నేను నా భవితవ్యం రూపొందించుకొన్నందుకు ఎవరూ నన్ను నిందించడానికికూడా వీలులేదు.

అప్పట్లో ఈలాంటి వైఖరిని చెదరకుండా నిలబెట్టుకొనడం సులభంకాదు. ఎవరు అయినా సమాజంతో సంబంధమేమీ లేకుండా తన ఆధ్యాత్మికాభివృద్ధికి పాటుపడడం అనేది సాధ్యంకాదు. తన జీవితానికి ఐహికము తాత్కాలికము అయిన పరమార్థమే గాక శాశ్వతమైన పరమార్థం కూడా ఉన్నదనే భావం ప్రతి ఒక్కరికి అవసరం. అయితే అన్ని విషయాలలోను అనిశ్చితమైన అభిప్రాయాలు ఉన్న కారణంచేతనే ఆకాలంలో నా మనసు అలాంటివైఖరికి అంకితమైనది. కేవలం వ్యక్తిగతమైన నా అనుభవానికి ఉన్న విలువను ప్రాధాన్యాన్ని గురించి మాత్రమే నాకు అప్పట్లో నిశ్చితమైన అభిప్రాయాలు ఉన్నవి. కనుక తతిమ్మా అన్నిటిని త్రోసిపుచ్చి వాటినే ఆధారంచేసుకొని అలాంటి వైఖరి అలవరచుకొన్నాను.

అయితే ఈనాడు మానవజాతి అంతా ఒకే భవితవ్యానికి కట్టుబడి ఉన్నది. అందుబాటులో ఉన్న ఆయుధాలనన్నిటిని ప్రయోగించి యుద్ధం సాగించితే మానవజాతి అంతా నశిస్తుంది. ఈ సత్యాన్ని గుర్తించనివారు అంధులని చెప్పక తప్పదు. నేను ఈ ప్రపంచంలో ఉన్నాను. ఈప్రపంచంలో పెట్టిన అడుగు వెనుకకు తీసుకొనలేను. తటస్థంగానూ ఉండలేను. నేను దేనికి అనుకూలంగా ఉన్నానో దేనికి ప్రతికూలంగా ఉన్నానో స్పష్టంగా నిర్వచించుకొనవలసి ఉన్నది. తటస్థంగా ఉండడం అసంభవం. ఏమంటే తాటస్థ్యం మూలంగా కొన్ని పరిణామాలు సంభవించగలవు. అవి నష్టదాయకమైనవి. మానవజాతి మనుగడనే కోరుతూ ఉన్నట్లయితే అందుకొరకు కృషిచేయడానికి నేను సంసిద్ధంగా ఉండక తప్పదు. కృషిచేయకపోతే దానిని మనం సాధించలేము. దానిని సాధించకపోతే దానికి భిన్నమైన పరిణామం సంభవిస్తుంది. మానవజాతి నశిస్తుంది. అయితే మానవజాతి మనుగడకొరకు నేను కృషిచేసే విధాన్నిబట్టి స్వకీయమైన భవితవ్యం రూపొందించుకొనే ప్రయత్నంలో నేను కొన్ని త్యాగాలు చేయవలసిన అవసరం ఏర్పడవచ్చు. అలాంటి త్యాగాలను నేను చేయాలా అన్నదే ప్రశ్న.

1956 లో సూయజ్ హంగెరి కల్లోలాల సమయంలో ప్రంపంచయుద్ధమే సంభవిస్తుందని పలువురు భావించారు. ఆ తిరువాత ఆదివారంనాడు వెలువడే ఒక వార్తాపత్రిక ప్రచురించిన వ్యాసం చదవగా అత్యంత ప్రధానమైన ఈ ప్రశ్న నన్ను

ఎదురౌతున్నది. అప్పట్లో దానినిగురించి నా దిన చర్యా గ్రంథంలో ఇలా చర్చించాను.

తాను ఇటీవల నిర్మించిన అధునాతనమైన ఆయుధాలతో బ్రిటిష్ సైన్యాలను సుసజ్జితం చేయడానికి అమెరికా సిద్ధంగా ఉన్నట్లు నిన్నటి వార్తా పత్రికలో ఒక శీర్షిక ఉద్ఘోషిస్తున్నది. ఆ పత్రికలోనే అణ్వస్త్రాలతో యుద్ధం చేయడం మూలంగా సంభవించడానికి అవకాశం ఉన్న పరిణామాలను గూర్చి ఒక వ్యాసం కూడా ప్రచురితమైనది. ఆ వ్యాసంలో అంచనాకు మాత్రగా ఉంచితమైన ప్రకటన చేయడం ఆందోళనకరంగా ఉన్నది. "ముందటి బాంబు ప్రేలుడంతో పది లక్షలమంది మృతి చెందుతారు" అని దానిలో పేర్కొన్నారు. దీనిలో ఇప్పుడు ఏమైనా సందేహం ఉన్నప్పటికి కాలం గడిచే కొద్ది సందేహానికి ఆస్కారం ఏమీ ఉండదు. ఇది గాఢ అవుతుంది. ఈ నాడు ప్రతినిధులు కూడా మానవజాతి అంతా నశించే ప్రమాదం ఉన్నదని - నేను అన్నాను. "అవును నిశ్చయమే. ప్రతి మనం మృతి చెందవచ్చు, లేకపోతే దేశం అంతా మహా మారికి గురిఅయి నశించవచ్చు" అని ఆయన నిర్లక్ష్యంగా సమాధానం చెబుతున్నారు. దేశంలో కెల్లా ప్రముఖులు అయిన తాత్వికులలో ఒకరుగా మనం పరిగణిస్తున్న వ్యక్తి అంతగా నేటి పరిస్థితిని అర్థం చేసుకొనలేకపోవడం నాకు దిగ్భ్రాంతి కలిగిస్తున్నది. బ్రిటిష్ వారు ఎన్నడూ నిజంగా కష్టం ఎరుగరు. శత్రువులు తమ దేశంలో అడుగు పెట్టకుండా జాగ్రత్త పడ్డారు. 1917 లో రష్యా దేశము, 1930 లలో జర్మనీ దేశము ఎలాంటి కష్టనష్టాలకు గురి అయినవో ఊహా మాత్రంగా అయినా అవగాహం చేసుకొనగలిగిన శక్తి కూడా వారిలో చాలా తక్కువమందికి ఉన్నది. భవిష్యత్తులో యుద్ధం మూలంగా సంభవించే కష్ట నష్టాలకు గతంతో పోలిక లేదని బ్రిటిష్ వారు గుర్తించినట్లు కూడా కనుపించరు. జాగ్రత్తగా లెక్క కట్టి తగు ప్రదేశాలలో ఆరు ఉదజని బాంబులు ప్రేల్చితే ఈ ద్వీపం నామరూపాలు లేకుండా పోతుంది. మనంను ప్రేరేచి నిరాయుధీకరణపై విశ్వాసం పెంపొందించుకొనడానికి దోహదమిచ్చే పూర్వానుభవం ఏమైనా మనకు ఉన్నదా? గతంలో ఎప్పుడైనా యుద్ధానికి సన్నద్ధం కావడానికి చాలా కాలం కృషిచేసిన తరువాత ఉభయ పక్షాలకు సద్భావన పూరితమైన విధంగా ఒప్పందం కుదరడం కాని తమ తమ ఆయుధాలు అన్నిటిని సముద్రగర్భంలో కలిపి వేయడానికి ఉభయపక్షాలవారు అంగీకరించడం కాని ఎన్నడైనా ఎరుగుదుమా? ఈలాంటి సంఘటనలు జరగాలని ఆశించడం-మానవ నైజమే పూర్తిగా మార్పు చెందాలని ఆశించడం వంటిది. అయినా ఎలాంటి గమ్యం చేరుకొనడానికి మనం ఈ యాత్ర సాగిస్తున్నాము? తిరిగి పశుత్వం, రాక్షసత్వం చిక్కబట్టుకొనడానికా? అయితే నేటికి కూడా చైతన్యవంతులుగా ఉంటూ, పశుత్వంలోనికి గాని దానికి ప్రథమావస్థ అయిన ఔదాసీన్యంలోనికి కాని దిగజారకుండా ఉన్న మావంటి కొలదిమంది మాట ఏమిటి? మేము చేయవలసినది ఏమిటి? "సుదృఢమైన విశ్వాసం కలిగినవారు అయితే కూలిపోయే సంస్థలకప్పులను, మృతి చెందే పసిపిల్లలను చూచి విచారించడం ఎందుకు?" అని సెయింట్ అగస్టిన్ సగర్వంగా చెప్పారు. హిప్పోను వాండల్స (జర్మనులు) ఆక్రమించుకొన్నప్పుడు అగస్టిన్ మృత్యుశయ్యమీద ఉన్నారు. మేము యువకులం. అగస్టిన్ వలె మృత్యుశయ్యమీద లేము. ఇలాంటప్పుడు ఆయన మాటలు మననం చేసుకొంటూ ఊరక ఉండగలమా? అలాంటి వైఖరి అవలంబించడానికి తగిన మత విశ్వాసం నామట్టుకు నాకు లేదు. అయితే వర్తవ్యం ఏమిటి? ఈ పరిస్థితిలో సంబంధం పూర్తిగా త్రెంచుకొనడమా? లేక మామట్టుకు మాకు ఎలాంటి అపాయము సంభవించకుండా జాగ్రత్తపడుతూ, ఈలాంటి సంకటస్థితి తెచ్చుకొన్న మానవజాతి నశించనీ మాకేమి అనుకొనడమా? ప్రాయశః మేము చేయవలసినది అదే అయి ఉంటుంది. ప్రళయం సంభవించినప్పటికీ ఎలాగో ప్రాణాలు దక్కించుకొనడానికి ప్రయత్నించడము, ఆ తరువాత తిరిగి ప్రపంచానికి ఒక రూపం కల్పించడము మేము చేయవలసినది కావచ్చు. లేక మేము ఇతరులను హెచ్చరించాలా? కాదు. వాగ్నర్ నృత్యనాటక ప్రదర్శనం మధ్యలో గుండుసూది పడవేస్తే ఎంత శబ్దం అవుతుందో మేము హెచ్చరించినా అంతే శబ్దం అవుతుంది. అయితే ప్రాచీనమైన గ్రంథాలు చదువుకొనడంవల్ల ప్రయోజనం ఏమిటి? తత్త్వశాస్త్రంలో తార్కిక వివేచనంవల్ల ప్రయోజనం ఏమిటి? నిన్న వార్తా పత్రిక చదవడానికి ముందు కౌటలస్ రచనలు చదివాను. భావాలు నేర్చుకొనడం ఎంతటి అసంబద్ధమైన విషయమో? ఆ మాటకువస్తే ఎవరిమటుకు వారు బ్రతకడం ఇతరులకు సహాయపడడం మినహాగా దేనిని అయినా నేర్చుకొనడం ఎంతటి అసంబద్ధమైన విషయమో

నా మనసుకు గట్టిగా తట్టుతోన్నది. అయితే ప్రళయం సంభవించకనే పోవచ్చు. అది సంభవించవచ్చుననే అభిప్రాయంతో మనం కనుక ప్రపంచంతో ఈనాడు మనకు ఉన్న సంబంధాన్ని త్రెంచుకొని ఆధారం లేకుండా చేసుకొన్నట్లయితే స్వల్పకాలికమైన వినాశమార్గానికి మారుగా దీర్ఘకాలంలో క్రమంగా నశించిపోయే ప్రమాదం తెచ్చుకొన్నవారం అవుతాము.

నేటి పరిస్థితి కొంచెం ఇంచుమించుగా 1956 అక్టోబరులో పరిస్థితివంటిదే. అయితే ప్రపంచయుద్ధం సంభవించడానికి ఆనాడు ఉన్నంతఅవకాశం ఈనాడు లేకపోవచ్చు. ఏమైనా ఆయాదేశాల బలాబలాలు ఆ తరువాత పూర్తిగా మారినవన్నమాట నిశ్చయం. ప్రపంచంపట్ల అవలంబించవలసిన వైఖరి నిర్ణయించుకొనడానికి సంబంధించినంతమట్టుకుమాత్రం పరిస్థితిలో మార్పుఏమీ రాలేదనే చెప్పవచ్చు. 1956 లో కార్యాచరణకు నాకు రెండుమార్గాలు గోచరించినవి. ప్రపంచంతో సంబంధం త్రెంచుకుని వ్యక్తిగతమైన నా భిని తత్వం రూపొందించుకొనడానికి ప్రయత్నించడం ఒకటి. ప్రత్యక్షస్థానం ఆక్రమించుకుని ప్రపంచాన్ని హెచ్చరించపూనుకొనడం రెండవది. అయితే ఈనాడు ప్రపంచ పరిస్థితి, స్వరూపం దృష్ట్యా మొదటిమార్గం అనుసరించడం అసంభవమని నాకు స్పష్టంఅవుతున్నది. ఇక రెండవమార్గం అనుసరించడం నిరర్థకం; లేనిగొప్పతనం ఆరోపించుకొనడంవంటిది; ప్రపంచ ప్రగతికి దోహదమివ్వనిది; అనవసరంకూడా అని స్పష్టం అవుతున్నది. (ఏమంటే పలువురు ఇప్పుడు చేస్తున్నది అదే). అయితే నేను వ్యవహరించవలసినవిధం ఏమిటి? ప్రస్తుత ప్రపంచపరిస్థితితో నాకు ఉండవలసిన సంబంధం ఏమిటి? నాకు రాజకీయంగా ఉన్న వ్యక్తిత్వాన్ని తిరిగి నిలబెట్టుకునేమార్గం ఏమిటి? ఇంతవరకు ప్రపంచంతో ఏలాంటి సంబంధము లేదనేభావం మూలంగా ఏమిచేయడానికి నేను అశక్తుడనయ్యాను. ఆభావాన్ని తొలగించుకునే ఉపాయం ఏమిటి?

ఈనాడు నిర్దిష్టమైన ఉద్యమాలకు జీవితాన్ని అంకితం చేసుకొనడమో లేక తిరుగుబాటు చేయడమో మినహా రాజకీయాలలో మరి ఎలాంటివైఖరి అవలంబించడంకాని సమంజసంకాదని మొదట్లో చెప్పాను. ఏదైనా ఒక తత్వానికిగాని, రాజకీయపక్షానికికాని కట్టుపడాలనే సిద్ధాంతాన్ని అంగీకరించలేకపోవడమే ఈలాంటి నిర్ణయానికి రావడానికి ముఖ్యకారణం. రాజకీయాలలో వర్గవ్యవస్థలోనుంచి పార్టీవ్యవస్థ ఉద్భవించినది. పార్టీవ్యవస్థ యీనాటికీ ఆ వర్గవ్యవస్థతోనే ముడిపెట్టుకుని ఉన్నట్లు నాకు కనిపిస్తున్నది. తోడివారిలో అధికసంఖ్యాకులవలె ఏదో ఒక ప్రత్యేకమైన వర్గానికి చెందాననేభావం నాకులేదు. పైగా సమాజంలో ఏదో ఒక్క వర్గంక్షేమంకాని నాకు ప్రధానమైనది కాకపోవడంచేత నాదృష్టి సంకుచితం కాలేదు. ఇటీవల రాజకీయ వ్యవహారాలయెడ తిరిగి నాలో ఆసక్తి కలగడానికి ఇదే కారణం అనుకుంటాను.

ఆ కారణంచేతనే దేశంలోని ప్రధానమైన రెండు రాజకీయపక్షాలలోకన్న మితవాదుల(లిబరల్స)తోనే అధికమైన సాన్నిహిత్యం ఉన్నదనే భావం నాకు ఉన్నది. వర్గప్రయోజనాలతోగాని పెట్టుబడిదారుల లాభాలతోకాని మితవాదపక్ష విధానాలు అంతగా కలుషితం కాలేదు. అంతేకాదు. సుస్పష్టంగా నిర్వచించకొన్న తాత్త్విక నైతిక దృక్పథం ఆ విధానాలను ఇతరపక్షాల విధానాలకన్న ఖండితమైన విధంగా నిర్ధారిస్తున్నది. ఒకానొక పరిస్థితిలో గర్భితమైఉన్న ధర్మసూత్రాలు అర్థం చేసుకొనడంపై నిర్దిష్టమైన ఉద్యమానికి కట్టుపడడం అయినా తిరుగుబాటుచేయడం అయినా ఆధారపడి ఉండవచ్చు. (దానిపైనే ఆధారపడి తీరాలని నా అభిప్రాయం.) ప్రస్తుత ప్రపంచ పరిస్థితిలో నిర్ణీతమైన వైఖరులపైగాని, ప్రయోజనాలపై కాని ఆధారపడిన రాజకీయాలవల్ల నష్టదాయకమైన పరిణామాలు మాత్రమే సంభవించగలవని అనుకొంటున్నాను. జోక్యం చేసుకొనకుండా ఉండే విధానంవల్ల కూడా తగు ప్రయోజనం చేకూరదు. ఒక ప్రయోజనోద్దిష్టం కాని ఏ విధానం అవలంబించినా అది ప్రళయం మరింత వేగంగా సంభవించడానికి మాత్రమే తోడ్పడుతుంది. ఇక అచంచలమైన తాత్త్విక దృక్పథంపైనా, చారిత్రకాభినివేశంపైన ఆధారపడిన విధానాలు ప్రగతికి దోహదమిచ్చేవి అయినప్పటికీ, అంతకన్న నష్టదాయకమైనవి. ఇప్పటి అశాంతి, కల్లోలం ఏదో ఒక నూతనవ్యవస్థకు, మానవసమాజ నిర్మితికి తొలిమెట్టయితే, అది వర్గప్రయోజనాలకు, పెట్టుబడిదారుల భావాలకు అతీతమైన ధర్మశక్తులుగల సమాజానికి దారి తీయవలసివుంటుంది. ఆ నూతనవ్యవస్థ పోటీకన్న సహకారము ఉత్తమమైనదనే సిద్ధాంతం పట్టుగొమ్మగా, నైతికధర్మాలపై ఆధారపడిన వ్యవస్థగా ఆ నవసమాజం రూపొందగలదు. ఏమైనా ఒక రాజకీయపక్షాన్నికాని విధానాన్నికాని బలపరచడానికి నేను కట్టుబడి ఉండలేను. అయినప్పటికీ ఈ సత్యాన్ని

గుర్తిస్తే సమాజానికి జీవితాన్ని అంకితం చేసుకొనకుండానూ ఉండలేను. సమాజంలో వచ్చే అభివృద్ధి ఏమైనా అది నైతికమైనదే కావాలని తెలుసుకొనగలిగిననాడు నిర్దిష్టమైన పరిస్థితులలో గర్భితమైన నైతిక పరిణామాలను అవగతం చేసుకొనడము, ఆ పరిస్థితిలో ఏ విధంగా వ్యవహరించడం సక్రమమని అభిప్రాయపడితే ఆ విధంగా వ్యవహరించడము నా కర్తవ్యం అయివున్నది. ఆ విధంగా నేను ఒక్కొక్కప్పుడు తిరుగుబాటు చేయవలసి వస్తుంది. ఒక్కొక్కప్పుడు కొన్ని ఉద్యమాలకు అంకితం కావలసి వస్తుంది. ఉదాహరణకు: ప్రపంచ ప్రభుత్వ స్థాపనకు, యూరోపు ఆర్థికవ్యవస్థ స్థాపనకు సాగే ఉద్యమాలను నేను బలపరచవచ్చు. కన్సర్వేటివ్ పార్టీ, లేబర్ పార్టీ అనుసరించే ఆర్థికరక్షణ (ప్రొటెక్షనిస్టు) విధానాలను, సూయజ్ యుద్ధము, అణ్వాస్త్ర పరీక్షలు మున్నగు చర్యలను ప్రతిఘటించవచ్చు. అలాంటి పరిస్థితులయెడ గాని విధానాలయెడ కాని అవలంబించవలసిన వైఖరిని నిర్ణయించుకొనడం అంటూ జరిగితే నేను నిజంగా సమాజానికి బద్ధుడైనట్టే. అది చాలనట్లు ఏదైనా రాజకీయపక్షంలో సభ్యుడు కావడంద్వారా కాని మరొక విధంగా కాని నేను సమాజానికి కట్టుబడాలని కోరడం రాజకీయాలలో నా ఆలోచనలన్నిటికి రాజకీయవ్యక్తిగా నా మనుగడకు కూడా మూలమైన నైతిక దృక్పథానికి విరుద్ధంగా వ్యవహరించమని నన్ను కోరడం అవుతుంది.

నేను ముందు చెప్పినట్లుగా వ్యక్తిగతమైన నా విలువలను సమాజానికి వర్తింపజేయడానికి ఉన్న ఇబ్బంది ప్రధానంగా సమాజంతో సంబంధమేమీ లేదనే భావం మూలంగా ఏర్పడినదే. అయితే వ్యక్తిగతమైన అనుభవమే ఒక విలువ అని చెప్పడానికి, వ్యక్తిగతమైన అనుభవంద్వారా మానవజాతికి అంతటికీ వర్తించే విలువలను అన్వేషించడానికి భేదం ఉన్నది. ఆ భేదానికి ఈ చర్చలో ప్రాధాన్యం ఉన్నది. మానవజాతి నశించే ప్రమాదం గురించి, క్రమంగా అంతరించే ప్రమాదం గురించి నా దినచర్యా గ్రంథంలో వ్రాసినప్పుడు వ్యక్తిగతమైన అనుభవమే ఒక విలువ అన్న భావాన్ని అంగీకరించడానికి నా అభిప్రాయాలు సుముఖంగా ఉండేవి. ఆ కాలంలో నేను రాజకీయాలకు వ్యతిరేకినని, అరాజకవాదినని ప్రకటించుకొన గలిగి ఉండేవాడిని. కాని ఆ తరువాత కొన్ని విలువలను తెలుసుకొన్నాను. అవి మూలంగా నైతికము, తాత్త్వికము అయినవి. అయినప్పటికీ ప్రపంచంలో ఉత్పన్నమయ్యే నిర్దిష్టమైన రాజకీయ ఆర్థిక సమస్యలయెడ అవలంబించవలసిన నిర్దిష్టమైన వైఖరులను, అనుసరించవలసిన నిర్దిష్టమైన విధానాలను నిర్ణయించేవి అవే.

ఈ విలువలు ఆధారంగా నేను తిరిగి రాజకీయంగాను, సామాజికంగాను ఒకవిధమైన మనుగడ ఏర్పరచుకొన్నాను. నా కాలానికి నా సమాజానికి చెందిన జీవితంలో సార్థకమైన విధంగా పాల్గొంటున్న భావం సంతరించుకొన్నాను. ఛిన్నాభిన్నమైన నా జీవితంలో నుంచి బయటపడి కల్లోలితమైన ప్రపంచంలో అడుగు పెట్టి ఆ కల్లోలాన్ని చూచి దిగ్భ్రమ చెందాను. అయితే ఇప్పుడు మాత్రం ప్రపంచంలో నాకు కూడా చెప్పుకొనదగిన స్థానం ఉన్నది; ఈ ప్రపంచానికి చెందినవాడినని కూడా చెప్పుకోవచ్చుననే భావం నాకు ఉన్నది. నిర్మాణాత్మకమైన విధంగా కృషి చేయడానికి అలాంటి భావం ఉండక తప్పదు. వ్యక్తిగతమైన నా జీవితానికి, సమాజంలో భాగమైన నా జీవితానికి అనుస్యూతమైన సంబంధం లేదనే భావం ఇంతకాలమూ నన్ను నిరోధించి ఏమి చేయడానికి అశక్తుని చేసినది. ఇప్పుడు అలాంటి ప్రతిబంధకం ఏమీ లేదు. సమాజంలో సుస్థిరము, సౌఖ్యదాయకము అయిన స్థానం కల్పించుకొనడం ద్వారా నేను సమాజంలో లేను. అయినప్పటికీ సచేతనమైన సంబంధం ఉన్నదనే భావం, సామాజిక జీవితంలో పాల్గొంటున్నాననే భావం ఉండడం మూలంగా సమాజానికి చెందినవాడననే నమ్మకం మాత్రం నాకు ఉన్నది. మనకాలంలోని సమస్యలు ఎంత జటిలమైనవో తెలుసుకొన్నాను. ఈ సమస్యలు పరిష్కరించుకొని ముందుకు సాగడం అత్యవసరమని గుర్తించాను. జటిలమైన ఈ పరిస్థితితో సంబంధం పెట్టుకొనకుండా ఎలాగో పక్కకు దాటి ప్రళయం తరువాత కూడా నా మట్టుకు నాకు ఒక సురక్షితమైన ప్రదేశం ఏర్పాటు చేసుకోవాలనే కోరికతో ఇప్పుడు సంతృప్తి చెందడం లేదు. పైగా అలాంటి సురక్షితమైన ప్రదేశం చేరుకొనడానికి ఉన్న అవకాశాన్ని అవసరమైతే త్యజించి అయినా జటిలమైన సమస్యల పరిష్కారానికి ఒక మార్గం అన్వేషించడానికి నా యావచ్ఛక్తి సామర్థ్యాలను వినియోగించి తీరాలనే నిశ్చయానికి వచ్చాను. సుదృఢనిశ్చయం, మేధాశక్తి, పట్టుదల, దూరదృష్టి ఉండి రవంత అదృష్టం కాని, దైవసహాయం కాని కలిసివస్తే—అచంచలాదర్శవాదులు కలలుగన్న, ఇంకా కలలు కంటున్న శాంతిధామం, నిరంతరం నిర్మాణాత్మక కృషిలో సమాజం నిమగ్నమైన లోకం అంతిమంగా చేరుకోగలమనే ఆశాభావం నాకు సర్వకాల సర్వావస్థలలోను తోడునీడగా ఉంటూనే ఉంటుంది. [ఎన్‌కౌంటర్ నుంచి]

# వార్తలు

## స్వతంత్ర పార్టీ

శ్రీ రాజగోపాలాచారి అధ్యక్షతన జూన్ 4-వ తేదీన మద్రాసులో జరిగిన ఒక సమావేశంలో 'స్వతంత్ర పార్టీ' అనే పేరుతో నూతన రాజకీయ పక్షం నెలకొల్పబడింది. ఈ పక్షానికి శ్రీ యన్. జి. రంగాగారు నాయకత్వం వహించారు. ఆయన కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు. ఆగస్టు నెలలో అహమ్మదాబాదులో ఈ పార్టీ మహాసభ జరుగుతుంది.

## సేఠ్ రామకృష్ణ దాల్మియాకు శిక్ష

భారత్ ఇన్సూరెన్సు కంపెనీ మాజీ అధ్యక్షుడూ, ఆ కంపెనీ ప్రధానాధికారి అయిన శ్రీ రామకృష్ణ దాల్మియాకు ఆ కంపెనీ తాలూకు 2 కోట్ల 85 లక్షల రూపాయల మొత్తాన్ని దగాచేసి, దుర్వినియోగ పరచిన నేరానికి ప్రత్యేక న్యాయవాది శ్రీ హెచ్. ఆర్. ఖన్నా రెండేన్నర సంవత్సరం కారాగారవాస శిక్ష విధించాడు. ఆయన ఈ తీర్పుపై సుప్రీం కోర్టుకు అప్పీలు చేసుకొని, జామీను పై విడుదలయ్యాడు.

## సింధు జల వివాదం

సింధుజలాల వివాద పరిష్కారానికి ప్రపంచ బ్యాంకు చేసిన నూతన ప్రతిపాదనలలో రాజస్థాన్ కాలువకు, భారతదేశం తవ్వుకునే ఇతర కాల్వలకు నీటిని పారించుకొనడానికి బియాస్ నదిపై ఒక జలాశయం నిర్మించుకొనడం, ఇక పది సంవత్సరాల తర్వాత రావి, బియాస్, సట్లెజ్ నదుల జలాలను పూర్తిగా భారతదేశానికి ఇవ్వడం ప్రధానమైనట్లు తెలుస్తున్నది.

## కేరళలో ప్రతిపక్షాల ఉద్యమం

కేరళ ప్రభుత్వం విద్యాశాసనానికి నిరసనగా నాయర్ సంఘం, కాథలిక్కుల సంఘం జరుపుతున్న ఉద్యమానికి దోహదంగా ప్రతిపక్షాలు జూన్ 13నుండి ప్రత్యక్ష చర్య ప్రారంభించాయి. ఇంతవరకు కొన్ని వేలమంది అరెస్టు అయ్యారు.

## ఆంధ్ర ప్రభుత్వోద్యోగుల జీతాల హెచ్చింపు

ఆంధ్ర ప్రభుత్వం జూన్ నెలలో ఎన్.జి.వో.లకు కొత్త జీతాలస్కేళ్ళు ప్రకటించింది. దీనివల్ల 5 రూపాయలు మొదలు 40 వరకు జీతాలు పెరుగుతాయి. దీనితో ప్రభుత్వానికి 4½ కోట్ల రూపాయల అదనపు ఖర్చు తగులుతుంది.

## ఉచిత నిర్బంధ విద్య

తృతీయ ప్రణాళిక మొదటి సంవత్సరం నుంచి రాష్ట్రంలో అమలు జరుపదలచిన నిర్బంధ ప్రాథమిక విద్యాపథకం క్రింద అయ్యే ఖర్చులో నూటికి 75 వంతులు భరించవలసిందని కేంద్ర ప్రభుత్వాన్ని కోరడానికి ఆంధ్ర ప్రభుత్వం నిశ్చయించింది. ఈ పథకం అమలుకు 27 కోట్ల 24 లక్షల రూపాయలు ఖర్చు కాగలదని అంచనా.

## అల్పసంఖ్యాక వర్గాలకు అవకాశాలు

ప్రభుత్వోద్యోగాలకు, విద్యాలయాలలో ప్రవేశానికి సంబంధించినంతవరకు అందరికీ సమానమైన అవకాశాలు ఉండాలని, భాషా పరీక్షల ద్వారా ఏ ఒక్క భాషావర్గానికీ లేనిపోని ప్రాతినిధ్యం కల్పించరాదని అల్పసంఖ్యాక వర్గాల కమీషనర్ రాష్ట్రపతికి అందజేసిన నివేదికలో స్పష్టం చేశారు.

## ఒరిస్సాలో మిశ్రమ మంత్రివర్గం

ఒరిస్సాలో కాంగ్రెస్—గణతంత్ర పరిషత్తు మిశ్రమ మంత్రివర్గం మే 22 వ తేదీన ఏర్పాటైంది. దీనిని శ్రీ హరేకృష్ణ మెహతాబే ముఖ్యమంత్రి. ఇండియన్ రిపబ్లిక్‌లో మొదటి మిశ్రమ మంత్రివర్గం ఇదే.

## నేపాల్‌లో ప్రజా ప్రభుత్వం

శ్రీ బిశ్వేశ్వరప్రసాద్ కోయిరాలా నాయకత్వాన నేపాల్‌లో ప్రజా ప్రభుత్వం ఏర్పడింది. సంపూర్ణంగా ప్రజల ప్రతినిధులతో ప్రభుత్వం నెలకొనడం ఇదే తొలిసారి.

# ద్విపద భారతము : తిమ్మయ స్వతంత్రత

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ

[గతసంచిక తరువాయి]

4. పెంపకము:- సముద్రమథన వృత్తాంతము భారతములో నొక మనోహరమైనఘట్టము. ఆ సంవిధాన మంతయు తిమ్మయ 'అతి నేర్పుగా' నిర్వహించినాడు. ఈతని రచనలో ఆ యితివృత్తమొక మధుర కావ్యముగా రూపొందినది. అందును బృహస్పతి రాయబారము, హాలాహలోత్పత్తి యనంతరము శివుని రావించుటకై దేవతలుచేయు సంప్రార్థనము, ఆ పరమ శివుని ఆగమన సన్నాహము, అటుపై నమృత ముదయింప దానిని పంచియిచ్చుటకై విష్ణువు మోహినీరూపము దాల్చుట మున్నగు సన్నివేశముల నన్నిటిని-మూలమున సూచనా ప్రాయముగా నున్నవానిని తిమ్మయ పెంచి వ్రాసినాడు. (ద్వి. భా. ఆ. ప. 40-50 పుటలు). వీనిలో కొన్నిటిని మాత్ర ముదాహరింతును.

i. బృహస్పతి రాయబారము :—

"అయ్యవసరమున నటబృహస్పతియుఁ
జయ్యన నేఁగి............
.........ఆదైత్యనాథులతోడ
.........ననియె నేర్పెసఁగ
అమరవల్లభుఁడు మీయందఱితోడ
సముచితముగఁ గూడి చరియింప దలచి
పవిపాణి మీతోడఁ బలుకు మన్నట్టి
వివరంబు చెప్పెద వినుఁడు మీరెల్ల
తాము నేమును నన్నదమ్ముల మయ్యు
నీ మాడ్కి నన్యోన్య మీసుగా నేల!
జగతి నెప్రొద్దో గోచారాన మనకు
జగడంబు వచ్చినఁ జనునె పాయంగ?
ఉభయ వర్గులము గూడుండిన మనకుఁ
త్రిభువనంబుల నెదిరింపంగఁ గలరె!
యొనరంగ మనమెల్ల నొక్కటై దివిజ
దనుజ భటాళిచేఁ దఱియక యిపుడు
తోయధి మథియింప దొరకును నమృత;
మా యమృతము ద్రావినంతనె మనము
చావును దిగులును జరయును నెవ్వి
భావింపఁగా రాక భాసిల్లఁ గలము
మా యొగ్గు లేమియు మదిలోన నిడక
యీ యొడ్డు మీరెల్ల నీకార్యమునకు
దొడరుఁడు...............
కించిత్తు పేలును గీఁజును లేదు
పంచుక యనుభవింపఁగ గీర్తిగలుగు."

(40. పుట)

దుర్వాసశ్శాపమున అమరవైభవ మంతయును అగ్నిపాలైనది. అది మథించినగాని దేవతలకు తినతిండియు కట్టగుడ్డయును లేదు. దానవులు సాయపడినగాని సముద్రమథనము కేవలము దేవతలకు సాధ్యపడునదియు గాదు. అందులకై వారి సాయమపేక్షించి, ఆజన్మ విరోధులైన యా సోదరులను గువ్వ త్రోవలోనికి దెచ్చుటకై బృహస్పతి నెరపిన రాయబారమును తిమ్మయ యెంత సమయోచితముగా పెంచి వ్రాసినాడో పైనుదాహరించిన ద్విపద పంక్తులవలన గ్రహింపవచ్చును.

ii. కద్రూవినత లుచ్చైశ్శ్రవపు వాలము నీలి మనుగూర్చి దాసీత్వము పణముగా పందెములు వైచిరి. కద్రువ పందెమున నోటమి కల్గునేమోయని భయపడి, తలపై పడనున్న దాసీత్వమునకు తలకి, కుమరుల రావించి

"నరుఁబోటు మాన్పరే నను గటాక్షించి
చని హయవాల మచ్చట నల్పుచేసి
చనుదెండు మీరు..........."

అని మిగుల దైన్యముతో బ్రతిమాలును. కాద్రవేయులపు డట్టి యధర్మమునేయు 'కాదుకూడ'దని తల్లికి బోధింతురు. ఈ ప్రసంగమును — 'తద్వాక్యం నాభమన్యంత' అని యొక్క మాటలో వ్యాసుడును, 'తల్లి వని చెనని యధర్మము సేయంగనగునె! యొులుకగలరె మఱువలెండు!' అని మరి రెండు మాటలలో నన్నయయు ముగించిన దానిని తిమ్మయ పరికించినాడు. సందర్భము నంతయు ఆకళింతకు దెచ్చుకొనినాడు. స్వార్థపరులగు పెద్దలు, అధర్మకార్యాచరణమున కొకవేళ నియోగింపనపుడు, బుద్ధిమంతులగు పిన్నలు తా మట్టి చెడ్డపనులు చేయకుండుటయే గాక, వినయముతో వారినిగూడ నా పనినుండి విముఖులజేయు సన్నివేశమును భావించినాడు.

"........ఆయ కార్యంబు
నొనరింప నేరక......యిట్టి

పని యధర్మస్థితి భావించిచూడ.
చామరో యిటుసేయఁ జనునె యెవ్వరికి?
క్రమమొప్ప నెచట ధర్మమె జయంబనుచుఁ
బలుకు వేదంబు లేర్పడ మున్ను వినవె!
వలవదు తల్లి, నీ వాక్యంబు లేము
వలనొప్పఁ జేయనివారము గాము.
తలపోయఁ గపటకృత్యంబులచేత
బలిమి మిక్కిలి యిహపరహానిచేయు.
......................
తప్పు లెన్నుటగాదు తల్లి, మా చిత్త
మొప్ప దీ పనిసేయ నుచితంబుగాదు.
నీకుఁ బ్రియంబని నిజములు కల్ల
లే క్రియఁజేయుదు మిది మాకుఁదగునె!"
(62. పుట)

అని వినయముమెయి బోధింపజేసినాడు.

iii. తుదకు కర్కోటకుని కపటోపాయమువలన వినతకు దాస్యము తప్పినదిగాదు. తల్లితోపాటు గరుడుడును కద్రువకు పరవుడెముసేయుచు పాపకొదమల వీపున మోయుచు తమకు వాటిల్లిన హీనస్థితికి వగచి యొకనాడు "నాకు నీపనిం, బాయక తొమ్మనందవడు బాముల మోకను వారికిం బనల్ సేయను నేమి కారణము చెప్పు" మని తల్లినడుగును. పై నన్నయ రచనయందు గరుడుని గొప్పదనమును అట్టితనకు దాస్యము కల్గినందుకు విచారమును మాత్రము సూచింపబడినది. అంతియేగాని, యాతనితల్లి దాసీత్వమును గూర్చి యంతగా తపించినట్లులేదు. ఉత్తముడగు గరుడుడు తన తల్లిదండ్రులకు సంభవించిన యిడుములకు విచారించి, తొలుత వానిని బోగొట్టుటకు యత్నించి, తరువాత తనవిషయము చూచుకొనును. తిమ్మయ ఈ యౌచిత్యమును భావించి:

"తల్లి, నిన్నిదియేమి తవిలి మీవార
లిల్లాదిగా వీరి కిచ్చిరో వలదు?
కాదని, నీకొండుకడ దిక్కు లేమి
నీదశపొంది నీవిడుమ పొందెదవో?
కొడుకన్న, ననదవై కడుపుకూటికిని
ఈ కద్రువకు బను లిట్లు చేసెదవో?
అదిగాక, ప్రతినకు నైపూని తగవు
పాటించి యిట్లుండవలసెనో నీకు?"

అని తల్లిని ప్రశ్నించి తొలుత నామెదాస్యమునకు వగచి తరువాత,

"పలికెసన్నిభ పటు క్రూరతుండాగ్ర
దళిత నిష్ఠుర ధరాధరుడనై వీరి
కేపట్టి కచ్చితు చెలువున నేను
నీపాప కొదమల నిట్లు మోచుటకు
బనియేమి చెప్పు మేర్పడ..."
(70. పుట).

అని గరుడుడు తన దురవస్థకు దురపిల్లినట్లు పెంచి వ్రాసినాడు తిమ్మకవి.

iv. పడవనడుపు పల్లెపడుచునుజూచి నన్నయగారి పరాశరుడు మోహపరవశుడైనాడు. వ్యాసుని పరాశరుడు:

"అతీవరూపసంపన్నాం సిద్ధానామపి కాంక్షితాం,
దివ్యాంతాం వాసవీం కన్యాం రంభోరుం మునిపుంగవః.
దృష్ట్వైవచ స తాంధీమాన్ చకమే చారుహాసినీం."

అని యామెను జూచినంతనే యొడల జలదరింపనించు చలించినాడు. తిమ్మయ ఆపన్నివేశమును తన భావనాబలముచే నూహించి ఓడనడుపు జాలరిపడుచు సహజ సౌందర్యమును, ముగ్ధమనోహరరూపమును పాఠకుల కన్నులకు గట్టినట్లు వర్ణించి పరాశరునకు నోరూరజేసినాడు:

"భామిని వలకేలు ప్రాపుగాబట్టి
యుచితాసనంబుననుండి, యాయతిద
కుచముల సొబగును కురులతేటయును,
ప్రియవచనంబైన పలుకుఁగు, పికిలును,
మంగొంగు లెగఁ బ్రోచి మోఁకరించుటయు,
తొంగలించెడి మిసిమి తొడల క్రొమ్మించు,
దర్విచే నుదకంబు దప్పించునపుడు
పర్వి కానఁగవచ్చు బాహుమూలములు,
బలువున మునిఁ ద్రోకు బలక ద్రొక్కుటయుఁ,
దలదండలైన పాదములు పెంపులును,
గిన్నెరప్రతినాడు కృష్ణాహిపోలె
వెన్నున విహరించు వేణియుఁజూచి
కౌతుకంబున నోడ గడపకయుండఁ
జేతులు మునిపట్టె......
అతివలావణ్య ప్రవాహంబునందుఁ
బతితుఁడై యాకాశపథము చూచుమను
చాపలంబున బ్రహ్మచర్య ధనంబు
తీపి విల్కాఁడను తెక్కలికి......"
(106-పుట)

అని చమత్కరించినాడు. మత్స్యగంధి వ్యాసుని రచనలో నొక దైవకన్య. నన్నయ యాంధ్రీకరణములో రాజపుత్రియైనది. ఆమెయే తిమ్మయచేతిలో పల్లెపట్టులందు మనము నిచ్చలుచూచు ముగ్ధమనోహరమగు జాలరిపడుచుగా రూపొందినది. ఇది యితని దేశీరచనా వైశిష్ట్యము.

v. ధర్మరాజు జననానంతరము, పాండురాజులో వేటకువచ్చిన సైన్యమంతయును వెనుకకుపోయి అతని శాపవృత్తాంతమును ధృతరాష్ట్రునితో చెప్పినట్లును,

అతిశయంగులకు విచారపడినట్లును ఇందు కొంచెము పెంచి వ్రాయబడినది.

vi. శరద్వంతుని తపము చెరచుటకై యింద్రుడు పంపిన జాలపదియను దేవకన్య విలాసప్రదర్శన వర్ణన మంతయు నిందు పెంపకమే.

vii. ద్రౌపదీ స్వయంవరమునకు వచ్చు రాజుల ప్రయాణసన్నాహము, వచ్చిన రాకుమారులను గూర్చి ధృష్టద్యుమ్నుడు ద్రౌపదికి చూపి చెప్పుటయు నన్నయ రచనలో నామమాత్రముగా నున్నది. ఇందా భాగము లతి మనోహరముగను విపులముగను కూర్పబడినవి అందును—

> "మలయజగంధి, యీమత్స్యేశుఁ జూడు
> మలవడె ముత్యాలహారముల్ వైచి
> పన్నగపతివోలె బాహువిస్ఫూర్తి
> నున్నవాఁడితఁడు పాండ్యుఁడు నీరజాక్షి!
> కుంతలపతి వీఁడె కుటిలకుంతలుల
> చింతాస్థలులఁ గాని చేయఁడు విడిది.
> రాకేందువదన, జరాసంధుఁ జూడు
> కైకొనఁడీవిల్లు కసవునకైన,
> వాఁడె సువిక్రముండు, వత్సరాజితఁడు
> వాఁడె చూడుము పౌండ్ర వాసుదేవుండు
> శ్రీనిధులవె చంద్రసేన సముద్ర
> సేన శుభాంగద చేకితానులును."
>
> (383-385 పుటలు.)

ఆదిగా ధృష్టద్యుమ్నుడు ద్రౌపదికి రాజకుమారులను పేర్పేరున చూపి చెప్పిన ఘట్టము కాళిదాస రచనలోని యిందుమతీస్వయంవరమును, నైషధ మందలి దమయంతీ స్వయంవరమును దలపించుచున్నది.

viii. మత్స్యయంత్ర మేసి యర్జునుడు ద్రౌపదిని చేకొనిన తరువాత ననూయచే రాజలోక మంతయు నాతనిపై పోరాటమునకు తలపడును. ఆ సందర్భములో తిమ్మయ :

> "అన్యోన్య శరధార లనలంబులీనఁ
> గన్యా వివాహాగ్ని గతి మండుచుండె;
> లాజలగతి హారలతలంగుఁ దునిసె;
> రాజరక్తం బాజ్యరాశి గాఁ దొఱఁగె;
> విసిరి భీముఁడు వ్రేయ విఱిగినరథము
> లసమున సమిధలై యాయగ్నిఁ బడియె."
>
> (387. పు).

వని సమరాయుధాగ్నిని వైవాహికాగ్నిగా, యుద్ధపరికరముల హోమసాధనములుగా నిరూపించి, సందర్భానుకూలముగా పెంచినారు. ఈ విధముగా నవసరమును ఔచిత్యమును అనుసరించి పెంచి వ్రాయుటలో నచ్చటచ్చట కొన్ని విషయములను గ్రంథాంతరములనుండి గైకొని యందు చొప్పించినాడు.

5. ఆహరణము:—వ్యాసరచనయందును కవిత్రయానువాదమునందును దుర్వాసశ్శాపవృత్తాంతము కనుపడదు. ఆ గ్రంథములలో సముద్రమథనవృత్తాంతము హఠాత్సంభవముగా చూపట్టును. దానికి తగిన కారణమును సందర్భశుద్ధియును గలిగింపదలంచి తిమ్మయ యీ వృత్తాంతమును విష్ణుపురాణమునుండి గైకొని యిందు చొప్పించినట్లు తోచుచున్నది. ఈ ద్విపద భారతాదిపర్వములో సముద్ర మథన మొక మనోహర ఘట్టము. అందును దుర్వాసశ్శాపవృత్తాంత మింకను మనోహరమైనది.

అతని శాపముచే స్వర్గరాజ్యలక్ష్మి సముద్రముపాలైనది. ఈ ఘట్టము చదువునపుడు 'అరరే! యెంతటి యమరవైభవమున కెట్టి దురవస్థ పట్టిన'దని జాలిపడని రసహృదయ ముండదనుకొందును. అది యంతయు నిచట ప్రస్తావించి గ్రంథవిస్తర మొనర్పింపలేను. కాని యొక్కమాట మాత్రము చెప్పక తప్పదు.

విగతవైభవులైన యమరులెల్ల విష్ణునొద్దకేగి మొరవెట్టుకొందురు. దుర్వాసశ్శాప వృత్తాంత మంతయు నెరిగింతురు. విష్ణు వన్నియు విని యీ యనర్థములకు మూలమైన యింద్రుని మందలించిన విధాన మెంత సహజసుందరముగా నున్నదో గమనింపుడు :

> "మును దైత్య మథనుఁ డమ్మఘవు నీక్షించి
> యేమి దేవేంద్ర, నీ వెఱుఁగవే యకట!
> యామార్గు నతిక్రూరుఁడని జనుల్ పలుక.
> పిన్న బిడ్డవ నీవు పెరిమ వెన్నడఁచి
> నిన్నింక బుద్ధులు నేర్పెదమన్న!
> ఒక యొకవేళ మా యున్నట్టి కతఁడు
> వికలుఁడై యున్మత్తి విధమునవచ్చు.
> అప్పుడు నేమెల్ల నాకుటిలాత్ముఁ
> డెప్పుడు పోవునో యిటనని యాత్మ
> జలదరింతుము, కాని స్వస్థత మదికిఁ
> గలుగదా తపసి దిగ్గనఁబోవుదాఁక." (37 వ పుట)

ఈ విధముగా సముద్ర మథనమున కుపస్కారకమగు నీ ఘట్టమంతయు ప్రతిపద రసాయనము. దాని నాచమట్టుగా చదివి యానందింపవలయునే గాని యుదాహరించి చూపుట అలవిగాని పని. గ్రంథాంతరముల నుండి సందర్భోచితముగా విషయాంతరములను గైకొని పెంచి వ్రాయుటలో కవికిగల నేర్పును గుర్తించుటకీ యొక్క యుదాహరణము చాలుననుకొందును.

6. కల్పితము:—వ్యాస నన్నయ భారతములలో లేకున్నను సందర్భానుసారముగా కవి తానై స్వతంత్రించి కల్పించిన విషయములును కొన్ని గలవు.

i. పాండురాజు వేటకేగు సందర్భములో అటవికులు రాజునొద్దకు వచ్చుట, వారు అడవిజంతువులను గూర్చి రాజుతో చెప్పుట ఆదిగాగల మృగయావర్ణనలు మూల భారతభాగములందు చూపటవు. అటివానినెల్ల కవి సమయోచితముగా కల్పించి, ఆ యా ఘట్టములను సర్వాంగసుందరములుగా సంతరించినాడు. (198 పుట.)

ii. గురుదక్షిణకై యర్జునునిచే పరాభూతుడైన ద్రుపదుడు యజ్ఞ మొనర్చుటకు పూర్వము శివునిగూర్చి తప మొనర్చినట్లును, (339 పుట)

iii. కుంతియు పాండవులును ఏకచక్రపురము వీడునపుడు గృహయజమానినేగాక, ఆ గ్రామమందలి బ్రాహ్మణుల నందర సామంత్రణము చేసినట్లును, మూలములలో లేని విషయము లిందు కల్పింపబడినవి. మొదటిదానివలన తిక్కయ శివభక్తియు, రెండవదానివలన నాతనికిగల యేకగ్రామవాసులగు గృహస్థుల మర్యాదా పరిజ్ఞానమును వ్యక్తము లగుచున్నవి.

iv. ద్రౌపదీ స్వయంవరమునకై పాండవు లేగు సందర్భములో: 'కాంచిరి మణిసౌధ కాంచన రమ్య సంచితసురపురీ సమభాసురంబు' (376 పు.) ఆదిగాగల కాంపిల్యపుర వర్ణనము సందర్భోచితముగా నిందు పొందుపరుపబడినది.

v. స్వయంవరానంతరము ద్రౌపదీసహితులై యున్న పాండవులను చూచు వేడుకతో బలరామకృష్ణు లరుదెంచి వారల నభినందించి వెడలిన తరువాత:

"అప్పు డింద్రుడు గెల్చు నాత్మసంభవుని
నొప్పియుఁ జూచి మనోవ్యథనిముఁడు
జగము నిర్వాణంబు చాలించెననఁగ
మొగిమింటఁ బశ్చిమాంబుధి చాయ డిగ్గె.
......................
రథము పగంబు సారథి పిచ్చుకుంటు
రథికుఁ డట్లయ్యుఁ జేరఁగవచ్చె నన్న,
అని ప్రతీచీకాంత యనురక్తి నెఱపెఁ
దనువెల్ల ననఁగ సంధ్యారాగ మెసఁగె.
........................
చంద్రాన్వయుల పెండ్లి సంభ్రమంబునను
జంద్రు నెచ్చెలులెల్ల సంప్రీతిగనుట
తిగవని వికసించెఁ దత్కైరవములు." (406 పుట)

ఆదిగాగల సూర్యాస్తమయ, సంధ్యారాగ, చంద్రోదయాది వర్ణనలు మూలములో లేనివయ్యు కల్పించి యిందు వ్రాయబడినవి సందర్భోచితములై ప్రస్తుత వస్తుధ్వని గర్భితములై చక్కగ నిర్వహింపబడినవి.

vi. మాద్గల్యుని పత్నియగు నాలాయని కాశీరాజు కూతురై జన్మించి:

"అల్లనఁ బెరిగి తన్నడిగడివారి
కల్లకాలంబున సెనగలు చూచి
కానక యంతతోఁ గన్నియ ముదిసి
కానకుఁబోయి శంకరునకుఁ దపము."

సేయును, ఆమె తపమునకు మెచ్చి శివుడు ప్రసన్నుడై వర మొసగును. ఈ సందర్భములో:

"వేదాంత సీమల విహరింప నేర్పు
మేలుర ప్రభలల్లు మృదుల పాదములు
విసమునఁ గసవైన విపులకంధరము,
పసని రొమ్ముల పేర్లు భాసిల్లునురము
......................
చలిలేము విడిసిన చదురు కెంజడలు
మెఱయుచు వెన్నెలపువ్వు మేకొన్న వేయి
చెఱఁగుల తలపాగ చెలువైన వహాళి." (418-419 పు)

ఆదిగాగల పరమశివ వర్ణనమును, నాలాయనీకృత శివస్తవమును మూలమున లేనివి యిందు కల్పింపబడినవి. ఇందుల కితని 'సదాశివభక్తి'యే కారణమైయుండును.

vii. తీర్థయాత్రాపరుడైన యర్జును నులూచి గంగాద్వారమున నాగలోకమునకు గొంపోవును. అచటి

"పాపఁగ నింద్రుని వింటిపూదోఁటయనఁగఁ
బసనొరఁ బర్విన ఫణరత్న రుచులు,
వేవేగ శేషుని వేదశాస్త్రములు
భావించి వినుచున్న బాలసర్పములు." (447 పు)

మున్నగు నాగకుల వర్ణనము మూలమున లేదు. కాని నాగకుల దృశ్యమును కవి కన్నులకు కట్టినట్లు భావించి యా భావనను గ్రంథస్థ మొనర్చినాడు.

viii. అర్జునుడు తీర్థయాత్రలు చేయుచు వేంగిదేశమును దర్శించిన తరువాత, చిత్రవాహనుడు పాలించు మణిపూరునకు వెడలినట్లు నన్నయ, తిక్కయ శ్రీశైలము, విజయవాడ, రాజమహేంద్రవరము, దక్షారామము, అహోబిలము, కాళహస్తి, వేంకటగిరి మున్నగు నాంధ్రదేశ తీర్థములను, కంచి, అరుణాచలము, శివగంగ (తంజావూరు), చిదంబరము మున్నగు దక్షిణదేశ తీర్థములనుగూడ దర్శింపజేసినాడు.

(450-451 పుటలు).

ix. "ఇచ్చతోఁ బరమాత్మ హృదయంబులోనఁ
జొచ్చిన సుఖమిందుఁ జొచ్చినఁ గలదె!
కదలిన నిది పుష్పకము బోలకున్నె!
కదలక యిదివోలుఁ గనకాద్రి గుహల."

(311 పుట)

ఆదిగాగల జతుశాలా వర్ణనమిం దధికముగా గూర్పబడినది.

x. ఖాండవ దహనానంతరము, ఇంద్రుడు వచ్చి నరనారాయణుల గీర్తించి, యర్జునునకు దివ్యాస్త్రాది మొదవించి వెడలినట్లు నన్నయ, తిమ్మయ శివునిగూడ ప్రవేశపెట్టి యింద్రు నూరడింపజేసి కృష్ణార్జునులను బొగడించి, తత్కృత పరమశివ స్తోత్రముతో ఆదిపర్వ రచనను సమాప్తము చేసినాడు.

7. అనుకరణ:—ఇది యీతని రచనయందు రెండు తెరగులుగా గోచరించుచున్నది. 1. సంస్కృత కావ్యానుకరణము. 2. ఆంధ్ర ప్రబంధానుకరణము, ఇందు మొదటిదానిగూర్చి తొలుత వివరింతును. కవి సంస్కృత కావ్యనాటకాదులను కడముట్ట చదివి వాని రచనా వైశిష్ట్యమును, అందలి భావసంపదను జీర్ణింప జేసికొనినవాడు గాన, తన హృదయమున హత్తుకొని యున్న తన్మనోహర సన్నివేశములను భావములను తన రచనలో చొప్పించినాడు. అట్టివాని నొకటి రెండు చూపుదును.

ఆదిపర్వమునందలి శకుంతలోపాఖ్యానములో దుష్యంతుడు కణ్వాశ్రమప్రవేశమునకు పూర్వము లేడినిగాంచి దానిని వెంటాడి బాణప్రయోగమును చేయజూచును. అపుడు ముని లడ్డమువచ్చి "ఇది యాశ్రమ మృగము దీనిని చంపదగ"దని వారించి, అతని నాశీర్వదించి యాగినట్లు వర్ణింపబడినది. ఈ సంవిధాన మంతయును కాళిదాస శాకుంతలమునుండి గ్రహింపబడినట్లు స్పష్టము. విషయము నేగాక అందలి కొన్ని శ్లోకముల భావమును కవి యనుకరించినాడు.

i. "చనదు చంపంగ దీనిఁ జాలునీ యలుక
అనఘాత్మ, యిది మదీ యాశ్రమ మృగము.
ఘూర్తులఁ దెగటార్పఁ దొడరు నీ బలిమి
యార్తుల రక్షింప నందంబు గాదె!"

(ద్వి. భా. ఆది. 3-145. పు)

అను రచన—

"తత్సాధు కృత సంధానం
ప్రతి సంహర సాయకం,
ఆర్తత్రాణాయ వశ్శస్త్రం
నప్రహర్తు మనాగసి."

అనెడి కాళిదాస శాకుంతలమునందలి శ్లోమునకు అనుకరణము.

ii, "చిత్రే నివేశ్య పరికల్పితసత్వయోగా
రూపోచ్చయేన మనసా విధినాకృతాను."

అన్న కాళిదాస రచన నెమరునకు రాగా—

"చిత్తంబులో బ్రహ్మ చెలువొప్పఁదలఁచి
హత్తింపబోలు నీ యబలరూపంబు."

(85–4 పుట)

అను ద్విపద వ్రాసినట్లు చెప్పకయే తెలియుచున్నది.

iii. "శృంగార రసమెల్లఁ జెలువుగాఁగూర్చి
యంగజుఁ డిచ్చోట యంత్రించెఁగాక
వితత వేదాభ్యాస వికలుఁడైనట్టి
చతురాననున కిట్టి చతురత గలదె!"

అదిగాగల రచన—

"అస్యాః స్సర్గవిధౌ ప్రజాపతి రభూ
చ్చంద్రోను కాంతిప్రభః,
శృంగారైకరస స్స్వయన్ను మదనో
మాసోను పుష్పాకరః
వేదాభ్యాసజడః కథన్ను విషయ
వ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం
రూపం పురాణో మునిః."

అను విక్రమశ్లోకమున కనుకరణమని సులభముగా గుర్తింపవచ్చును.

iv. అట్లే మేఘసందేశమందలి—

"ఆనందోత్థం నయన సలిలం
యత్ర నాన్యై ర్నిమిత్తైః
నాన్యస్తాపః కుసుమశరజా
దిష్టసంయోగ సాధ్యాత్,
నాప్యన్యస్మాత్ ప్రణయ కలహా
ద్విప్రయోగోపపత్తి
ర్విత్తేశానాం నచ ఖలు వయో
యౌవనా దన్యదస్తి."

అను శ్లోకభావమును మనసున నిడుకొని—

"సతులతోఁ బతుల యాచ్ఛావృత్తిదక్క
నితర యాచ్ఛావృత్తి యిచ్చోట లేక."

అదిగాగల పంక్తులు వ్రాసియుండును. ఇట్లే కాళిదాసుని కుమారసంభవమునుండియు ననుకరణలు కానవచ్చుచున్నవి.

v. "నాగేంద్ర హస్తా స్త్వచి కర్కశత్వా
దేకాంతశైత్యా త్కదలీ విశేషాః,
లబ్ధ్వాపి లోకే పరిణాహి రూపం
జాతా స్తదూర్వో రుపమాన బాహ్యాః."

అన్న కుమార సంభవమందలి పార్వతీరూప వర్ణన—

"అతి కర్కశంబులు హస్తితుండములు
సతత శీతలములు జగతి నరంట్లు
కావున నీభామ కలితంపుఁ దొడల
కీవిధంబున సవతెన్నంగవచ్చు."

(85–3 పు)

నని తన గ్రంథమందలి నాయికల కాపాదించినాడు.

ప్రబంధానుకరణము:—దీనినిగూర్చి వివరింపవలసిన విషయ మెంతయేని గలదు. ప్రస్తుతము పర్యాప్తముగా మాత్రమే పేర్కొందును. కాని, యేతద్విషయ పరిశీలనకు పూర్వము తిమ్మయకాలమునాటి వాఙ్మయ వ్యవస్థ నించుక గమనింపవలెను. అది పదునారవ శతాబ్దము. మన వాఙ్మయచరిత్రలో ఆ కాలము ప్రబంధయుగము. రసవత్ప్రబంధరచన లెన్నియో పుంఖానుపుంఖముగా వెల్లివిరిసిన సమయము అది. ఎట్టివాడును ఆ ప్రవాహములో మునిగి తేలక తప్పదు. కవులమాట వేర చెప్పనేల! కవిత నేర్చి గంటముపట్టిన ప్రతి కవియు నే "బిల్హణమల్లర" ప్రబంధమునో రచింపవలయునని యుబలాటపడెను. అనగా, కాలప్రభావము కవులపై ప్రసరించుననుట. అట్టిచో, భారతమువంటి మహాగ్రంథమును రచించు సామర్థ్యముగల తిమ్మయకు మాత్రము ఆపాటి ప్రబంధరచనాకుతూహలము ఉండకపోవునా? ఉన్నదికూడ; అయితే, నితడు ప్రత్యేకముగా ప్రబంధములేవియు వ్రాసినట్లు కనబడదు. కాని, ఆ యభిరుచి యాతనికి భారత రచన వలననే నెరవేరినది. ఇతని చేతిలో నిందలి యొక్కొక పురాణపురుషుల చరిత్ర యొక్కొక సుందర ప్రబంధముగా రూపొందినది. ఒక్కొక కథాఘట్టమొక్కొక్క రసవత్కావ్యరూపమును సంతరించుకొన్నది. ప్రత్యేకోదాహరణము లీయవలసివచ్చుచో గ్రంథమంతయు తిరుగవ్రాయవలయును. కావున నాయా ఘట్టముల పేర్లను మాత్రము పేర్కొందును.

సముద్రమథనము, వేదవ్యాసావతారము, యయాతి చరిత్ర, శకుంతలోపాఖ్యానము, భీష్మప్రతిజ్ఞ, పాండురాజు పాలన, తపతీ సంవరణము, ద్రౌపదీ స్వయంవరము, అర్జున తీర్థయాత్ర మున్నగునవి. ఇవి తిమ్మయ రచనలో ప్రత్యేకముగా నిలువదగిన రసవత్కావ్యములు. వానిని వేరుచేయను వచ్చును; మూలములో కలుపనువచ్చును. ఇవి యితని గంటమునుండి కాలప్రభావముచే వెలువడిన ఖండకావ్యములు.

ఉపరిచర పురప్రాంతమందు శుక్తిమతియను నది ప్రవహించుచున్నట్లును, దానిని కోలాహలమను కొండ యడ్డగించినట్లును, వ్యాస నన్నయ భారతభాగములందు గలదు. తిమ్మయ ఆరెండిటియందును నాయికానాయకత్వ మారోపించి యింపైన రచన సాగించినాడు. అందు శుక్తిమతియందు విలాసవతి ధర్మములను నిరూపించి యొనర్చిన వర్ణన ప్రతిపద మనోహరము:

"అరయ నొక్కయే రాతినిపురము
చేరువంబాఱు విశేష సంపదల
చూచు నొక్కొకమాఱు సుకుమార మీన
లోచన సుభగుణాలోలదృష్టులను
పలుకు నొక్కొకమాఱు బకచక్రవాక
కలహంస మధుకర క్రౌంచనాదముల."

(ద్వి. భా. 2 ఆ. 101-102 పు)

ఆదిగాగల సంస్కృతము చూచినచో వసుచరిత్రమందలి శుక్తిమతీ కోలాహలముల వర్ణన మనసులో నిడుకొని తిమ్మయ యీ రచన సాగించినట్లు పోల్చుకొనవచ్చును. చూపవలెనన్నచో నిట్టిపట్లెన్నేని గలవు.

i. మార్పు:— ఉదంకుడు పౌష్యునియొద్దకు వెడలి, గురుపత్నికి కానుకలుగా నొసగుటకై యతని రాణికుండలముల నర్థించి గొనివచ్చుచుండ, మార్గములో తక్షకుడు వాని నపహరించి పాతాళమునకు గొంపోవును. మునియు వాని వెన్నంటిపోయి ముప్పుతిప్పలు పడి యా కుండలముల మరల గొనివచ్చి గురుపత్నికొసగి యింటికేగును. మరి కొంతకాలమునకు తక్షకునిపై పగ దీర్చుకొనదలంచి యుదంకుడు జనమేజయునియొద్ద కేగి పరీక్షిత్తుని శాపకారణ మెరిగించి, యాతనికి సర్పయాగ సంకల్పము గలిగించినట్లు నన్నయ భారతము.

తిమ్మయ దీని నంతయు విడిచి, జనమేజయుడు వాజపేయాది యాగములు చేయుచుండగా నుదంకుడు చూడనేగి, రాజుతో "నీవు చేయదగినది సర్పయాగము గాని సత్రయాగము గాదనియు, తక్షకుడు నీ తండ్రిని గరచి చంపెననియు, నాతడు తాను గురుపత్నికై తెచ్చు కుండలముల నపహరించెననియు" దెల్పి, యాతనికి నాగకులముపై పగదీర్చుకొను పట్టుదల గలిగించినట్లు మార్చి వ్రాసినాడు. అట్టి మార్పు ఈ సందర్భమున నెంతయు దగియున్నది.

ii. వ్యాస నన్నయ భారతములందు జరత్కారు చరిత్ర, జనమేజయుని సర్పయాగమునకు పూర్వము, అతిగా వర్ణింపబడినది. జనమేజయుడు చేయు సర్పయాగము మాన్పవచ్చి, ఆస్తీకుడు, తన తండ్రియగు జరత్కారు చరిత్ర మాతనితో చెప్పినట్లిందు మార్చి వ్రాయబడినది. విషయ బాహుళ్యమును తగ్గించుటకై తిమ్మయ యీ మార్పు చేసియుండును.

iii. శర్మిష్ఠ, వృషపర్వుడను దానవరాజు పుత్రి. దేవయాని, ఆ రాజునకు గురువగు శుక్రుని కూతురు. ఒకనాడు వారిద్దరును వాహ్యాళి వెడలుదురు. ఏదియో వాక్కలహములో శర్మిష్ఠ రాజసముతో దేవయానిని నూతబడద్రోయును. వేట వచ్చిన యయాతి భటుల వలన నా విషయమెరిగి కూపమునుండి యామె నుద్ధరించును. తరువాత శుక్రుడటకు వచ్చి తనయ నోదార్చి యింటికి పోదము రమ్మనును. పరాభవ ఖిన్నయైన

యామె నగరమునకు వెడలక యంగేయుండి తప మొనర్చి శర్మిష్ఠపై పగసాధింతునని పట్టుపట్టగా, వృష పర్వుడా విషయమెరిగి యాటకు వచ్చి "తన తనయ చేసిన తప్పు క్షమింపు"మనియు 'నంగులకు పరిహార ముగా నేదెని గోరుకొ'మ్మనియు శుక్రుని బ్రతి మాలును. అంతట నామె 'దాసీ సహస్రముతో శర్మిష్ఠ తనకు దాసియై యుండజేయు'మని కోరును. ఇది నన్నయ రచన.

తిమ్మయ రచనలో నట్లుగాక రాజపుత్రికచే కూతునకు గలిగిన పరాభవము దాసివలన తండ్రియగు శుక్రుడెరిగి యామె యొద్దకేగి:

"ఓ బాల, నీకేల యుగ్రతపంబు!
ఈ బాము లేనుండ నెట్లురావచ్చు!
శర్మిష్ఠ చేసిన సాహసంబెల్లఁ
గర్మవశంబింతె కందంగ వలదు.
ఇల్లువట్టము, నీకు నిచ్చోటనుండఁ
దల్లి, ధర్మము గాదు తరుణిరో నీవు."

అని యొడబరచుచుండ, నంతలో దానవ నాయకుడు వృషపర్వుడంతయు విని

"తన తనయ చేసిన దంటతనంబు
మనమున నెరిగి యమ్మునివరుఁ దోడ్కొనుచు
వచ్చి యాగురు నభినందించి...
...మా శర్మిష్ఠ యీయింతి కెప్డు
లోనరించె దీని నేలుఁడు దాసిగాఁగ."

(2-126 పు)

అని పల్కి, గురుపుత్రియగు దేవయానికి తన కూతురు చేసిన యపరాధమునకు శిక్షగా దానవరాజు తానే యామె నామెకు దాస్యముసేయ నియమించినాడు. ఇట్టి మార్పుచేసి రచించిన తిమ్మయ రచనయందలి యౌచిత్యము నేను చెప్పుటకన్న సహృదయులగు పాఠకులే యూహించుకొనుట సరసమైన పద్ధతి.

iv. వశిష్ఠ మహాముని వర్ణించుఘట్టములో బ్రహ్మరాక్షసావిష్టుడగు కల్మాషపాదుడను రాజు వశిష్ఠ కుమారుడగు శక్తియనువానిని భక్షించినట్లు రెండు భారతములలోను గలదు. ఇందు మాత్రము:

"కపటాత్ముఁడైనట్టి కౌశికునాని
చపలాత్ముఁ డొక దైత్యుఁ జలమొప్పఁ బిలిచి
పలికె నో రాక్షస, పదరక నీవు
బలిమిమైఁ గల్మాషపాదులోఁ జొచ్చి
యా వశిష్ఠాత్మజు...నణఁగింపు."

మని వేరొక తీరుగా నున్నది. మునికుమారుల చంపిన దోషము రాజగు కల్మాషపాదునకు చెందుట మన సొప్పక కాబోలు కవి బుద్ధిపూర్వకముగా నా పాపము నొక కల్పిత రాక్షసున కంటగట్టియుండును.

v. పై సందర్భములో నే "ఒక్క నాడు రాక్షస రూపధరుడై రౌద్రాకారంబున వచ్చు కల్మాషపాదుం జూచి యదృశ్యంతి వెఱచిన దాని నోడకుండు"మని నన్నయవశిష్ఠుడు బుజ్జగించును. తిమ్మయ రచనలో:

"అంతట నొక్క నాఁడమ్మౌని కొడు
లెంతయు జలముల కేతెంచుచోట
ఘనకల్మషుండైన కల్మాషపాదుఁ
డెనయు నా మునికాంత నేచి మ్రింగంగఁ
జనుదేరఁ జూచి యదృశ్యంతి తలంకి."

(ద్వి. భా. ఆ. ప. 6-364 పు)

యని నీటికేఁగు నదృశ్యంతిని కల్మాషపాదుఁడు మ్రింగ జూచినట్లు మార్పబడినది. దీనికి కారణముగాని మూలముగాని గుర్తింప వీలుగాలేదు. వ్యాసుడిట్లు:

"స తు దృష్ట్వైవ తం రాజా
క్రుద్ధ ఉత్థాయ భారత,
ఆవిష్టో రాక్షసోగ్రేణ
ఇయేషాత్తు మధాజసా."

అని కల్మాషపాదుడు వశిష్ఠుని మ్రింగుటకై వచ్చినట్లును, అది చూచి తన్నుగూడ నాతడు చంపవచ్చునేమో యని భయపడి

"త్రాహి మాం భగవన్ పాపా
దస్మాద్దారుణ దర్శనాత్,
రాక్షసోస్తు మిహోప్యాయా
న్నాన మేత చ్చికీర్షితం."

అని యదృశ్యంతి, రాక్షసునిబారి బడకుండ రక్షింపుమని మామయగు వశిష్ఠుని ప్రార్థించినట్లును రచన సాగించినాడు.

ఇట్లు దాహరించుచు బోయినచో నెంతయేని వ్రాయవలసినది కలదు. కాని, తిమ్మయ రచనా విధాన మెరుగుటకీపాటి చాలుననుకొందును. పై చూపిన విషయములవలన నీతని శైలీవిధానమును గూర్చి చాల వరకు గ్రహింపవచ్చును. వర్ణన సందర్భమున నాతని శైలి యెంత యాలంకారికముగ నుండునో, ప్రసంగ ముల నిర్వహించుటయందంత సహజ మనోహరముగా నుండును. కథ నడుపుటలో, పాత్రల చిత్రించుటలో రసపోషణ మొనర్చుటలో తిమ్మయ సిద్ధహస్తుడు. వీని నన్నిటిని సోదాహరణముగా చూపి చెప్పవలయు నన్నచో ప్రత్యేక మొక గ్రంథమగును. కాని యొక మాటమాత్రము చెప్పి ప్రస్తుత వ్యాసము ముగింతును. మార్గకవులలో నన్నయ కెట్టి స్థానముకలదో, దేశికవు లలో నందు ద్విపద కావ్యకర్తలలో తిమ్మయ కట్టి స్థానముగలదని నా భావన. వ్యాసభారతమును రుచిరముగా ఆంధ్రమునకు దెచ్చిన మహాతపస్వి యాతడు. కావ్యత్వ ముడివోకుండ తేటతెల్లముగ దేశిరచనలో వల యించి యాంధ్రుల కందరకు నందుబాటులోనికి దెచ్చిన మహానుభావు డీతడు. అతనిది మార్గకవిత. ఈత నిది దేశికవిత. ఉభయ రచనలును మన కుపాదేయములే. ఉభయులును మనకు పూజ్యులే.

# జీవించాలంటే...

## శ్రీ మల్లాది సత్యనారాయణ

[గతసంచిక తరువాయి]

## రెండవ రంగం

(తెర లేచేసరికి చంద్రం పడకలలోను, సూర్యం నాటకం షెల్ఫ్‌లోను లీనమవుతారు. గోపాలరావు ఇద్దరికీ మధ్య నులకమంచం మీద గడ్డం క్రింద చేతులు పెట్టుకు కూర్చుంటాడు. తినేసిన ప్లేట్లు గ్లాసులు వారి వారి ప్రక్కనే ఉంటాయి.)

(తెర లేచాక చెరొయొక బిందె నీళ్లతోను, సావిత్రి, సౌభాగ్యం వస్తారు. వనకాలే మాట్లాడు కుంటూ మూర్తిగారు కూడా వస్తారు.)

సౌభాగ్యం: (తలవంచుకు సరాసరి లోనికి వెళుతుంది)

సావిత్రి: అదికాదు మాస్టారూ! మీరే చెప్పండి. మేము ఎప్పుడేనా కిటిలో కొచ్చేగుగుమా? తప్పనిసరి అయి ఆ చెరువుకు నీళ్ళకు వెళ్ళడం తప్ప...మరి తమకుమల్లే నౌకర్లను పెట్టుకునే తాహత్తు మాకెక్కడుంది చెప్పండి.

సౌభాగ్యం: (మళ్ళీ వచ్చి వదినగారి బిందెకూడా తీసుకుని లోనికి వెళుతుంది.)

మూర్తి: వాళ్ళకేమిటమ్మా. పైగా బడిపంతులంటే ఊళ్లో అందరికీ లోకువ.

సావిత్రి: ఇంతకూ మా గ్రహచారం లెండి. మొగుడికి లోకువైతే మగుడుకుకి లోకువే అన్నట్టు మొగుడు తీసుకువెళ్ళక పోబట్టి ఎవళ్ళిష్టమొచ్చి నట్టు వాళ్ళు అంటారు. వాళ్ళకేం బాధలున్నాయో అన్నమాట అక్కరలేదు.

మూర్తి: ఆమాత్రం విచక్షణాజ్ఞానం వుంటే యింకే వమ్మా?

సూర్యం: ఏమిటి వదినా అది? (కుర్చీలో నుంచి లేస్తాడు.)

సావిత్రి: అదికాదు మాస్టారూ! ఏమో ఎందుకు వదిలేశాడో, యీవిడేం చేసిందో, అనడంలో ఆవిడ ఉద్దేశం యేమిటి చెప్పండి...ఇన్నాళ్ళూ గౌరవంగానే కాలక్షేపం చేస్తున్నాం గాని ఇలాటి మాటలు ఎవరితోను అనిపించుకు ఎరగను.

సూర్యం: ఎవరన్నారు వదినా?

గోపా: ఎవరైనా అంటారు. మనరోజులు మంచివి కానప్పుడు ఎవరైనా అంటారు బాబూ!

సావిత్రి: పోనీ ఎప్పుడేనా మా సౌభాగ్యం గుమ్మం దాటి బయటికెళ్ళడం చూశారా మాస్టారూ! ఉన్నదేదో తిని ఇంకోయింటికెళ్ళకుండా కాలక్షేపం చేస్తున్నాం గాని తమకిమల్లే ఎక్కడ గుమ్మం దిగి గుమ్మం కొరుగదా. పెబ్బుండిగదా అని వాళ్ళ యిష్టమొచ్చినట్లు మాట్లాడడం బాగుందంటారా మాస్టారూ!

మూర్తి: ఎవరంటారదమ్మా బాగుందని...వాళ్ళకేమిటి? హోదా కలవాళ్ళవనే అహంభావం ఒకటి, బడిపంతులనే లోకువ రెండవది. ఏం చేస్తాం అమ్మా?

సూర్యం: ఏమిటి మాస్టారూ యీ గొడవ?

మూర్తి: ఆ...ప్రెసిడెంటుగారి భార్య మీ చెల్లెలు విషయం అడిగింది.

సూర్యం: ప్రెసిడెంటుగారిభార్య అయితే మాత్రం నోటికి వచ్చినట్లు మాట్లాడితే ఎవరూరుకుంటారు మాస్టారూ!

మూ: ఊరుకోక మనం చేసేదేముందిరా సూర్యం?

సూ: ఎందుకు వదిలేశాడో, యీవిడేం చేసిందో, అనడంలో ఆవిడ ఉద్దేశం......ప్రెసిడెంటు గారి పెళ్లామయితే ఎవరికెక్కువ. కాకపోతే మొగుడుతో చెప్పి అన్నయ్యని యీ వూరునుంచి ట్రాన్స్‌ఫరు చేయిస్తుంది. అంతేగా...

పా: సూర్యం! అనవసరంగా నోరు పారేసుకోకు. గోడలకి చెవులుంటాయి.

సూ: ఏమిటి వదినా లేకపోతేను. తమకిమల్లే యింటింటికి మా చెల్లెలు షికార్లు చెయ్యడం అలవాటు లేదని తెలియదు కాబోలు.

మూ: ఒరేయ్ సూర్యం నువ్వు కట్టి ఆవేశపడకువురా. మీ వదిన చెప్పేటట్టు మొగుడు తీసికొని వెళ్ళనప్పుడు ఆడదాన్ని గురించి ఎవళ్ళిష్టమొచ్చినట్లు వాళ్ళు చెప్పుకుంటారు. అంతమాత్రాన్ని మనం కంగారుపడితే ఎట్లా చెప్పు. పైగా మన దీ వూరు కాదు. మీ అన్నయ్య పొట్టకోసం యిక్కడ కొచ్చాడు. నీమాట నామాట వినేనా రెవరిక్కడ. నోరు జారితే కష్టంరా.

సూ: అవునులెండి ఆమాటా నిజమే. ఇంతకీ మా గ్రహచారం బాగుండలేదు.

# జీవించాలంటే....

సా : (లోపలికి వెడుతూ) సౌభాగ్యం ఎందుకమ్మా? నువ్వేడుస్తా వెందుకు? (లోనికి వెడుతుంది)

సూ: ఏడుపు గాకపోతే యేముంది? ఆడదాని బ్రతుకు అంతటితో ఉంది.

సూ : అందుకే మాస్టారూ! భర్తతో విడాకు లిప్పించి చెల్లాయికి మళ్ళీ పెళ్ళి చేద్దామంటే అన్నయ్య ఒప్పుకోడు. చెల్లాయికి యిష్టం లేదు. ఈ కరువు రోజుల్లో ఒకటే అన్నయ్యకి బరువు. రెండు లోకులతో మాటలు పడటం. ఏం బాగుంది చెప్పండి.

మూర్తి: ఒరేయ్! చూస్తూ చూస్తూ మన ప్రాచీన సంప్రదాయాలని చెండాడటం అట్టే మంచి పని కాదురా సూర్యం! కట్టుబాట్లలోనుండి ఈవలికివచ్చి విడాకులు పుచ్చుకున్న పురుషుడు గాని స్త్రీ గాని తర్వాత వివాహం చేసుకుంటే మాత్రం మానసికంగా ఆనందం అనుభవిస్తా రనుకుంటున్నావా? ఎప్పుడూ కాదు. ఆ తర్వాత చిన్న కారణానికి కూడా విడాకు లివ్వడానికే ప్రయత్నిస్తూంటారు.

సా : (లోపలినుంచి వస్తూ) ఎంతసేపూ విడాకులు, మళ్ళీ పెళ్ళి, అంటాడు మా మరిది గారు మాస్టారూ. ఆవేశాలతో కూడిన నూతన భావాలు. ఆచరణ కనువుగాని భావ కవిత్వం. ఊహాకందని ఆకాశసౌధాల్లో ఊగుతూ ఉంటారు మాస్టారూ మా మరుదు లిద్దరూను.

మూర్తి: చిన్నతనం కదమ్మా. ఇంతకీ అన్నయ్య, వదిన మంచివాళ్ళు గనుక వాళ్ళ ఆటలు సాగుతున్నాయి...అయిపోయిందేదో అయిపోయింది. ఇంక ఆ గొడవ తలపెట్టకండి. వాళ్ళతో పేచీ పెట్టుకు నెగ్గలేం. వస్తానమ్మా. ఒరేయ్ సూర్యం అప్లికేషన్లు పంపించడం మరచిపోకండి—(వెడతాడు.)

సా : (లోపలికి వెడుతూంటుంది.)

సూ : ఇంకేమంది వదినా! ప్రెసిడెంటుగారి పెళ్ళాం.

సా : (వెనక్కు తిరిగి) ఏం? యుద్ధాని కొస్తావా?

సూ : యుద్ధం కాదుగాని వదినా! చెల్లెలు మూలంగా వీధిన బడవలసి వస్తోంది యీనాడు. ఇన్నాళ్ళ నుంచి యీ వూళ్ళో వుంటున్నాం ఎవ్వరితోను మాట అనిపించుకు ఎరగము.

సా : చెల్లెలు మూలంగా అన్నమాటేమిటి మన గ్రహస్థితి అనుకోవాలిగాని...పాపం అదేం చేసింది. అది అసలే కుమిలి పోతోంది. దాన్నేమీ అనకు బాబూ. (లోనికి వెడుతుంది.)

గోపా: మాట్లాడితే దాన్ని తిడతావేమిరా సూర్యం. పాపం అది మాత్రం యేం చేస్తుంది చెప్పు.

సూ : ఏం చేస్తుందా? మొగుడు వెళ్ళమన్నంత మాత్రాన్ని యిక్కడకి రావడం పొరబాటంటాను.

గోపా: ఆడది అంతకన్న యేం చెయ్యగలదురా. పుట్టింటిమీద ఆశ పోతుందా బాబూ! ఒక కడుపున బుట్టారు. మీ దగ్గర చేరకపోతే ఎక్కడి కెడుతుంది. మాట్లాడితే అన్నయ్యకి బరువంటావు. ఇందులో బరువుకానిదెవరు? అది చెప్పినట్లు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్న మొగాళ్ళకీ పెడుతున్నాడు అన్నయ్య. ఏం చెయ్యను. నా అవస్థ యిల్లా వచ్చిందిగాని లేకపోతేనా మీలాంటి కుటుంబాలను నాలి గింటిని పోషిద్దును. మొదట్నుంచీ మీ చదువుల కోసం అన్నయ్య బాధపడుతూంటే చూస్తూ ఊరుకోలేక పోయాను. ఏదో వ్యాపారంలో సంపాదించి కొస్తా కుటుంబానికి కొంత, కాంగ్రెసులో గొప్పలకోసం వాళ్ళకీ వీళ్ళకీ సహాయాలు చెయ్యడంకోసం కొంతా మొత్తం తగలేసుకున్నాను. ఇప్పుడు వాడి రెక్కలమీద ఆధారపడవలసి వచ్చింది. అన్నయ్యకి బరువు కాని దెవరుబాబూ! మాస్టారు చెప్పినట్టు వాడు గనుక నే యీదు కొస్తున్నాడు.

సూ : ఇంతకీ యీ కొంపలో అందరికీ మేము యిద్దరం సంపాదించకుండా మొద్దుల్లా కూర్చున్నామనే బాధ.

గోపా: ఎవరికి బాబూ బాధ? నేను మాత్రం మొద్దులా కూర్చోవడం లేదూ.

సూ : అయితేం. నీ ఆస్తి కొంత యీ కుటుంబంకోసం ఖర్చు పెట్టావు గనుక నిన్ను పోషించి తీరవలసిందే మా అన్నయ్య.

గోపా: అదేమన్న మాటలే. ఇదేం నిర్బంధమా? అభిమానమున్న మొగాడు గనుకనే అవతలికి పొమ్మనలేక పోతున్నాడు నన్ను.

సూ : ఒరేయ్ చంద్రం! మాస్టారు మట్టుకు మాస్టారు ఇన్ని బాధలుపడ్డా ముసల్ని మళ్ళీ ఆ ట్రయినింగుకే వెళ్ళమంటారుగా...ఈ మాస్టరీ చేసే వాళ్ళకి యిదోక జబ్బనుకుంటానురా. ఎదటి వాళ్ళుకూడా చాలీ చాలని జీతంతో తమకు మల్లేనే బాధ పడుతూంటే సంతోషిస్తారనుకుంటాను.

చం : ఏమైనా జీవించాలి అంటే డబ్బే ప్రధానమనుకుంటానన్నయ్యా!

గోపా: అహా! కాదు. జీవించాలి అంటే మీ పెద్దన్నయ్యలాంటివాళ్ళ వెనకాల ఉండడం చాలా అవసరం అంటాడు మీ చిన్నన్నయ్య.

సూ : (కోపంగా) బాబాయ్?

గోపా: నామీద కోపం యెందుకురా బాబాయ్? మీ అన్నయ్యలాంటి వాళ్ళుండగా నీకేం లోటు చెప్పు.

సూ : అంటే బాబాయి నన్నొక పెద్ద బడుద్ధాయి క్రింద కట్టేశావన్నమాట నీ దృష్టిలో. అర్థమైంది బాబాయి. ఒరేయ్ చంద్రం పెంచ లాడే ఏదో సంపాదనలో పడకపోతే చివరికి అన్నయ్య యింట్లోంచి అవతలికి పొమ్మంటాడేమో?

గోపా: వాడొక్కనాటి కనకు. అల్లా అంటే వీరు బాగే పడుదురు.

సూ : పోనీ బాబాయి. అన్నయ్యతో చెప్పి అనిపించడానికి ప్రయత్నం చెయ్యి బాబాయి.

చం : మళ్ళీ నన్ను చంపేస్తున్నారు. ఈ పజిలు యీ రాత్రి మెయిలుకి అందించాలి. ఇదొక్కటే పూర్తికావడంలేదు. జీవించాలీ అంటే ఒకళ్ళు డబ్బు అంటారు, ఒకళ్ళు నీతి అంటారు. ఒకళ్ళు మానాభిమానాలు వదిలెయ్యాలంటారు. అంతట్లోనే మళ్ళీ అన్నయ్యలాంటి వాళ్ళు ఉండాలంటారు. ఒకటే అర్థం కావడంలేదు నాకు. ఏది రాసి పంపాలో అంతకన్న తెలియడం లేదు. బుర్ర పాడయిపోతోంది. టైం కాస్తా హారతి కర్పూరంలా హరించిపోతోంది. ఈ పాటికి మెయిల్ వచ్చేస్తోంటుంది.

సూ : నువ్వేవీ అర్థం చేసికోకుండా వాగుతావురా చంద్రం. (పడక కుర్చీలో కూలబడతాడు)

చం : అర్థం చేసుకోవడానికేముంది అన్నయ్యా! భూమి గుండ్రంగా ఉండడంచేత ఏ విషయం మాట్లాడుకున్నా ఆఖరికి జీవించాలంటే అన్న సమస్య దగ్గరకేవచ్చి దాంతోటే అంతమవుతోంది. అరి వీడి తస్సా దియ్యా! ఈ పజిలులో ఈ సమస్య చాలాదూరం ఆలోచించే యిచ్చాడన్నయ్యా! అయితే యీ ఒక్క విషయంకోసం మన ముగ్గురి బుర్రలు ఖరాబు అవుతున్నాయి గనుక తేలే సారాంశం ఉంది చూశావు ... పజిల్ ఆల్ కరెక్టు సందేహం లేదు.

గోపా: ఒరేయ్ చంద్రం. ఎందుకొచ్చిన పజిల్సురా. ఆ పజిల్సు పెట్టినవాడు బ్రతుకు తెరువుకోసం పెట్టాడురా. అంటే...జీవించాలంటే?... అన్న సమస్యే వాడికీ యెదురై ఒక నిర్ధారణకొచ్చి యీ పజిల్సు పెట్టాడు. వాడి సమస్యని వాడు అతిసూక్ష్మంగా సాల్వ్ చేసికొని ఆ సమస్యని నీలాంటి వాళ్ల కంటగట్టి వాడు బాగానే జీవిస్తున్నాడు. ఆ మాత్రం నువ్వు గ్రహించలేక అందులోపడి కుడితి గోలెంలో పడ్డ ఎలకలా కొట్టుకుంటున్నావు. ఒరేయ్ చంద్రం ఈనాటి జీవితమే ఒక పజిలురా అబ్బాయి. వెనకటి జీవితానికి, ఇప్పటి జీవితానికి తేడా చాలా ఉంది. వెనక జీవించాలంటే... అన్న సమస్యేలేదు. ఈనాడది ప్రబలమైంది. అయితే యీనాటి జీవితంబాటలో ఒడుదుడుకులెక్కువ. ఎగ్గాడా పర్వత శిఖరాన్ని అందుకుంటాడు. ఓడి పోయాడా అధఃపాతాళ లోకంలో అడుగు పెట్టాడన్నమాటే... అబ్బాయి జీవితమే ఒక పజిలురా.

రఘు: (జంతిక తింటూవచ్చి) తాతయ్యా! ఇవెందుకో చెప్పుకో.

గోపా: నీ మొఖం? అదేం ప్రశ్నరా! అవి తినడానికిరా.

రఘు: కాదు తాతయ్యా! రేపు నా పుట్టిన రోజు.

గోపా: అల్లాగరా బాబు!...వెర్రి నాయనా...... ఈ కంట్రాక్టయినా రైటయి తగులాడలేదు. ఏదోవిధంగా కొంత డబ్బును తెద్దును. నీకు క్రొత్త బట్టలేనా కుట్టిద్దును.

రఘు: ఎందుకూ. మా నాన్న యీ సాయంత్రానికి ఎంత ప్రొద్దుపోయినా సరే కుట్టించుకొస్తానన్నాడుగా. లేకపోతే నాన్నగారిని యింటికే రానివ్వనని చెప్పేశానుగా. (వీధిలోకి వెళ్ళిపోతాడు.)

గోపా: ఏదీలే వాడుమాత్రం యేం కుట్టిస్తాడు. ఆ వచ్చే జీతం కాస్తా ఎన్నిటికొస్తుంది. అందరి దరిద్రాలు ఒక్కలాగే ఉన్నాయి.

సూ : అంతకన్న బాబాయి! దరిద్రులంతా ఒక్క చోటికే చేరారంటే బాగుంటుందేమో.

చం : అదికూడా కాదు అన్నాయ్. అన్నయ్య జీతంలో ఉన్న మహత్యమే అది. ఎన్నో అవసరాలు కనిపెట్టుకు కూర్చుంటాయి జీతాలొచ్చే రోజుకు.

గోపా: ఇంతకీ మన అవసరాలు అట్టా అనిపిసున్నాయి.

సూ : అంతే బాబాయి! ఇందులో ఇంకో విశేషం కూడా ఉందనుకుంటాను. అవసరాలు తీరుస్తున్న అన్నగారున్నాడు గనుక అవసరాలు ఎక్కువవుతున్నాయి అనుకుంటాను.

గోపా: ఏమాట కామాటే చెప్పుకోవాలి. తండ్రికి తమ్ముణ్ణయినా తండ్రిలాగే చూచుకుంటున్నాడు కేశవరావు.

# జీవించాలంటే....

చం : ఏదో విధంగా ఇవ్వాళ యీ పజిలు పంపించి తీరాలి.

సూ : పోస్టు టైం కొస్తా దాటిపోతే యెట్లా పంపుతావురా!

చం : కవరు లేట్ ఫీజు అంటించి మెయిలుకు అందిస్తాను.

సూ : మరి రూపాయి యెట్లా పంపుతావు?

చం : కవరులో రూపాయి నోటు పెట్టేస్తే సరి.

సూ : పోస్టల్ వాళ్ళకి అనుమానం తగిలి చూచారంటే అదొక పెద్ద కేసు.

గోపా: అవన్నీ వాడాలోచించే స్థితిలో లేడు. వాడి ఆదుర్దా అట్లా అనిపిస్తోంది.

చం : ఏమైనా పంపించి తీరాలి. పైగా ఏభై వేలు వస్తాయంటే ఎన్ని కేసులు పెట్టుకుంటేమాత్రమేం అన్నాయ్! అన్నయ్య తప్పకుండా యిస్తాడు రూపాయి. ఎందుకయినా మంచిది. వస్తున్నాడేమో చూస్తాను. (వీధిలోనికి నడుస్తాడు.)

సూ : స్కూలునుంచి అలా బజారుకు వెళ్ళి ఉంటాడు. లేకపోతే యింత ఆలస్యం యెందుకవుతుంది?

గోపా: రేపు రఘు పుట్టినరోజు కదు. బట్టలు కుట్టించడానికి వెళ్ళాడేమో.

చం : (లోనికి వస్తూ) ఎక్కడా జాడా జవాబు లేదు. అన్నయ్యకి ప్రొద్దుట జ్ఞాపకమేనా చేశాను గాను. తీరా ఆ జీతం కొస్తా బాకీలకి సర్దేసి చేతులాడించుకుంటూ రాడు గద.

సూ : ఎంత యిదయినా ఒక్క అర్ధరూపాయేనా ఉండకపోతుందా యేవిటి? తెల్లకాగితాలు కొని నాటకం ఫెయిర్ రాయడానికి.

చం : నీగోల నీది. ఒక్క రూపాయిచ్చాంటే సుందు నాకే యిస్తాడు. ఎంచేతనంటే ఈ పజిలు నెగ్గితే...నెగ్గితే ఏవిటి నా మొఖం...పంపితే నెగ్గావన్నమాటే...నెగ్గితే... ఏవిటి? ... ఏభై వేలు...ఒకటా రెండా. ఈ పూరంతా ఒక ఊపు ఊపొచ్చు.

గోపా: కాని అన్నయ్యదగ్గర కనీసం పావలాయేనా మిగలకపోదు.

చక్రి: (సరాసరి లోనికివచ్చి) ఏం బాబూ! కేశవరావుగారు యింకా రాలేదూ?

సూ : మాకన్న కంగారుగా ఉందే నీకు.

చం : మా అత్యవసరాల తాలూకు డబ్బులేనా ఆయన దగ్గర మిగులుతాయో లేదోనని మేమే అనుమానించి చస్తూంటే మధ్య నువ్వేవిటయ్యా!

చక్ర: అదికాదు బాబూ! ఈక్షణం దాటిపోతే యేవుంది. ఎంత పెద్ద ఉద్యోగస్థుడు దగ్గరైనా జీతాలు వచ్చినరోజున తప్ప మర్నాడు చిల్లి కాని ఉండదు. అల్లాంటిది బోర్డుస్కూలు మాష్టరు దగ్గర ఉంటుందా బాబూ! అదిగాక ఇందాక స్కూలుదగ్గర మీ అన్నయ్యగారు, కిరాణాకొట్టు సూరయ్యగారు, పుల్లల అడితీ ఎల్లయ్య ఏదో ఘర్షణ పడుతున్నారు.

సా : (లోపలినుండి కంగారుగావచ్చి) ఏవిటి బాబూ అది?

సౌభా: (వదినతో కూడా వచ్చి వింటూఉంటుంది.)

చక్ర: అబ్బే! కంగారు ఏవీ లేదమ్మా.

సా : మరి యెందుకు ఘర్షణ.

చక్ర: ఏవుందమ్మా! నా బాకీ చీదాగా యిస్తేనేగాని వదలనంటాడు కిరాణాకొట్టు సూరయ్యగారు. ఆరునెలలనుంచి యిట్లా తిప్పుతున్నారు. మొత్తం బాకీ యిస్తేనేగాని కదలనని ఎల్లయ్య కూర్చున్నాడు.

చం : అయితే జీతాలు వచ్చాయన్నమాటే.

సా : తరువాత యేం జరిగింద బాబూ!

చక్ర: ఏముంది జరగడానికి. పాపం కేశవరావుగారు ఏదో సర్ది చెబుతూంటే కిరాణాకొట్టు సూరయ్య ఎగిరెగిరి పడుతున్నాడు. అంత తీర్చలేనివాడవు నాదగ్గర చేబదులు ఎందుకు తీసుకున్నావు? అని ఏవేవిటో నోటికి వచ్చినట్లు వాగుతున్నాడు.

సా : (కళ్ళనీళ్ళు తిరిగాయి. తుడుచుకుంటోంది.)

సూ : వీడికేం పోయేకాలం. నా డిప్టమొచ్చినట్లు అణాకి బేడేసుకుని దొంగపద్దులు రాస్తాడు.

సా : సూర్యం! ఎందుకు నోరు పారేసుకుంటావు?

చక్ర: తరువాత నలుగురూ పోగయి ఆ కిరాణాకొట్టు సూరయ్యనే తిట్టారనుకోండి. పాపం కేశవరావుగారు యీ వూళ్ళో యిన్నాళ్ళనుంచి మాష్టరీ చేస్తున్నారన్నమాటేగాని ఎవ్వరితోనూ ఒక్క మాటపడి యెరగరేమో పాపం కళ్ళనీళ్లు పెట్టుకున్నారు.

సా : (ఏడుస్తుంది.)

సౌభా: ఊరుకో వదినా! ఏవిటది యింతమాత్రానికే. (తనకూ కళ్ళనీళ్ళు తిరిగితే తుడుచుకుంటోంది)

సా : (ఎవ్వరిముఖం చూడలేక లోపలి ప్రక్కకు తిరిగి) సూర్యం! అలా స్కూలుదగ్గరకు వెళ్ళి వస్తావా యేవిటి ఒకసారి.

సూ : ఇప్పటిదాకా స్కూలులో ఉంటాడా యేవిటి వదినా!

సా : ఏమో బాబూ! నాకు భయం వేస్తోంది. వెళ్ళేటప్పుడు రఘు క్రొత్తబట్టలు కుట్టించుకు రాక

పోతే యింటికి రానివ్వనన్నాడు కూడాను. ఏం బాధపడుతున్నారో.

గోపా: ఏం ఫరవాలేదమ్మా! స్కూలునుంచి అలా బజారుకు వెళ్ళుతుంటాడు. వాడే వస్తాడు

సా : (లోనికి వెళ్ళింది.)

సౌభా: (వదినతో కూడా లోనికి వెళ్ళింది.)

[క్షణం నిశ్శబ్దం]

చం : అన్యాయ్! జీతాలు రావటంమాత్రం సత్యం. ఒక్క రూపాయి అయినా మిగల్చకుండా వస్తాడంటావా అన్నయ్యా.

సూ : ఏమోరా బాబూ! నాకంతా అగమ్యగోచరంగా ఉందిరా బాబూ.

చం : ఏమండీ చక్రధరరావుగారూ! పరిచయం లేకపోయినా యిట్లా అడుగుతున్నానని ఏమీ అనుకోకండి. మీదగ్గర ఒక్క రూపాయి ఉంటే యిస్తారా? మా అన్నయ్య రాగానే తీసుకు యిచ్చేస్తాను. ఆమాత్రం మిగలకపోదులెండి మా అన్నయ్యదగ్గర.

చక్ర: నాదగ్గర ఏమీ లేదండి.

సూ : రూపాయిదాకా యెందుకుగాని ఒక అర్ధరూపాయి ఉంటే చూడండి.

చం : మళ్ళీ యింతట్లోనే నాకు నవ్వు పోటేయా, అంధ్రున్నానిపించావన్నయ్యా! చక్రధరరావుగారూ! అర్ధరూపాయి లేకపోయినా పావలా ఉన్నా చాలు. మా బాబాయి సైకిలు అద్దెకు తీసికొని వెళ్ళి కంట్రాక్టు రైటు చేసుకువస్తాడు. చూడండీ ఒక్క పావలాయేనా.

చక్ర: అసలు ఏమీ లేదు బాబూ నా దగ్గర. ఇవ్వాళ మీ అన్నయ్యగారు ఏమైనాయిస్తే పట్టుకు వెళ్ళాలి. బియ్యం కొనాలి. ఇవ్వాళ ప్రొద్దుటి నుంచీ మా యింట్లో అందరూ పస్తే బాబూ! సిగ్గువిడిచి చెబుతున్నాను.

చం : మరి జీతాలు రాగానే చూచేవాళ్ళవరూ యింక లేరన్నమాట మా అన్నయ్య తప్ప.

చక్ర: ఎవరికి కావాలి బాబూ! ఎక్కడికి వెళ్ళినా మీ సూర్యం అన్నయ్య అన్నట్టే అంటారు బాబూ. ఆ మహాతల్లి మీ వదినెగారు మళ్ళీ రమ్మనమన్నారని వచ్చాను గాని లేకపోతే రాను బాబూ...పిల్లలు ఆకలిబాధకు తాళలేక ఏడ్చేస్తున్నారు బాబూ! (కళ్ళనీళ్లు తిరిగాయి) చెప్పకపోవడమెందుకు. అప్పుడప్పుడు జీవితం మీద రోతపుడుతూ ఉంటుంది...ఒక్కొక్కప్పుడు యింత విషం తెచ్చి పిల్లలకి భార్యకు యిచ్చి నేనుకూడా పుచ్చుకుందామా అనిపిస్తుంది బాబూ! (ఏడుస్తూ) మొదట్లో అతనిమాట తీసెయ్యలేక ఆ చిన్న వేషం వెయ్యడంవల్ల ఇంత ముప్పువచ్చింది. అక్కడినుంచి పెరిగిన గౌరవమర్యాదల మాటున యిరుక్కుపోయాను. ఈవలికి రాలేక జీవితాన్ని నాశనం చేసుకున్నాను.

సూ : వచ్చాం పో. అందర్నీ ఒక్కచోటికి కూర్చాడురా భగవంతుడు.

సా : (లోపలినుంచి పళ్ళెంలో బియ్యం తెచ్చి మంచం క్రిందనున్న అరటికాయలు కూడా చేర్చి యిస్తూ) బాబూ! చక్రధరరావుగారూ! ముందు యీ బియ్యం అరటికాయలు మీ ఆవిడకిచ్చి వంటచేయించుకుని భోజనంచేసి సావకాశంగా రండి. మరేం ఫరవాలేదు. నేను చెబుతాలెండి మీరు వచ్చి వెళ్ళారని.

సౌభా: (లోనుంచి వచ్చి చక్రధరరావుగారిని చూస్తూ నిలుచుంది.)

చక్ర: (బియ్యం కూరలు తీసుకుంటూ) అమ్మా... (కన్నీళ్లతో) చివరకి నాస్థితి యీగతికివచ్చింది.

సా : అదేవన్నమాటలెండి. మన మధ్యతరగతి కుటుంబాలే అంత. మీరేం బాధపడక్కరలేదు. ఇంటింటాఉంది మంటిపొయ్యి. మా యింటాఉం— అనే సామెతగా మనమంతా ఒక్కమాదిరిగానే ఉన్నాము. మేము మాత్రం గడిచి గట్టెక్కామా? ఏరోజుకే స్థితి వస్తుందో ఎవరు చెప్పగలరు బాబూ!

చక్ర: (ఏడుస్తూ చెప్పలేక చెప్పలేక) సూరేటమ్మా... బతుకుతావమ్మా...పిల్లల ప్రాణాలు నిలబెట్టావు. వస్తానమ్మా...వస్తా సూర్యం బాబూ...(వెడతాడు.)

సా / సౌభా : (కళ్ళనీళ్ళు ఇద్దరూ ఒక్కసారే తుడుచుకున్నారు.)

సూ : గుమాస్తాపని చెయ్యలేడట పాపం...వదినలాంటివాళ్ళే యిట్లాంటివాళ్ళని సోమరిపోతులుగా తయారుచేస్తున్నారు.

సా : సూర్యం (కోపంగా) ఆ కళాపిపాసిలో రగులుతున్న అగ్నిపర్వతం నీ ఊహకుకూడా అందదు. అట్లాంటి ఆవేదనే క్షణకాలంలో ఆవేశంగా మారి ఆత్మహత్యకు వెనుదీయదు. గౌరవ మర్యాదల మధ్య, పరువు ప్రతిష్ఠలమధ్య నలిగిపోయే మధ్యతరగతి కుటుంబీకుని అవస్థ నీ హృదయపు టంచుల్ని కూడా తాకలేకపోతోంది. నువ్వేమీ అనుకోకుండా ఉంటే అందుకు కారణంకూడా చెబుతాను. మీ అవసరాలు తీర్చి అన్నగారు

ఉండటం మూలంగా అట్లాంటి కళాకారుని ఆవేదనను గ్రహించలేకపోతున్నావు. వయసొచ్చి కొద్దో గొప్పో విజ్ఞానం ఉండీ బాధ్యత అనే పదానికి అర్థం తెలిసికోలేకపోతున్నావు.

సూ : అంటే.

సా : ఎవరి బాధ్యతలు వారు గుర్తించాలి అన్న పదాన్ని అర్థం చేసికొందుకు ప్రయత్నించెయ్యి. (లోనికి వెడుతుంది. సౌభాగ్యం సూర్యంవంకే చూస్తూంటుంది. చంద్రం యథాప్రకారం కూర్చుని సూర్యంవంక చూస్తూంటాడు. సూర్యం పచార్లు చేస్తుంటాడు. క్షణకాలం నిశ్శబ్దం.)

సూ : ఒరేయ్ చంద్రం!

చం : (సూర్యంవంక చూస్తాడు.)

సూ : మాట్లాడవేరా!

చం : వినబడుతోందిగా.

సూ : ఇందాక నేను చెప్పినదానికి సరిపోయిందిగా- అంటే వదిన ఉద్దేశం...మన మొక్కటే బాగు పడిపోయి వాళ్ళ ఆయనకన్న యెక్కువ సంపాదించేస్తామోనని ... అర్థమౌతోందిగా వాళ్ళ ఆయనకు మల్లేనే ఆ బడిపంతులు పనిచేస్తూ ఆ నాలుగు గోడలమధ్య కుమిలిపోతూ చాలీ చాలని జీతంతో కాళ్ళీడ్చుకుంటూ ఘటాన్ని యింటికి చేరవేస్తే సంతోషించును వదిన.

సౌభా: చాల్లే అన్నయ్యా! ఇంక ఊరుకో. ఎవళ్ళైనా వింటేను నవ్విపోయేను. వదినను అంతవరకే అర్థం చేసుకున్నావన్నమాట.

సూ : ఏమిటి లేకపోతే ఎవరి బాధ్యతలు వారు అర్థం చేసికోవాలా?

చం : అవును అన్నాయ్! వదిన అన్నమాటల్లో ఏవీ తప్పులేదంటాను.

సూ : ఇంకేం డప్పుకొట్టుకుని చాటించరా.

చం : వదిన మంచితనం మనం చాటించకుండానే ఈ వూరివారందరికీ తెలుసు. వదినే గనక ఆదుకోక పోతే మన పరిస్థితి ఎట్లా ఉండేదో అని ఊళ్ళో వాళ్ళందరూ అంటూ ఉంటారు. అన్నయ్య మంచివాడయితే సరా యేమిటి? వదిన హృదయం మంచిది గనకనే మన ఆటలు సాగాయి. తల్లికన్న ఎక్కువగా చూస్తోంది.

సూ : అందుకని మాటలంటే యెవరు పడతారు.

గోపా: అదికాదురా సూర్యం...

సూ : నీవు తెలియదు బాబాయి. నువ్వూరుకో...ఎవరి బాధ్యతలు వారు అర్థంచేసికోవాలట. అంత విజ్ఞాన శూన్యులంగా లేము. మాకూ సంపాదించటం చేతనవును. ఈవిడ సొమ్మంతా పెట్టేస్తున్నట్లు మాట్లాడుతుందేం? చెల్లాయి! ఆవిడతో చెప్పు. మా అన్నయ్య సంపాదించింది మేము తింటున్నాంగాని ఈవిడ ఆస్తి మేమేం తినటం లేదని చెప్పు.

గోపా: ఒరేయ్ సూర్యం...

సూ : ఏమిటి బాబాయ్! ఈవిడే పెట్టి పోషిస్తున్నట్లు మాట్లాడుతుందేమిటి బాబాయ్! [illegible] చెల్లాయి చెప్పు ఆవిడతో.

సా : (లోనుంచి చంటిబిడ్డను పొత్తిళ్ళలో పెట్టుకుని వస్తూ) అవును. సౌభాగ్యం యెందుకు మధ్య చెప్పటం...అన్నీ నాకే వినిపించాయి. కాని సమయం వచ్చింది గనుక అడుగుతున్నాను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పు...రఘు తర్వాత పుట్టినబిడ్డకు ఒకనాడు పాలడబ్బా కొనడానికి కూడా డబ్బులులేక రాత్రి తెల్లవార్లూ పాల కోసం యేడ్చింది జ్ఞాపకం ఉందా? చివరకు జబ్బుచేస్తే డాక్టరు వ్రాసియిచ్చిన మాత్రలు కొనడానికి డబ్బులేకపోయింది జ్ఞాపకం ఉందా? నీవు (ఏడుస్తూ) ఆరాత్రి కడుపునొప్పితో బిడ్డ విలవిలతన్నుకుంది జ్ఞాపకం ఉందా? చివరకు వైద్యసహాయం లేక అంటే ఆ కడుపునొప్పికి మాత్రలు కొనలేకపోవటం మూలంగా తెల్లవారేసరికి బిడ్డ చేతుల్లోనే చచ్చిపోయింది జ్ఞాపకం ఉందా బాబూ సూర్యం? తరువాత యీ బిడ్డ పరిస్థితి యిల్లా ఉండటానికి కారణం యేమిటి? కనీసం పాలడబ్బాయేనా కొనగలుగుతున్నారా మీ అన్నయ్య? నేను యీ అతుకులగుడ్డ తప్ప రెండోగుడ్డ యెరుగుదునా? మీ అన్నయ్య ఆ రెండు పంచెలు ఆ రెండుచొక్కాలు తప్ప మూడోగుడ్డ యెరుగుదురా! దీనికంతకూ కారణం యేమిటి? మీ అన్నయ్య తెచ్చే జీతంతో నేను ఆయన నా బిడ్డలు బ్రతకలేకపోదుమా?

సూ : అయితే అంతా నేనే తినేస్తున్నానంటావా?

సా : మాటకుమాట బదులు చెప్పటమే ఘనతగా భావించకు. చిన్నప్పుడే మీ అమ్మగారు చచ్చిపోతూ మీ ముగ్గుర్ని నాకు అప్పగించారు. అప్పటి నుంచి మీ కెక్కడ లోటొస్తుందోనని మీ ముగ్గుర్ని నా బిడ్డలకన్న యెక్కువగా పెంచాను. మీ అన్నయ్యకూడా ఆ ఉద్దేశంతోనే తినో తినకో మీకు చదువుచెప్పించారు. ట్రైనింగుకు వెళ్ళమంటే ససేమిరా ఆ బడి పంతులు పని నేను చెయ్యనన్నావు. పోనీ అని పైకి చెప్పిస్తే ఇంటర్ ఫేలయ్యావు. చంద్రం మట్టుకు చంద్రం యస్. యస్. యల్. సి.

పొయ్యేదాయి నీపాటే నేర్చుకుని బడిపంతులు పని చెయ్యనన్నాడు. ఇద్దరూ గోళ్ళు గిల్లుకుంటూ యింట్లో కూర్చున్నారు. మీకూ రెక్కలొచ్చాయి. కేవలం చిన్నపిల్లలు కారు. మీరు కూడా కొద్దో గొప్పో సంపాదించి అన్నయ్యకి తోడుపడితే మన సంసారం ఎంత బాగుండును? నీ బాధ్యతను నువ్వు తెలుసుకోమన్నందుకు వదినను బాగా అర్థంచేసుకున్నావు. మీరు బాగుపడటం నా కిష్టంలేదని మాట్లాడుతున్నావు. ఇష్టం ఉందో లేదో ఆ భగవంతుడికే తెలుసు. (లోనికి వెళ్ళిపోతోంది.)

సూ : లేనిపోని బరువులన్నీ అన్నయ్య నెత్తిమీద పెట్టకోబట్టే యివ్వాళ యింత కష్టం అవుతోంది.

సా : (వెనక్కు తిరిగి) లేనిపోని బరువులంటే నీ కళ్ళకు కనిపించేది సౌభాగ్యం...అంతేగా... నువ్వు దండయాత్ర సలిపేది సౌభాగ్యంమీద. మాట్లాడితే విడాకు లిప్పించి మళ్ళీ పెళ్ళి చెయ్యమంటావు. నీకు చేతనయింది అదేగా. అది మన సంప్రదాయానికే విరుద్ధం. ఏమో అతని పరిస్థితులు బాగుపడకూడదా! సౌభాగ్యాన్ని మళ్ళీ తీసుకువెళ్ళకూడదా? అంత మాత్రాన్ని కన్నబిడ్డమాదిరిగా పెంచుకున్న సౌభాగ్యాన్ని ఆవేశంతో హృదయాన్ని యొక్కడో తాకట్టుపెట్టి చేతులారా బయటికి గెంటలేను. ఇంక పోతే మీ బాబాయి జీవిత చరిత్ర తెలుసుకుంటే ఇట్లా లేనిపోని బరువు అన్నమాట అనలేవు. మీ నాన్నగారు మీ బాబాయి శరీరాలు వేరుగాని ఆత్మలు ఒకటే. మీ బాబాయి సర్వం మీకోసమే త్యాగం చేశారు. ఇప్పుడాయన్ని ఆదరించడం మీ అన్నయ్య కనీస ధర్మం...ఇప్పటికైనా నువ్వు, చంద్రం మీ బాధ్యతలేవిటో గ్రహించడం చాలా అవసరం. లోనికి బిడ్డను తీసుకువెళుతుంది.

సౌభా: అన్నయ్యా! తల్లిలాంటి వదిన మనస్సు అనవసరంగా కష్టపెట్టావు.

సూ : నోర్ముయ్యి నువ్వు.

సౌభా: నన్ను నువ్వు నోర్ముయ్యమన్నా ఒక కడుపున బుట్టాం గనక పెద్దన్నయ్య మంచిచెడ్డలు ఆలోచించవలసిన బాధ్యత మీ యిద్దరిమీదా ఉందని చెప్పడానికి ఏవీ జంకడను. అన్నయ్య పడే బాధ మీ కిద్దరికీ తెలియడంలేదు. ప్రొద్దుట ఏం వెళతాడో రాత్రి తొమ్మిదిగంటలవరకు రాడు గద. బడి. బడి వదిలిపెడితే ప్రయివేట్లు. ఇంత కష్టపడ్డా అప్పులవాళ్ళతో మాటలు తప్పడం లేదు. మీ రిద్దరూకూడా ఉద్యోగంచేసి అన్నయ్యకు కాస్త సహాయపడితే......

సూ : చాలులే. ఇంకేం చెప్పక్కరలేదు. నువ్వీ కొంపలో అడుగెట్టాకే అన్నయ్యకి బాధలు యెక్కువయ్యాయి.

సౌభా: నేను రాకముందు అన్నయ్యకీ బాధలు లేవన్నమాట.

సూ : లేవు సరికదా వదిన యెప్పుడూ మాపట్ల యింత కఠినంగా ప్రవర్తించలేదు. నీమీద కోపం మామీద చూపిస్తోంది వదిన. నిన్ను మీ ఆయన వదిలేశాడని యేమీ అనలేక మమ్మల్ని అంటోంది. లేకపోతే యివ్వాళే కూర్చున్నామా మేమిట్లాగ?

సౌభా: (కన్నీళ్ళతో) ఇదంతా నిజంగా నా తలనే అంటావా అన్నాయ్!

సూ : మహార్తటికే. చచ్చినా బ్రతికినా నీ మొగుడి దగ్గరే నువ్వుండటం న్యాయంకాని వెళ్ళమన్నాడు కదా అని పరుగెత్తుకురావడమే పుట్టింటికి! ఈ కరువురోజుల్లో ఆ మనిషి కా మనిషి యెంత బరువో తెలుసుకోలేకపోయావు. ఆయనకేం కులాసాగా కూర్చొని మంచీచెడ్డా లేకుండా ఇవతల వాళ్ళ బాధలు తెలుసుకోకుండా ఇక్కడికి పంపేసి ఊరుకున్నాడు.

సౌభా: అన్నయ్యా! ఆయన్నేమీ అనొద్దని నీకు యిందాకే చెప్పాను.

సూ : ఎందుకే ఆ పౌరుషం? అంత పౌరుషమున్నదానవు ఇక్కడికెందుకు రావడం? అక్కడే చావకపోయావా?

సౌభా: (ఏడుస్తూ) అవును. పెట్టిపొయ్యాని నీకే యింత బరువై పోతే అన్నయ్యకెంత బాధగా ఉంటుందో! పుట్టింటాళ్ళ వసులులో లేక కష్టసమయంలో తోడు నీడ అన్నారుగదా అనుకుని వచ్చానేగాని ప్రశాంతంగా ఉన్న మీ జీవితాల్లో మీ వదినా మరుదుల మధ్య కలహాలు రేకెత్తిస్తానని అనుకోలేదు అన్నయ్యా! అన్నీ నావల్ల పొరబాట్లే. క్షమించగలిగిన ఓపిక నీకు భగవంతుడిస్తే క్షమించు అన్నయ్యా! ఎక్కడుండవలసినవాళ్ళు అక్కడ ఉండాలిగాని పరిస్థితులు బాగుండలేదుకదా అని యిక్కడకు రావడం పొరబాటే అన్నయ్యా! (ఏడుస్తుంది.)

చం : (కళ్ళనీళ్ళు తిరిగితే, తుడుచుకుంటున్నాడు.)

సూ : (కళ్ళనీళ్ళు తిరిగాయి) ఎందుకు అనవసరంగా యేడుస్తావు? నీమూలంగా యేడవవలసినవాళ్ళం మేము. లేనిపోని అపవాదులుకూడా వస్తు

న్నాయి. మేము నలుగురిలోను తలెత్తుకు తిరగ లేము.

సౌభా: అవును. చూస్తూ చూస్తూ సక్కూ ప్రాణాన్ని పొగొట్టుకోలేకపోయాను. (ఏడుస్తుంది.)

సూ : (ఏడుస్తూనే) ఇక్కడికి గాకుండా అక్కడే చచ్చిపోయినా ఒక్క యేడుపు యేడ్చి ఊరుకుందుము.

సా : (వస్తూ) సూర్యం! నీకిది రెండోసారి చెప్పడం. నన్నెన్నన్నా పడతానుగాని సౌభాగ్యాన్ని పల్లెత్తుమాటంటే సహించను. మాకులేని బరువు నీకెందుకు? అసలు దాని జీవితాన్ని అర్థంచేసుకోకుండా కత్తులు కట్టకు. సౌభాగ్యం, లోపలికి నడు.

సౌభా: వదినా! ఒక్కసారి అందరికీ బరువైపోయాను వదినా. (వదిన చేతుల్లో ముఖందాచుకు వెక్కి వెక్కి యేడుస్తుంది.)

సూ : ఇంకా నింపాదిగా అంటున్నావా బరువై పోయానని. ప్రెసిడెంటుగారి పెళ్ళాం అన్న మాటలు అన్నయ్య వింటే యేంకాను. సరి బెట్టుకు చచ్చిపోతాడు గాని...

సా : సూర్యం...ఏం మాటలవి నింపింట్లో. అంత కంతకు ఆవేశం యెక్కువైపోయి నోటికెంత వస్తే అంతా అనేస్తున్నావు!

సూ : అవును వదినా! (ఏడుస్తూ) ఇల్లాంటిమాటలు అన్నయ్య చెవినిబడితే యింకేమన్నా ఉందా.

సౌభా: ఆమాట నిజమే వదినా. నేను బ్రతకడం అనవసరం వదినా! (ముఖం మూసుకు ఏడుస్తుంది.)

సా : ఎందుకమ్మా! ఏడుస్తావు. వదిన చచ్చిపోయిందనుకున్నావా?

సౌభా: ఆ మాటనకు వదినా! నేను చచ్చిపోయినా యెవరికీ బాధకలగదుగాని నువ్వు చచ్చిపోతే మా అందరి బ్రతుకులు బజారుపాలే వదినా! తల్లికన్న యెక్కువగా సాకావు. నీ ఋణం మే మెన్నిజన్మలకీ తీర్చుకోలేం వదినా. (ఏడుస్తుంది.)

సా : ఏడవకు. వదిన బ్రతికుండగా నీ కేలోటూ రాదు. నడు లోపలికి. మూడేళ్ళ పిల్లవు. నా చేతులతో పెంచాను. నాకు బరువవుతావా తల్లీ..(సౌభాగ్యాన్ని తీసుకు లోనికివెడుతుంది.)

చం : ఏమిటన్నయ్యా! ఇవ్వాళ యిట్లాఅయిపోయావు?

సూ : (మాట్లాడలేడు. తదేకదృష్టిలో ఉంటాడు.)

చం : అదికాదు అన్నయ్యా! నువ్వు నన్ను తిట్టినా సరేగాని వదిన చెప్పినదాంట్లో ఏమైనా అబద్ధం ఉందంటావా? ఆనాటిరాత్రి పాలడబ్బా లేనందుకు అన్నయ్య యెంత యేడ్చాడో జ్ఞాపకం ఉందా? డబ్బులు ఏవిధంగానూ సంపాదించలేక రాత్రికి రాత్రి చిత్తుకాగితాలన్నీ అమ్మి పాల డబ్బా కొనడానికి ప్రయత్నించావు జ్ఞాపకం లేదూ? బిడ్డకి మాత్రలు కొనడానికి ముప్పావలా లేకపోతే అన్నయ్య తనకున్న పంచె చొక్కా తీసుకువెళ్ళి మనకు తెలియకుండా పాతగుడ్డలు కొనేవాళ్ళకి అమ్మి ఒక రూపాయి తెచ్చేసరికి ఆ బిడ్డ చచ్చిపోయింది జ్ఞాపకంలేదూ! వదిన చెప్పినట్లు అన్నయ్య తెచ్చుకునే జీతంతో వాళ్ళు సుఖంగా బ్రతకకపోదురా...మనకోసం వాళ్ళెంత కష్టపడుతున్నారో గ్రహించలేవా అన్నయ్యా! వాళ్ళ సుఖాన్ని కించితయినా చూచుకుంటున్నారా? కొంచెమేనా దూరం ఆలోచించకపోతే ఎట్లా అన్నాయ్!

సా : (వస్తూ కోపంగానే) చంద్రం! ఏమిటిది?

చం : ఏమీ లేదు వదినా!

సా : నాకు బాబూ! రఘు ఎక్కడికి వెళ్ళాడో తీసుకురా.

చం : వెడతా వదినా. (వీధిలోనికి వెడతాడు.)

సా : (లోనికి వెడుతుంది.)

సూ : (వీధివైపునకు తిరిగి నిలుచున్నాడు. కొంచెం హృదయం కదిలింది. కళ్ళనీళ్ళు తిరుగుతున్నాయి.)

గోపా: బాబూ సూర్యం! ఆవేశం యెంత ఉంటే అంతా చూపించేస్తే యెట్లా చెప్పు బాబూ! అనవసరంగా అటు వదిన మనస్సుకు, ఇటు చెల్లాయి మనస్సుకు కష్టం కలిగించావురా... మీ వదినలాంటి యిల్లాలు యీ భూమిమీద ఉందంటావా బాబూ! మీకోసం అష్టకష్టాలు పడ్డసంగతి మరచిపోయావా బాబూ! తల్లి లేని పిల్లల్ని సాకి యింతవాళ్ళనిచేసిన వదిన చరిత్రలో ఎక్కడేనా కనిపిస్తుందా! అన్నిటిమాట అలా వదిలెయ్యి. ఇన్ని విషయాలు నీకు జ్ఞాపకం చేసిందిగాని ఒక్క విషయం జ్ఞాపకం చేసిందేమో చూడు. నీకు టైఫాయిడ్ జ్వరం వస్తే మందులకి డబ్బులేకపోతే తన మంగళ సూత్రాలు అమ్మి......

సూ : (ఏడుస్తాడు.)

సా : (గోపాలరావు మాటలోనే వచ్చి) మావగారూ!

గోపా: ఏమమ్మా!

సా : నా మనస్సేం బాగుండటంలేదు. ఇంతవరకూ మీ అబ్బాయి రాలేదు. మీ రొక్కసారి ఆ బడి దగ్గరకు వెళ్ళి చూడండి.

గోపా: ఫరవాలేదమ్మా! పిచ్చితల్లీ! వచ్చేస్తాడమ్మా అబ్బాయి.

సా : ఏదో ఆందోళనగా ఉంది. ఒక్కసారి వెళ్ళి రాకూడదూ.

గోపా: వెడతానమ్మా. (వీధిలోనికి వెడతాడు.)

సా : (లోనికి వెడుతుంది.)

సూ : (క్షణం సేపటికి వెనక్కు తిరిగి స్టేజీ యీ చివర కంటా వచ్చి ఒకసారి లోపలికి చూచి చరచర వీధిలోనికి వెడతాడు.)

సా : (లోనుంచి సూర్యం వెడుతూండగానే వచ్చి) సూర్యం!

సూ : (వీధిలోనుంచే) ఎందుకు వదినా!

సా : ఇలాగా!

సూ : (తలవంచుకునే వస్తాడు.)

సా : ఎక్కడికి వెడుతున్నావు?

సూ : మనస్సేమీ బాగుండటంలేదు వదినా! కాస్సేపు అల్లా తిరిగి వస్తాను.

సా : బాబూ! (ఏడుస్తూ) నీ మనస్సును కష్టపెట్టాను. పాపిష్టిదాన్ని. ఇవ్వాళ లేచిన వేళావిశేషం ఏమిటో గాని ... నిన్ను అనవసరంగా బాధపెట్టాను కదూ.

సూ : (ఏడుపు దిగమింగుతూ) లేదు వదినా! నీముఖం చూడలేను వదినా!...నన్ను కాస్సేపు ఎక్కడికేనా పోనియ్యి వదినా!

సా : నువ్వు వెళ్ళడానికి వీలులేదు సూర్యం, నువ్వు పట్టి ఆవేశపరుడవు. వెడితే ప్రెసిడెంటుగారితో దెబ్బలాట పెట్టుకుంటావు. ఎందుకో నా కుడి కన్ను అదురుతోంది. నాకేదో భయంగా ఉంది. నువ్వెక్కడికీ వెళ్ళవద్దు.

సూ : నిన్ను అష్టమైన మాటలు అని అనవసరంగా కష్టపెట్టాను వదినా...

సా : లేదు బాబూ! నేను కష్టపెట్టుకుంటానా? కష్టపెట్టుకునేదాన్నయితే మిమ్మల్ని పెంచగలనా? నా చేతుల్తో పెంచిన బిడ్డలమీద నాకు కోపం ఉంటుందా చెప్పు బాబూ! నిన్ను బ్రతిమాలుకుంటాను నువ్వెక్కడికీ వెళ్ళొద్దు.

సూ : కాదు వదినా! అన్నయ్యకోసం వెడతాను వదినా!

సా : అక్కర్లేదు. మీ బాబాయి వెళ్ళారుగా...ఇల్లు చూడు ... నా మీద ఒట్టు వేసికొని చెప్పు బాబూ! ఈరోజు మొదలుకొని ఎప్పుడూ సౌభాగ్యాన్ని ఏమీ అనవని చెప్పు బాబూ! అసలే కుళ్ళిపోతోంది. నీ మాటలతో మరీ యేడుస్తోంది. ఊరుకోబెట్టేసరికి నా పెద్దలు దిగొస్తున్నారు.

సూ : అల్లాగేలే వదినా! దానికిమాత్రం యేం తెలుసు. అన్నయ్య యీ సంసారాన్ని భరించలేక అష్టమైన బాధలు పడుతున్నాడన్న ఆవేదనలో ఏదేదో అనేశాను. దాని మనసుని క్షోభపెట్టాను...నువ్వు చెప్పినట్లు ఏ ఉద్యోగమేనా చేసుకుని తొందరలో అన్నయ్యకు సాయపడటం మంచిదనుకుంటాను వదినా! లేకపోతే అప్పులవాళ్ళబాధలు ఎక్కువైపోయి అన్నయ్య ఏ అఘాయిత్యానికేనా...

సా : బాబూ...

సూ : స్కూలువిడిచి చాలాసేపయినట్లుంది. ఇంకా రాలేదన్నయ్య.

సా : చూచొస్తానని వెళ్ళిన మీ బాబాయి కూడా యింకా రాలేదు.

సూ : రఘు బట్టలకోసం పేచీ పెట్టాడన్నావుగా. రెడీమేడ్ షాపులో బట్టలు కొనుక్కురావడానికి వెళ్లాడేమో.

సా : ఏ బాకీ తీర్చకపోతే యెవ్వరూరుకుంటారు బాబూ! క్రొత్తబట్టలు ఎల్లా తెస్తారు. లేకపోతే మిమ్మల్ని యింటికే రానివ్వనన్నాడు షేడీల్ని రఘు మీ అన్నయ్యని. ఆ మాటకు ఏం బాధపడుతున్నారో.

సూ : వాడికేం తెలుసు వదినా! కుర్రాడు.

సా : రఘుకోసం వెళ్ళిన చంద్రంకూడా అక్కడే ఉండిపోయాడే. ఆటలకి వెడతానంటాడు రఘు. ఎవళ్ళతో ఏం పేచీలు తెచ్చిపెడతాడోనని నా భయం.

సూ : ఫరవాలేదు వదినా! చంద్రం తీసుకువస్తాడు.

[వీధిలో] పోస్టు!

సూ : (వీధిలోనికివెళ్ళి ఉత్తరం తెస్తూ) బావదగ్గర్నుంచి వదినా!

# జీవించాలంటే...

సా : నిజంగా.

సూ : నిజంగానే వదినా!

సా : ఎన్నాళ్ళకి (లోపలికి చూసి) సౌభాగ్యం... (సూర్యంతో) చదువు బాబూ యేం రాశాడో మీ బావ... ఇప్పటికైనా దాని కష్టాలు గట్టెక్కా యేమో.

[చంద్రం, రఘు వస్తారు.]

చం : ఎక్కడినుంచి అన్నయ్య కవరు?

సూ : బావదగ్గిర్నుంచిరా.

చం : బావదగ్గిర్నుంచే ... ఇంకేం ... అక్కయ్యని మద్రాసు తీసుకెళతాడు బావ... అంతే. నాకు తెలుసు. నేనూ వెళతాను మద్రాసు.

రఘు: అత్తయ్యతో నేనూ వెళతానే అమ్మా!

సా : అలాగేలే. చదువు బాబూ సూర్యం!

సూ : (చదువుతాడు).

ప్రియమైన కేశవరావు బావగారికి మీ బావమరిది ఉమామహేశ్వరరావు వ్రాయునది. నేనింతకాలంవరకు మీకు జాబు వ్రాయడానికి కూడా సిగ్గుపడ్డాను. నేను యీ సినీఫీల్డులో పైకి వచ్చేవరకు మీకు నా జాడ జవాబు తెలియకూడదనే నా సంకల్పం నేటికి నెరవేరింది. నేను నిష్కాం రమా పిక్చర్స్ అనే సంస్థలో నెలకి నాలుగువందల రూపాయల జీతంమీద రివాయితగా కుదిరాను. ఒక చిన్న యిల్లు అద్దెకు తీసుకున్నాను. వచ్చే ఏకాదశి బుధవారం మీ చెల్లెలు సౌభాగ్యాన్ని యిక్కడికి తీసుకురావడానికి బావుందని చెప్పారు. నేను సోమవారం బయలుదేరి వస్తున్నాను. మీ చెల్లెల్ని పంపడానికి సిద్ధంచేస్తారని ఆశిస్తాను.

ఇట్లు
ఉమామహేశ్వర్.

సా : (ఆనందంతో) అమ్మా! సౌభాగ్యం! నీకష్టాలు గట్టెక్కాయమ్మా! సౌభాగ్యం (లోనికివెళ్ళి సౌభాగ్యం సౌభాగ్యం అంటోంది.)

చం : బావ నెగ్గించుకున్నాడు మొత్తంమీద.

సూ : బావ పట్టుమాట వింటానన్నా అన్నయ్యభారం కొంత తగ్గించింది సౌభాగ్యం. (గోపాలరావు, చక్రధరరావు వగర్చుకుంటూ వచ్చారు.)

చక్రధర, గోపా : అమ్మా! బాబూ సూర్యం! ఘోరం!

సా : ఏమిటి మావగారూ!

గోపా: ఏముందమ్మా కేశవ యీ చీటీ వ్రాసి (సావిత్రికిస్తూ) డ్రాయరుమీద పెట్టి ఆ ముక్కాలు గదిలోనే ఉరిపోసుకు చచ్చిపోయాడు.

సా : (చేతిలో కాగితం చేతిలోనే ఉంది. కెవ్వున కేక పెట్టి శిలాప్రతిమలా నిలబడింది.)

రఘు: అమ్మా! (అని కావిలించుకున్నాడు.)

సూ, చం, సౌభా : (అన్నాయ్ అంటూ చక్రధరరావుతో పరుగెత్తారు. అన్నిలైట్లు ఆరిపోతాయి. కనురెప్పలు కూడా వాల్చకుండా కన్నీరుకారుస్తూ శిలాప్రతిమవలెనున్న సావిత్రిముఖంపై స్పాటులైటు పడుతుంది. తెరలో ఉత్తరం కేశవరావు గొంతుతో చదవడం వినబడుతుంది.)

సావిత్రీ! నిన్ను పెళ్లాడానన్న మాటేగాని ఒక్కనాడు సుఖపెట్టలేకపోయాను. అప్పులవాళ్ళు యీనాడు అవమానపుమాటలన్నారు. బడిపంతులు అందరికీ లోకువేనని యీనాడు అర్థమైంది. రేపు రఘు పుట్టినరోజు, క్రొత్తబట్టలు కుట్టించలేకపోయాను. సూర్యం అర్ధరూపాయి అడిగాడు. ఇవ్వలేకపోయాను. ఎప్పుడూ ఏదీ అడగని రఘు ఈరోజున క్రొత్తబట్టలకోసం పేచీ పెట్టినందుకేనా కుట్టించలేని అసమర్థుణ్ణి. రఘు చెప్పినట్లు యింటికిరావడం యిష్టంలేకే, ఏ ఉద్యోగానికి నా జీవితాన్ని అంకితం చేశానో, ఆ ఉద్యోగంలో ఎదుగూ బొదుగూ లేక ఎప్పుడు చూచినా గొర్రెకు బెత్తెడు తోకే అన్నట్లు నా జీవితాన్ని నాశనంచేసి నన్ను పీల్చి పిప్పి చేసిన యీ బడిలో యీ నాలుగు గోడలమధ్య నా జీవితాన్ని అంతం చేసుకుంటున్నా. పగవాడికేనా యీ బడిపంతులు ఉద్యోగం వద్దని చనిపోయేటప్పుడు భగవంతుని ప్రార్థిస్తున్నా. నిన్ను ఒక్కక్షణమైనా సుఖపెట్టని నిర్భాగ్యుణ్ణి చనిపోయేముందు నీకేం సందేశమివ్వగలను. సర్వం నీకే తెలుసు.

'కేశవ.'

(స్పాట్ లైటుకూడా ఆరిపోతుంది. చీకట్లో తెరజారుతుంది.)

[సమాప్తం.]

# నాగార్జునమతం ఔపనిషదమే!

శ్రీ హారీత శివశర్మ

బౌద్ధం ఎప్పుడు పుట్టింది? ఇది చరిత్రకారులు తేల్చవలసిన సంగతి. అయితే గౌతమబుద్ధునికి ముందు బౌద్ధం అంటూ ఒక మతం వున్నదన్న సంగతి మాత్రం నిర్వివాదమైన విషయం. సూత్రపిటకదీర్ఘనికాయంలో మహాపదానసూత్రాంతంలో బుద్ధుడైన సిద్ధార్థ శాక్యుడు చెప్పినట్లు ఒక కథ వుంది. అందులో గౌతముడు తనకుముందు బౌద్ధధర్మాన్ని ప్రపంచించిన కొందరు బుద్ధుల ఆపదానము లేక అవదానములను తన శిష్యులకు తెలియజేస్తాడు. అయితే ఆ బౌద్ధంస్వరూపం ఎట్లావుండేదో మాత్రం మనకు తెలియదు. భాగవతంలో "నగ్నవేషములు కలుగు జైనులు, ధూరికాషాయ వస్త్రంబులు ధరియించు బౌద్ధులు, జటాస్థిభస్మధారులగు కాపాలికుల" ప్రసక్తివుంది. భాగవతంలో ఈ సంగతిని గౌతమబుద్ధునికి ఈవల ఎవరో ప్రక్షిప్తంచేశారని వాదించినా, గౌతమబుద్ధునికి ముందే బౌద్ధం అంటూ ఒకటి వున్నదని చెప్పడానికి ఉపపత్తులు లేకపోలేదు. శ్రీ రాయప్రోలు లింగనసోమయాజిగారు వ్రాసిన కళ్యాణకౌముది అనే గ్రంథానికి తొలిపలుకుపలుకుతూ పండిత ప్రవరులైన శ్రీ శివరామశాస్త్రిగారు ఇట్లా వ్రాస్తున్నారు. "మహావీరునికంటెను, గౌతమబుద్ధునికంటెను, పూర్వము బౌద్ధము కలదు. గౌతమబుద్ధునికి పూర్వము ఇరువదిఇరువురు బుద్ధులు గతించినట్లు బౌద్ధగ్రంథములు చెప్పును. మరియు ఇరువదినాలుగవ మైత్రేయబుద్ధుడవతరించగలడని జాతకకథలలో చదువుదుము. వ్యాససమకాలికుడు క్రకుచ్ఛందుడను బుద్ధుడున్నట్లు లంకావతార సూత్రాలయందు కలదు. ఈ రీతిగనే ఋషభుడాదిగా ఇరువదిమువ్వురు తీర్థంకరులపిదప మహావీరుడు. బ్రహ్మసూత్రములు, ఈ ప్రాచీన జైనబౌద్ధ దర్శనములను ఖండించును...మరియు తత్త్వసంగ్రహమున శాంతరక్షితుడు ప్రాచీన బౌద్ధమునకు వేదమే ప్రమాణమని వ్రాసెను."

శ్రీ శాస్త్రిగారి ఈ వాక్యాలవల్ల రెండు సంగతులు తెలుస్తున్నాయి. (1) గౌతమ బుద్ధునికి పూర్వం బౌద్ధం వుంది. (2) ఆ బౌద్ధమునకు శ్రుతి అంటే వేదము మూలము. కాగా గౌతమబుద్ధుడు ఇందులో తెచ్చిన విప్లవము, దానిని, వేదమునకు దూరము చేయుట, అవైదికము చేయుట. ఇది భారతదేశ తత్త్వశాస్త్రచరిత్రలో కొత్తవిషయము కాదు. వేదకాలంలో కూడా వేద ప్రమాణాన్ని అంగీకరించనివారు వున్నట్లు చరిత్ర కారులు చెబుతూనే వున్నారు. పైగా ఇటీవలి కాలంలో వీరశైవమతస్థాపకుడైన బండారు బసవదండనాయకుడు కూడా శైవ మతాన్ని అవైదికంచేసి నెలకొల్పిన ఉదాహరణలు వున్నాయి. బౌద్ధంలో శాక్యబుద్ధుడు తెచ్చిన మార్పు ఇటువంటిది.

బౌద్ధాన్ని అగ్రాలంచేసి గౌతమబుద్ధుడు చెప్పిన ధర్మస్వరూపం ఎటువంటిది? దాని తత్త్వం ఏమిటి? ఈ మొదలైన ప్రశ్నలను వారు వీరు వ్రాసిన గ్రంథాలలోంచి గాక సూటిగా పిటకాల్లోంచే గౌతముడు చెప్పిన మాటలనే ఉట్టంకించడం ఉచితం. గనుక, వినయ పిటక మహావగ్గంలోంచి (మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్ వారి హిందీఅనువాదం.) ధర్మచక్రప్రవర్తన విభాగాన్ని ఇక్కడ ఉట్టంకిస్తున్నాను: "భిక్షుఓ! సాధుకే! యహ్ దో అతియాం సేవన్ నహీ కర్నీ చాహియే! కౌన్సే హో? జో యహ్ కామ్, గ్రామ్య, అనాడీ మనుష్యోంకే (యోగ్య), అనార్య (-సేవిత్), అనర్థోంసే యుక్త్ కామవాసనాఓంమే లిప్త్ హోనా హై; ఔర్ జో దుఃఖ్ (-మయ), అనార్య—(సేవిత్)అనర్థోంసే యుక్త్ ఆత్మపీడా మే లగనా హై! ఇన్ దోనోం హీ అతియోంమే నజాకర్ తథాగత్ నే మధ్యమమార్గ్ ఖోజ్ నికాలా హై, (జోకి)ఆంఖ్—దేనేవాలా, జ్ఞాన్-కరానేవాలా శాంతికేలియే, అభిజ్ఞానకేలియే, పరిపూర్ణ జ్ఞాన్ కేలియే ఔర్ నిర్వాణ్ కేలియే హై॥యహ్ కౌన్‌సా మధ్యమ్ మార్గ్ (మధ్యమ ప్రతిపదం అని అర్థం) తథాగత్ నే ఖోజ్ నికాలా హై; (జోకి) వహ్ యహీ ఆర్యఅష్టాంగిక మార్గ్ హై; జైసేకి—ఠీక్ దృష్టి, ఠీక్ సంకల్ప, ఠీక్ వచన్, ఠీక్ కర్మ, ఠీక్ జీవికా, ఠీక్ ప్రయత్న, ఠీక్ స్మృతి, ఠీక్ సమాధి యహ్‌హై భిక్షుఓ మధ్యమ్ మార్గ్ (జిస్ కో).

## నాగార్జునమతం ఔపనిషదమే

"యహ్ భిక్షుఓ! దుఃఖ్ ఆర్య (=ఉత్తమ్) సత్య్ హై,—జన్మ్ భీ దుఃఖ్ హై, జరా భీ దుఃఖ్ హై, వ్యాధి భీ దుఃఖ్ హై, మరణ్ భీ దుఃఖ్ హై, అప్రియోం కా సంయోగ్ దుఃఖ్ హై, ప్రియోం కా వియోగ్ భీ దుఃఖ్ హై, ఇచ్ఛా కరనే పర్ కిసీ (చీజ్) కా నహీ మిల్నా భీ దుఃఖ్ హై, సంక్షేప్ మే సారే భౌతిక్ అభౌతిక్ పదార్థ్ (పాంచ్ ఉపాదానస్కంధ్)హీ దుఃఖ్ హై; భిక్షుఓ దుఃఖ్-సముదయ (=దుఃఖ్ కారణ్) ఆర్యసత్య్ హై, యహ్ జో తృష్ణా హై—ఫిర్ జన్మ్ దేనే కీ, ఖుశ్ హోనే కీ, రాగ్—సహిత్ జహా తహా ప్రసన్న హోనే కీ—జైసే కి—కామతృష్ణా, భవ (జన్మ్) తృష్ణా, విభవతృష్ణా భిక్షుఓ! యహ్ హై దుఃఖ్ నిరోధ్ ఆర్యసత్య; జో కి ఉసీ తృష్ణా కా సర్వథా విరక్త్ హో, నిరోధ్ =త్యాగ్ =ప్రతినిస్సర్గ్ =ముక్తి-నిలీన్ హోనా, భిక్షుఓ! యహ్ హై దుఃఖ్ నిరోధ్ కి ఓర్ జానేవాలా మార్గ్ (దుఃఖ—నిరోధ—గామినీ ప్రతిపద్) ఆర్య సత్య్; యహ్ ఆర్య అష్టాంగిక్ మార్గ్ హై,.......భిక్షుఓ! జబ్ తక్ కి ఇన్ చార్ ఆర్యసత్యోం కా ఉపరోక్త్ ప్రకార్ సే యథార్థ్ శుద్ధ జ్ఞాన్ దర్శన్ నహుఆ; తబ్ తక్ భిక్షుఓ! మై నే యహ్ దావా నహీ కియా - దేవో౦ సహిత, మార్ సహిత్, బ్రహ్మా సహిత్, (సభీ) లోక్ మే, దేవ్-మనుష్య-సహిత్, సాధు-బ్రాహ్మణ్-సహిత్, (సభీ) ప్రాణియోం మే అనుపమ్, పరమ్ జ్ఞాన్ కో మై నే జాన్ లియా! భిక్షుఓ! జబ్ ఇన్ చార్ కా ఆర్యసత్యోం కా (ఉపరోక్త్) ప్రకార్ సే...శుద్ధ్ జ్ఞాన్ దర్శన్ హోగయా, తబ్ మై నే భిక్షుఓ యహ్ దావా కియా...! మై నే జ్ఞాన్ కో దేఖా! మేరీ ముక్తి అచల్ హై! యహ్ అంతిమ్ జన్మ్ హై! ఫిర్ అబ్ ఆవాగమన్ నహీ!"

దీనివల్ల ఆర్య అష్టాంగిక మార్గమూ నాల్గు ఆర్య సత్యాలును ప్రపంచించడమే గాక, గౌతమబుద్ధుడు తాను ప్రపంచిస్తున్న మార్గం మధ్యమమార్గం అని గూడా చెప్పుకున్నట్లు విశదం అవుతున్నది.

అంతేగాక గౌతముడు ప్రతీత్య సముత్పాద వాదాన్ని గూడా ప్రపంచించాడు. ఈ ప్రతీత్య సముత్పాద తత్వం అర్థం అయిన తర్వాతనే తనకు జ్ఞాన దర్శనం అయినప్పుడు, నిరంజరా నదీతీరంలో ప్రథమ బుద్ధపదం, ప్రథమాభిసంబోధం ప్రాప్తమైనప్పుడు, వైశాఖ శుద్ధ పూర్ణిమనాటి రాత్రి ప్రథమయామంలో ఈ ప్రతీత్య సముత్పాదాన్ని గూర్చిన అనులోమ, ప్రతిలోమ దర్శనం ఆయనమనస్సులో ఆడింది. దాన్ని ఆయన మననం చేశాడు. వినయపిటకం మహావర్గంలో ఈ విషయం ఇట్లా ప్రతిపాదితమైంది: "తేన సమయేన భగవా ఉరువేలాయం నజ్జా నేరంజరాతీరే బోధిరుక్ఖమూలే పఠమాభిసంబుద్ధో! అథఖో భగవా బోధిరుక్ఖమూలే సత్తాహం ఏకపల్లంకేన నిసేది, విముత్తి సుఖపటిసంవేది. అథఖో భగవా రత్తియా పఠమం యామం పటిచ్చ సముప్పాదం అనులోమ, పటిలోమం మనసా కాసి, అవిజ్జా పచ్చయా సంఖారా, సంఖార-పచ్చయా విఞ్ఞాణం, విఞ్ఞాణ-పచ్చయా నామరూపం, నామరూప—పచ్చయా—సడాయతనం, సడాయతనం పచ్చయా-ఫస్సో, ఫస్స-పచ్చయా-వేదనా, వేదనా, పచ్చయా-తణ్హా, తణ్హా-పచ్చయా ఉపాదానం ఉపాదాన-పచ్చయా-భవో, భవ-పచ్చయా-జాతి, జాతి-పచ్చయా - జరామరణం, సోక-పరిదేవ-దుక్ఖ—దోమనస్సు పాయాసా సంభవంతి, ఏతమేతస్స కేవలస్స దుక్ఖక్ఖంధస్స సముదాయో హోతి!...

"అవిజ్జాయత్వేవ అసేస విరాగ—నిరోధా—సంఖార-నిరోధో, సంఖార-నిరోధా-విఞ్ఞాణ నిరోధో, విఞ్ఞాణ-నిరోధా-నామరూప నిరోధో, నామరూప నిరోధా-సడాయతన నిరోధో, సడాయతన నిరోధా-ఫస్స నిరోధో, ఫస్సనిరోధా వేదనానిరోధో, వేదనా నిరోధా—తణ్హానిరోధో,—తణ్హా-నిరోధా ఉపాదాన నిరోధో, ఉపాదాన నిరోధా భవనిరోధో, భవ నిరోధా-జాతినిరోధో, జాతి నిరోధా-జరామరణం—సోకపరిదేవ దుక్ఖ - దోమనస్స పాయాసా నిరుజ్ఝంతి, ఏవమే తస్స కేవలస్స దుక్ఖక్ఖంధస్స నిరోధో హోతి!"

బ్రహ్మసూత్ర చతుస్సూత్రి శంకరభాష్యంలో అద్వైతపు నిగ్గుమూవత్తూ వున్నట్లు, ఈ ధర్మచక్రప్రవర్తన సూత్రంలోను, ప్రతీత్యసముత్పాద సూత్రంలోను గౌతముని బౌద్ధం అంతా ఇమిడివుంది.

భగవంతుడైన గౌతముడు చెప్పిన ఈ ప్రధాన తత్వం ఆధారంగా, ఆయన నిర్వాణం చెందిన అనంతరం కొన్ని వందల సంవత్సరాల లోగానే శాక్యపుత్రీయ బౌద్ధంలో బహుశాఖలు ఏర్పడ్డాయి. హిందీ వినయపిటక పీఠికలో త్రిపిటకాచార్యులయిన రాహుల్ సాంకృత్యాయనుల వారు ఈ విషయాన్ని గురించి ఇట్లా సెలవిస్తున్నారు:

"క్షుద్రవర్గంలోని సప్తశతికాస్కంధంవల్ల బుద్ధ నిర్వాణం అనంతరం 100 సంవత్సరాల తర్వాత బౌద్ధ

భిక్షువులలో రెండు నికాయాలు (సంప్రదాయాలు) ఏర్పడ్డట్లు తెలుస్తోంది. అందులో ప్రాచీన పద్ధతిలో దృఢ పక్షపాతులను స్థవిరులని అన్నారు. వినయ విరుద్ధంగా కొత్త పుంతను అనుసరించినవారిని మహాసాంఘికులని అన్నారు. పాలీ కథావత్థు-అట్ఠకథా, దీపవంశము, మహావంశము మరికొన్ని ఇతరగ్రంథాలప్రకారం బుద్ధనిర్వాణం అనంతరం 220 సంవత్సరాల తర్వాత అశోకసమ్రాట్టు కాలంలో మహాసాంఘికులలోను, స్థవిరులలోనుగూడా చిన్న, పెద్ద శాఖాభేదాలు మొత్తం 18 దాకా ఏర్పడ్డాయి. కథావత్థు-అట్ఠకథ ప్రకారం ఈ 18 శాఖాభేదాలు ఇట్లా వున్నాయి. అంటూ ఆ 18 శాఖాభేదాలను, ఇట్లా పేర్కొన్నారు. 1. స్థవిరవాదులు; (2) వాత్సీపుత్రీయులు; (వీరినే వృజిపుత్రకులనికూడా అంటారు.) (3) ధర్మోత్తరీయులు (4) భద్రయాణికులు; (5) షణ్ణాగరికులు (6) సమ్మితీయులు (వీరంతా స్థవిరవాదులలో వాత్సీపుత్రీయ శాఖకు చెందినవారు) (7) మహీశాసకులు (8) ధర్మగుప్తికులు (9) సర్వాస్తివాదులు (10) కాశ్యపీయులు (11) సాంక్రాంతికులు (12) సూత్రవాదులు లేక సౌత్రాంతికులు (వీరంతా స్థవిరవాదంలో మహీశాసక శాఖకు చెందినవారు.) (13) మహాసాంఘికులు (14) ఏకవ్యావహారికులు (15) గోకులికులు (ఈ రెండుశాఖలు మహాసాంఘిక నికాయంలో ప్రధానశాఖలు.) (16) ప్రజ్ఞప్తివాదులు (17) బాహులికులు లేక బాహుశ్రుతికులు (ఈ రెండు శాఖలు గోకులికశాఖలో అవాంతరశాఖలు) (18) చైత్యవాదులు (వీరు బాహులికశాఖలో అవాంతరశాఖకు చెందినవాళ్లు).

వసుమిత్రప్రణీతమైన అష్టాదశ నికాయ గ్రంథంలో—ఇది చైనాభాషలో వుంది—వున్న ప్రకారం ఈ 18 శాఖల వార్తల పట్టిక ఇంకోవిధంగా వుంది. ఇందులోగూడా స్థవిరవాదులు స్థవిరవాదులే. మహాసాంఘికులు మహాసాంఘికులే. స్థవిర వాదులలో ఏడు అవాంతర శాఖలు ఏర్పడ్డాయి. ఆశాఖలు-(1) హైమవతులు (2) వాత్సీపుత్రీయులు (3) ధర్మోత్తరీయులు (4) భద్రయాణీయులు (5) సమ్మితీయులు (6) షణ్ణాగరికులు (7) సర్వాస్తివాదులు. ఈ సర్వాస్తివాదులలో తిరిగి మూడుశాఖలు ఏర్పడ్డాయి: (1) మహీశాసకులు (2) కాశ్యపీయులు (3) సౌత్రాంతికులు. మహీశాసకులలోంచి ధర్మగుప్తులు విడిపడ్డారు. మహాసాంఘికులలో నాల్గు అవాంతరశాఖలు పొటమరించాయి. (1) ఈ-చు-లుక్ (ఈ మాటలను ప్రజ్ఞప్తివాదులన్న అర్థమేమోనని మహాపండిత రాహుల్ సాంకృత్యాయనుల భావిస్తున్నారు) (2) లోకోత్తరవాదులు (3) ఏకవ్యావహారికులు. (4) గోకులికులు. కి-చి-లున్ శాఖలో చైత్తీయుల నే అవాంతరశాఖ ఏర్పడింది. [చూ. మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్-వినయ పిటక పీఠిక.]

ఇట్లా మొదటినుంచీగూడా శాక్యపుత్రీయ సాంఘంలో విభిన్న శాఖలు ఏర్పడుతూవచ్చాయి. గౌతముడుచెప్పిన సూత్రాన్ని వీరు తమ తమ శాఖనుబట్టి వ్యాఖ్యానిస్తూవచ్చారు. అయితే వీరిలో వాత్సీపుత్రీయులుతప్ప తక్కినవాళ్ళంతా పుద్గలనాస్తి-అనాత్మత్వ-నైరాత్మ్య-పుద్గలశూన్యవాదాన్ని అవలంబించారు. పుద్గలాస్తికాయం అంతాగూడా పరమాణు రూపమైన శరీరపదార్థం. ఈ పదార్థ ధర్మాలను వీరు సాస్రవ, అనాస్రవ ధర్మాలక్రింద, సంక్లేశ వ్యావదానిక ధర్మాలక్రింద, కుశల అకుశల ధర్మాలక్రింద విభాగించారు. ఈ సంక్లేశ వ్యావదానిక ధర్మనిరోధమే శాంతి, నిర్వాణము అభిలషించినారు. అందువల్ల వీరి దృష్టికి సంసారం అంతా దుఃఖకార్యమై కన్పించింది. అకుశల ధర్మాలవల్ల సంసారం అనుశయమౌతుంది. కుశలధర్మాలవల్ల సంసారక్షయం అవుతుంది. ఇవిగాక చిత్తమహాభూమికా ధర్మాలుగూడా కొన్ని వున్నాయి. అంతేగాని ఆత్మఅంటూ లేదు. పుద్గలాస్తిత్వం సంగతి ఏమిటంటే సంస్కార ప్రవాహంవల్ల ఏర్పడుతోందని వీరు అంటారు.

గౌతముని బౌద్ధానికి ముందు సాంఖ్యాదిమతాలు కొన్ని వున్నాయి. అయితే ఈబౌద్ధులు ఆ వాదాలను త్రోసిపేశారు. ప్రకృతి లేక ప్రధానాన్ని ఒప్పుకోలేదు. అంతరంగిక మనోవిజ్ఞాన ధర్మాలు ఎట్లా అనిత్యాలో, బాహ్యపదార్థం సర్వమూగూడా అట్లాగే అనిత్యం అన్నారు. నాకించిత్ స్థాయి, సర్వం పృథక్-ఇట్లా వాదించారు. తమవాదాన్ని సమర్థించుకోడానికి హేతుప్రత్యయవాదం పేరుతో శాక్యపుత్రీయ బుద్ధుడుచెప్పిన ప్రతీత్యసముత్పాదవాదాన్ని తెచ్చుకొని అందులోంచి క్షణికాత్మవాదాన్ని విజ్ఞానవాదాన్ని, సర్వాస్తివాదాన్ని ఆఖరికి శూన్యవాదాన్ని సృష్టించుకుంటూ వచ్చారు. జగత్తులో ఏదీ

స్థిరం కాదు. ఏదీ నిలవదు. ధర్మప్రవిచయంవల్ల ఇక్కడ ఏమీ మిగలడం లేదు. ఇట్లా వాదించారు. పై 18 విభాగాల బౌద్ధులలోను ఒక్క వాత్సీపుత్రీయులే మసక మసకగానైనా, ఏదో అస్తికాయం వున్నదని భావించారు.

పైన పేర్కొన్న 18 శాఖల బౌద్ధులు హీనయాన విభాగానికి చెందినవాళ్ళు. ఆ తర్వాత మహాయానం పుట్టుకువచ్చింది. హీనయాన బౌద్ధంలో బుద్ధుడు నిర్వాణంలో అంతమైపోతాడు. పైగా అందులో బుద్ధుడు మానవుడు. మహాయానులు ఇక్కడ చేయవలసిన మార్పులు చేశారు. బుద్ధునికి దైవత్వం చేకూర్చారు. నిర్వాణంలో బుద్ధుడు రూపునాశనం కావడం వీరికి ఇష్టం కాలేదు. అందువల్ల నిర్వాణాన్ని పుష్కలం చేసి, చైతన్యవంతం చేసి, అందులో బుద్ధుణ్ణి అధిష్ఠింపచేశారు. అంతే కాదు. ధర్మాల శూన్యత్వాన్ని మహాయానులు అంగీకరించలేదు. ఎవరి మోక్షాన్ని వారు సాధించుకోవాలనే సూత్రాన్ని వీరు కొట్టివేశారు. తథాగతుని ప్రపంచోపకారిత్వాన్ని అవ్యయస్థితిత్వాన్ని తెచ్చిపెట్టారు. హీనయానంలో లోపించిన పరమార్థం మహాయానంలో ధర్మకాయంగా అవతరించింది. దీన్ని వీరు అనభిలాప్యస్వభావము, సర్వధర్మశూన్యత అన్నారు. షర్బట్‌స్కీ అనువాదంలో ఇది 'A Reality shorn of all Relations, reality in itself' అయింది. సర్వధర్మాలు శూన్యాలయితే, వీటికి, ధర్మతాశికి, లేక ధర్మకాయానికి సామానాధికరణ్యం ఎక్కడ అంటే, ఏ ధర్మానికి ఆ ధర్మం శూన్యమే అయినా, ఈ సర్వధర్మ సమాహార స్వరూపంగా ధర్మకాయం వుంటోంది గనుక, అందులో ఈ సమానాధికరణ్యం లేక ఐకాధికరణ్యం ఏర్పడుతోందని మనం వూహించుకోవాలి. ధర్మకాయానికి బుద్ధధర్మాలని కూడా నామాంతరం వుంది. బుద్ధునికి ఒక విరాట్ స్వరూపాన్ని చేకూర్చి, ఆ స్వరూపంలో ఈ ధర్మాలకు మహాయానులు అభేదాన్ని చెప్పారు. దీనికి ముందువున్న బౌద్ధంలో పంచస్కంధాలు, 12 ఆయతనాలు, 18 ధాతువులు మొదలైనవి వున్నాయి. వాటిని వీరు పూర్తిగా తిరస్కరించలేదు. వాటిని కూడా గ్రహించి, వాటికి స్వభావశూన్యతను చెప్పారు.

ఈ మహాయానంలో కూడా ప్రతీత్య సముత్పాదం వుంది. కాని ఇక్కడ దీని అర్థం కొంచెంగా మారింది. మాధ్యమిక కారికలలో మొదటి ఆరు శ్లోకాలను పరిశీలిస్తే ఇందులో వీరుచేసిన మార్పులు ఏమిటో తెలుస్తాయి. మొదటి బౌద్ధంలో సర్వధర్మాలు స్వతంత్రాలు. యదార్థాలు. ఈ ధర్మంలో సర్వధర్మాలు పరస్పరాపేక్షులు గనుక శూన్యాలు. మొదటి రకం బౌద్ధంలో చెప్పిన ప్రతీత్య సముత్పాద వాదానికి ఈ రెండో రకం ప్రతీత్య సముత్పాద వాదానికి తేడా ఇది. దీని తర్వాత గ్రహించవలసింది అజాతవాదం. సాంఖ్యులకు, వైశేషికులకు, బౌద్ధులలోని సర్వాస్తివాదులకు, వీరికి ఇక్కడే తేడా కన్పిస్తుంది. అంతే గాక మహాయానులు లంపిగా సంవృతి సత్యాన్ని, పరమార్థ సత్యాన్ని అంగీకరిస్తారు. జగత్తు సంవృతి సత్యం అనే విషయంతో ఎవరికీ పేచీ లేదు. కాని పరమార్థం ఏమిటో చెప్పటంవద్దే ఇందులో కొంత క్లిష్టత కన్పిస్తుంది. శూన్యవాదుల్లో నాగార్జునుడికి, అసంగుడు, వసుబంధువు మొదలైన తాత్వికులకు ఇక్కడే తేడా కన్పిస్తుంది. అజాతి వాదాన్ని అంగీకరిస్తే, సంసారానికి, నిర్వాణానికి, వ్యవహారంలో భేదాన్ని చెప్పినా, పరమార్థంలో సామానాధికరణ్యాన్ని అంగీకరించాలి. అంటే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్న మంత్రార్థానికి దగ్గరగా రావాలి. మహాయానులు శూన్యం పేరుతో, బ్రహ్మవాదానికి ఎంత చేరువలోకి వచ్చారో, "బ్రహ్మ" అనే శబ్దాన్ని తమ తాత్విక పరిభాషలో చేర్చుకోకపోయినా, నిర్వచన వ్యవహారంలో, బ్రహ్మ పదార్థ నిర్వచనంలో ఉపనిషత్తులు వాడిన మాటలనే, కొద్ది మార్పులతో, (కొంత అధిక్షేపంతోనే అనండి) ఎట్లా వాడుకున్నారో ముందు చూపిస్తాను. మొట్టమొదటిసారిగా శూన్యవాద బౌద్ధాన్ని పాశ్చాత్య ప్రపంచదృష్టికి తెచ్చిన షర్బట్‌స్కీ తన Buddhistic logic అనే గ్రంథంలో శూన్యవాద పరమార్థాన్ని గూర్చి వ్రాస్తూ "There is no substantial difference between them (అంటే సంసార and నిర్వాణ); The absolute Nirvana is nothing but the world viewed sub - specieaeternitatis" అన్నాడు. దీన్నే కొందరు మహాయానులు పరినిష్పన్న స్వభావం అని వ్యాఖ్యానించారు.

లంకావతారంలో జగత్తును మాయ అని గగన పుష్పం అని, అనడం వుంది. మాధ్యమిక కారికల పై వ్యాఖ్యానంలో చంద్రకీర్తి గగన పుష్పం, ఖర విషాణం, కూర్మరోమ ప్రాకారం, మొదలైన మాటలతో అర్థబోధ చెయ్యటంవుంది. వ్యావహారిక జగత్తు యొక్క అనిత్యత్వాన్ని, అశాశ్వతత్వాన్ని చెప్పే

విషయంలో వైదికులకు, శూన్యవాద బౌద్ధులకు ఆట్టే తేడాలేదని దీనివల్ల తేటతెల్లం అవుతున్నది.

మహాయానంలో బుద్ధుడు అవతారాలు ఎత్తడం కూడా వుంటుంది. భగవద్గీతలో కృష్ణుడు ఏవిధంగా, ధర్మగ్లాని కల్గినప్పుడు లోకసంగ్రహార్థం అవతారం ఎత్తుతానని చెబుతాడో, అదేవిధంగా లంకావతారంలో బుద్ధుడు లోకసంగ్రహార్థం అవతారం ఎత్తుతూవుంటాడని వున్నది. (అందుచేతనే బుద్ధుడు, నిర్వాణస్థితిలో శాశ్వతంగా వుండడని వీరు అంటారు—అది అసలు ఆయనయొక్క పరమధామ కాదంటారు.) బాల పృథగ్జనులను రక్షించడానికి బుద్ధుడు హిరి తత్వంలో అవతారాలు ఎత్తడం జరుగుతుంది.

బౌద్ధం ఎత్తిన రెండో అవతారం తాలూకు కొన్ని లక్షణాలు ఇక్కడ వివరించాను. ఈ అవతారంలో ఒకభాగాన్ని నాగార్జునాచార్యులు తమ గ్రంథాలలో వివరించారు. ఇందులోకూడా ప్రతీత్య సముత్పాద వాదం, అవీ ఎట్లావున్నాయో పైన చూచాము.

ఈవాదంలోవచ్చే ప్రతీత్య సముత్పాదవాదాన్ని ఈయన కొత్తగా సృష్టించారా? అసలు బుద్ధుడు చెప్పిన ప్రతీత్య సముత్పాద వాదమైనా కొత్తదా? లేకపోతే బుద్ధునికిపూర్వం వున్న తాత్విక దర్శనాలలో వున్నదా? ఈ మొదలైన ప్రశ్నలు చాలా వున్నాయి. గౌతముని బౌద్ధంమీద, ఆయనకు పూర్వంవున్న సాంఖ్య, జైనాది మతాల ప్రాబల్యం ఎక్కువగా చెల్లిందన్న విషయం, బౌద్ధుల గ్రంథాలలో ఎక్కడపడితే అక్కడే కన్పిస్తుంది. అట్లాగే ఉపనిషత్తుల వాసనకూడా బౌద్ధ గ్రంథాలలో బాగా పరిమళిస్తూ వుంటుంది. సిద్ధార్థబుద్ధుడు అరారకాలాముడనే సాంఖ్యాచార్యునివద్ద శుశ్రూషచేసినట్లు వినయాది పిటకాలలో వుంది. బాదరాయణుని బ్రహ్మసూత్రాలను దృష్టిలో పెట్టుకొనే భగవంతుడైన గౌతముడు దీర్ఘనికాయంలోని బ్రహ్మజాల సూత్రాంతాన్ని చెప్పి వున్నాడని అనిపిస్తూ వుంటుంది. ఇటువంటి విషయాలను అట్లావుంచి, ప్రకృతానికి వచ్చి, నాగార్జునుని శూన్యవాదం ఏమిటి? ప్రతీత్య సముత్పాదవాదం ఎక్కడినుంచి పుట్టుకు వచ్చింది? మొదలైన విషయాలను పరిశీలన చేద్దాము.

సాంఖ్యులలో మహత్తత్వాది వివరణం వుంది. ఇప్పుడు మనకు దొరికే సాంఖ్యకారికేత్యాది గ్రంథాలు ఇటీవలివే అనుకున్నా, వాటిల్లో వున్న మహత్తత్వాది వివరణం బుద్ధునికి పూర్వం నుంచీవస్తున్నట్లు ఒప్పుకోకతప్పదు. భారత భాగవతాదిగ్రంథాలలో దీని ప్రసక్తివుంది. అంతేగాక, భాగవతంలో దేవహూతికి కపిలాచార్యులు తత్వజ్ఞానము, భక్తియోగము ఉపదేశించిన ఘట్టంవుంది. ఇందులో ప్రసక్తమైన సాంఖ్యదర్శనం చాలా పూర్వకాలంకిందటిది అని పండితులు అభిప్రాయపడుతున్నారు. దివంగతులైన శ్రీ శివరామశాస్త్రిగారు "బాదరాయణుడు ఖండించిన కపిలాచార్యుడు కలిద్వాపరసంధి కాలమునకు చాలపూర్వుడు. మోక్షధర్మపర్వమును చూచినచో కపిలుని ప్రాచీనత్వము తెలియును" అన్నారు. మరియు కపిలవాస్తు నిర్మాతయగు కపిలఋషి ఒక్కడున్నాడు. ఆయన సాంఖ్యమును చెప్పిన కపిలుడుకావచ్చునని ఓల్డెన్‌బర్గ్ మొదలైన పండితులు అనుమానించారు. కాబట్టి సాంఖ్యం, ఎన్ని విధాలుగా మారినా, గౌతమునికంటే ముందువున్నట్లే తేలుతోంది. ఇది తేలితే, గౌతముడు చెప్పిన ప్రతీత్య సముత్పాదానికి, ఈ సాంఖ్యతత్వంలోని మహత్తత్వాది వివరణమునకువున్న సంబంధం విజ్ఞులకు విధిగా గోచరిస్తుంది. అయితే బౌద్ధుల ప్రతీత్యసముత్పాదపద్ధతి కన్నా, మహత్తత్వాది వివరణం ఉన్నతమైందిగా గోచరిస్తుంది. బౌద్ధుల ప్రతీత్య సముత్పాదంలో అవిద్యలోంచి సంస్కారం, సంస్కారంలో ఇంకోటి—ఇట్లా పుట్టుకువస్తాయి. కాని అవిద్య ఎందులోంచి పుట్టింది? అంటే, బౌద్ధంలో "అ" దగ్గరనుంచి "క్ష" దాకా చదివినా జబాబు కన్పించదు. నాగార్జునులవారుగూడా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పినట్లులేదు. ఇట్లా ఇది ఒక పిడివాదం (Dogma) క్రింద తయారై పోయింది. ఇట్టిదీన్ని తెచ్చి, నాగార్జునులవారు సర్వసృష్టికి, సృష్టిధర్మాలకు పట్టించి, సర్వధర్మశూన్యతను సాధించడానికి పూనుకున్నారు. పైగా అన్నిరకాల శూన్యవాదులు ఈ పతీత్య సముత్పాదవాదాన్ని పట్టుకొని తమతత్వాలకు పట్టించుకుంటూ, అందులో "ప్రతీత్య" అన్నదానికి ఎవరిఅర్థం వారు చెప్పకున్నారు. నాగార్జునులవారి అర్థాన్ని చంద్రకీర్తి తన ప్రసన్నపదా వ్యాఖ్యానంలో నాగార్జునాచార్యులవారి ప్రణామశ్లోకంలో "ప్రతీత్య సముత్పాదం"అన్న మాటలకు భాష్యంవ్రాస్తూ "ఏతిర్గత్యర్థః । ప్రతి ప్రాప్త్యర్థః । ఉపసర్గవశేన ధాత్వర్థ విపరిణామాత్ । ప్రతీత్య శబ్దోఽత్ర ల్యబన్తః ప్రాప్తావపేక్షాయాం వర్తతే । సముత్పూర్వః పదిః ప్రాదుర్భావార్థ ఇతి

సముత్పాదశబ్దః ప్రాదుర్భావే వర్తతే। తతశ్చ హేతు ప్రత్యయాపేక్షో భావానాముత్పాదః ప్రతీత్య సముత్పాదార్థః" అని వివరించారు, ఇతరులు "ఇతి ర్గమనే వినాశః। ఇతౌ సాధవ ఇత్యాః। ప్రతి వీప్సార్థః। ఇత్యేవం తద్ధితాంత మిత్యశబ్దం వ్యుత్పాద్య" అని చెప్పి, ఆ చెప్పినవారి మతాన్ని ఖండించారు. ఈ భాష్యంతో ప్రతీత్య సముత్పాదమంటే నాగార్జున, చంద్రకీర్తుల అర్థం ఏమిటో మనకు అర్థం అవుతోంది.

ఈ రకమైన హేతుప్రత్యయాపేక్షారూపమైన ప్రతీత్య సముత్పాదవాదంతో నాగార్జునులవారు తమ ప్రాసంగిక శూన్యవాదాన్ని స్థాపించారు. గౌతముని అనంతరం బయలుదేరిన పుద్గల శూన్యవాదబౌద్ధానికి దీనికి తేడావుంది. గౌతముని బౌద్ధానికి, దీనికిగూడా తేడావుంది. గౌతముడు పరమార్థాన్ని ఒప్పుకోలేదు. వీరు పరమార్థాన్ని ఒప్పుకుంటారు. అనపేక్షాస్వభావమే వీరికి పరమార్థం. అది ఏమిటో ఎక్కడా స్పష్టంగా లేదు. సర్వభావాలు పరస్పరాపేక్షములు గనుక స్వభావంచేత శూన్యాలు అంటారు. ఇదే నిఃస్వభావం అంటే. ఈ భావాన్నే విగ్రహవ్యావర్తినిలో నాగార్జునులు ప్రదర్శించారు. మొదటి బౌద్ధులు పుద్గలశూన్యతను, నైరాత్మ్యాన్ని చెప్పగా, నాగార్జునాదులు ధర్మనైరాత్మ్యాన్ని, సర్వధర్మశూన్యత్వాన్ని, స్వభావశూన్యత్వాన్ని చెప్పారు. శూన్యత అంటే అభావం (లేకపోవడం) కాదు. ఇతరేతరాభావం; పరస్పర అపేక్షిత. జగత్తులో పరమార్థంలేదు గనుక, అది శూన్యం అని భావం. అంతేగాని జగత్తు లేదనిగాని, జగత్తు శూన్యమనిగాని మాధ్యమికుల భావం కాదని వ్యాఖ్యాతలు అంటారు. అందుచేతనే లోకాన్ని సంవృతి సత్యంగా మాధ్యమికులు ఆమోదించారు. సంవృతిఅంటే పైన ముసుగుఅని, సంవృతి సత్యాన్ని అంగీకరించారు గనుక, ఆముసుగులోపల ఏదో పరమార్థంవున్నట్లే నాగార్జునాదులు ఆమోదిస్తున్నారని డాక్టర్ రాధాకృష్ణన్ తమ భారత తత్వశాస్త్ర చరిత్రలో ఉట్టంకించారు. అయితే ఆ పరమార్థం ఏమిటోమాత్రం మనకు స్పష్టంగా ఎక్కడా నాగార్జునాదుల గ్రంథాలలో గోచరించదు. నిర్వాణం పరమార్థం అనుకుంటే, దాన్నిగూడా నాగార్జునులు శూన్యమే అన్నారు. చంద్రకీర్తి "ఉపాయభూతం సంవృతి"అని "ఉపేయభూతం పరమార్థం"అనిఅన్నట్లు డాక్టర్ కృష్ణరావు వ్రాశారు. అది అంగీకరిస్తే, "ప్రమాణం సంవృతి, ప్రమేయం పరమార్థం" కావలసివస్తుంది. ఈప్రమాణప్రమేయాలనుగూడా నాగార్జునులు, చంద్రకీర్తి ఆమోదించలేదు. పరశురాముడి గండ్రగొడ్డలి వంటి తర్కాన్ని పెట్టుకొని, నాగార్జునులవారు తథాగతుణ్ణిగూడా కొట్టివేశారు. తర్కం ఆయన్ని మింగివేసింది. దీన్నిగూర్చి ఆయన మాధ్యమిక కారికలు నాల్గో ప్రకరణంలో విచారించినట్లు గూడా వుంది. ఇటువంటి తర్కాన్ని పెట్టి సర్వధర్మాలను కొట్టివేసినా నాగార్జునులకు ధర్మకాయంలోను, ధర్మధాతువులోను విశ్వాసం వున్నదనే డాక్టర్ రాధాకృష్ణన్ భావిస్తున్నారు. ధర్మకాయంఅంటే సర్వధర్మాల రాశీభూత స్వరూపం. వైదికుల విశ్వరూపంవంటిది. దీన్నే మహాయానులు (నాగార్జునుల వారుగూడా మహాయానులే) పరమార్థంఅని, ధర్మతఅని అంటారు. బుద్ధునికి దీనికి అభేదాధ్యవసాయం చెబుతారు. ఇట్లా వ్యాఖ్యాతలు చెబుతున్నది, నాగార్జునులు చెప్పింది, దగ్గర పెట్టుకుని చూస్తే అంతా అరణ్యంగా తయారై ఏమిటో తెలియని స్థితిగూడా ఒకటి ఏర్పడుతోంది. అనుయాయులైన వ్యాఖ్యాతలను తీసి అవతల పెడితే, ప్రాచ్యులైన వ్యాఖ్యాతలు శూన్యవాదాన్ని నిరధిష్ఠానవాదంగా తేల్చివేశారు. తేల్చి ఇట్లా పూర్వపక్షం చేశారు.

"నిరధిష్ఠాన విభ్రాంతే రభావా దాత్మనోఽస్తితా,
శూన్యస్యాపి ససాక్షిత్వా దన్యథా నోక్తి రస్య తే."

ఈ శ్లోకం తాత్పర్యం ఇది: "స్వరూపములేని శూన్యము, భ్రాంతికి ఆధారముగా నుండరామి చేతయు, ఆధార వస్తువు నాశ్రయింపని భ్రాంతి, సంభవింపమి చేతను జగత్కల్పనకు ఆధారుడగు ఆత్మగలడని అంగీకరింపవలెను. ఇదియునుం గాక శూన్యవాది చేతను, శూన్యమునకు సాక్షిభావముగా వర్తింపుచుండెడి తన నాత్మనుగా నవశ్య మంగీకరింపవలెను. అట్లు శూన్యమునకు సాక్షిభావముగా వర్తింపుచుండెడి తానైన ఆత్మ ఉన్నట్లంగీకరింపబడని యెడల శూన్యమని చెప్పుటయు, బౌద్ధుడవగు నీ మతమును సిద్ధింపదు అనగా సాక్షిత్వము తానుండియే శూన్యమని చెప్పుచున్నాడు గాని, తాను లేనియెడల శూన్యమని చెప్పుటకు సాధ్యము గాదని యభిప్రాయము."

[వేదాంత పంచదశి చిత్రదీపంలో 74 వ శ్లోకము. తాత్పర్యము మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి గారిది. ఈ గ్రంథము 1899 లో ప్రకటితము.]

ఇట్లా బహువిధాలుగా ఖండిత మండనములకు గురియైన నాగార్జునులవారి శూన్యవాదం వెనుక దాగి వున్న రహస్యం ఏమిటి? నాగార్జునుల వారు తాను చెబుతున్న సంవృతి సత్యం అనే తెరవెనక ఏమి పరమార్థాన్ని దాచి ఉంచి పెట్టారు? శ్రుతుమద్ధ్యద్వైతమైన తర్కం అనే కోటలో ఆయన నిక్షిప్తం చేసి వున్న పరమసత్యం ఏమిటి? డాక్టర్ రాధాకృష్ణన్ ప్రభృతి భారతీయ వేదాంతులే గాక, నాగార్జునుణ్ణి మొట్టమొదటి సారిగా పాశ్చాత్యులకు పరిచయం చేసిన రష్యన్ తాత్వికుడు షర్బట్స్కీ, ఆయన అనంతరం వచ్చిన పాశ్చాత్య పండితులు కొంతమంది నాగార్జునులకు ఉపనిషత్తులయందును, వేదాంత శాస్త్రములయందును వున్న అభిమానాన్ని, ప్రీతిని గూర్చి వెల్లడించి వున్నారు.

ఈ విషయాన్నే హర్షమిశ్రుల వారు తమ ఖండన-ఖండఖాద్యాది గ్రంథాలలో వ్రాసివున్నారు. అదీ గాక నాగార్జునులవారి శూన్యవాదానికి అద్వయవాదం అన్న పేరుకూడా ప్రసిద్ధంగదా! పైగా ఆయన మాధ్యమికకారికలలో చేసిన సంబుద్ధ ప్రార్థనాన్ని చూసినా ఈ విషయం గోచరిస్తుంది. (ఇందులో శూన్యవాద పరమార్థం యావత్తూ వున్నదని ప్రసన్నపదంలో చంద్రకీర్తి భాష్యం చూస్తే తెలుస్తుంది.)

"అనిరోధ మనుత్పాద
  మనుచ్ఛేద మశాశ్వతం,
అనేకార్థ మనానార్థం
  అనాగమ మనిర్గమం,
యః ప్రతీత్యసముత్పాదం
  ప్రపంచోపశమం శివం"

ఇది ఆయనచేసిన ప్రార్థన. ఇందులో వున్న చాలా మాటలు మన ఉపనిషత్తులలోవి. బ్రహ్మపదార్థ నిర్వచన జరిగేప్పుడు ఉపనిషత్తులలో ఇటువంటి మాటలే వినిపిస్తాయి. ఇందులో ముఖ్యంగా చూడవలసింది. "ప్రపంచోపశమం శివం" అన్న వాక్యం. ఆవాక్యం, వాక్యం ఉపనిషత్తులలోంచి దిగుమతి అయింది.

మాండూక్యం ఏమంటోందో చూడండి. "నాన్తః ప్రజ్ఞం, నబహిః ప్రజ్ఞం, నోభయతః ప్రజ్ఞం, న ప్రజ్ఞానఘనం, నప్రజ్ఞం, నా ప్రజ్ఞం, అదృష్టం, అవ్యవహార్యం, అగ్రాహ్యం, అలక్షణం, అచింత్యం, అవ్యపదేశ్యం, ఏకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం, శాన్తం శివం, అద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మాస విజ్ఞేయః."

ఈ మంత్రాన్నీ నాగార్జునుల వారు చేసిన సర్వమైన వాదాన్ని పరిశీలనచేస్తే అసలు సంగతి ఏమిటో తేలిపోతుంది.

అంతేగాక—తైత్తిరీయం బ్రహ్మవల్లిలో

"అసన్నేవ సభవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద, సన్తమేనం తతో విదు రితి, తస్యైష ఏవ శరీర ఆత్మా, యః పూర్వస్య, అథాతో౽నుప్రశ్నాః, ఉతా విద్వా నముం లోకం ప్రేత్య కశ్చన గచ్ఛతి, ఆహో విద్వా నముం లోకం ప్రేత్య కశ్చిత్సమశ్నుతా ఉ, సో౽కామయత బహుస్యామ్ ప్రజాయేయేతి, సతపో౽తప్యత, సతప స్తప్త్వా, ఇదగ్ం సర్వ మసృజత, యదిదం కించ, తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదను ప్రవిశ్య, సచ్చత్యచ్చాభవత్" ఇంతవరకు వైదికుల గోల అనుకున్నా, ఈ క్రింద పంక్తులు చూడండి.

"నిరుక్తం చానిరుక్తంచ, నిలయనం చానిలయనంచ, విజ్ఞానంచా విజ్ఞానంచ, సత్యంచా నృతంచ సత్యమభవత్, యదిదం కించ, తత్సత్య మిత్యాచక్షతే, తదప్యేష శ్లోకో భవతి."

ఈ మంత్రంపై శంకరులు వ్రాసిన భాష్యాన్ని చూస్తే శూన్యవాదం పుట్టుక సంగతి, అందులో ఇమిడి వున్న రహస్యం సంగతి తేలుతుంది.

ప్రథమ బౌద్ధులు పీఛదారిని వెళ్ళగొట్టిన బ్రహ్మ పదార్థాన్ని నాగార్జునాగులు దొడ్డిదారిని (ముసుగువేసి) తెచ్చిబౌద్ధంలో ప్రవేశపెట్టారు.

"అపర ప్రత్యయం శాంతం
  ప్రపంచైః అప్రపంచితం,
నిర్వికల్పం అనానార్థం
  ఏత త్తత్త్వస్య లక్షణం.
అప్రహీణం అసంప్రాప్తం
  అనుచ్ఛిన్న అశాశ్వతం,
అనిరుద్ధం అనుత్పన్నం
  ఏత న్నిర్వాణ ముచ్యతే"

(మా. మా. కా)

# సుధాలహరి

శ్రీ దివాకర్ల వేంకటావధాని

[గతసంచిక తరువాయి]

పడమటి కొండపై మణులు పర్విన ఛత్రము పోల్కినున్నయ
ప్పుడె వని జూచుచుందురు నవోఢలు ప్రోషలు విప్రయుక్తలా
పడతులు భీతితో నయనపర్వముగా నతిదైన్య మొప్ప నా
తమ నళినీప్రియుం డిడుత దత్ప్రియపాళికి మాకు ధైర్యమున్.

రోదసినిండ రేయి నవరోధము లేక చరించు చీకటిన్
మోది తదీయరక్తమునవో యన నెల్లెడ రక్తకాంతు లా
పాదన జేయు దేవికయి సంధ్యలలో ద్విజు లర్ఘ్య మిత్తు ర
య్యాదిమ దైవతేజమునకై ఘటియింతుము మా నమస్సులన్.

ఆదిత్యులకు రథ, యంబురాశులయందు దలమున్కలిడెడు జంతులకు నావ,
యసలు జన్మస్థానమైన సద్యంతంబు, లూహింపగాలేని యుత్సవంబు,
తనయందు ద్రిగుణంబు లనుగమించుట జేసి వానికిని దురీయమైన మూర్తి,
తుందిలంబయి జగన్మందిరంబున బ్రాకు తరుణాంధకార సంతతికి మిత్తి,

శ్రమ మెఱుంగక మూడులోకముల నొకట
ద్రామ మొనరించు చతురిమ దాల్చునట్టి
పద్మినీప్రాణవల్లభు పరమతేజ
మెలమి సీక్షించి మమ్ము రక్షించుగాక !

సర్వసుపర్వ లభ్రమున సామవచస్సుల సన్నుతింప గం
ధర్వులు స్వీయసద్గుణ వితానము గాథలుగా బఠింపగా
బర్వి రుజార్తులన్ వెదకి వారల దుర్గతి బాపు భాస్కరా
ఖర్వరుచిప్రభావము జగమ్ములపీడ దొలంచు గావుతన్.

జాడ్యబాధితులైన జనుల సంజీవియై తప్త సువర్ణము ద్రస్తరించి
జాంఘిక సమితిలో జంఘాలమై పద్మ సంఘమ్ములకు మహోత్సవము గొలిపి
ప్రాణికోటులకు జీవప్రాపకంబయి కర్మసంచలనంబు గడలుకొలిపి
జాజ్వల్యమాన దివ్యజ్యోతియై వార్ధి యుదరంబులోనుండి యుబికివచ్చి

యజ్ఞుడాదిగ గల్గు నన్యగ్రహముల
కాంతిపుంజసముద్భవకారణమయి
సకల జగదేక రక్షాప్రసక్త మైన
యనఘతేజము మాకు జయమ్ముగూర్చు.

గోవులతో ప్రభాతమునగూడ గమించి రుచిప్రచార నం
భావనగూర్చి సాయమున వానిని గేహములందు జేర్చుచున్
దావమునన్ జగద్వ్రజిన దైన్యముగాల్చి శివంకరమ్ములౌ
గోవిభు గోసహస్రము లకుంఠజయమ్మును మాకు గూర్చుతన్!

నర సుర యక్ష కింపురుష నాగ నిశాచరముఖ్యులందరున్
నహుసగనిల్చి దేనికి ప్రణామ మొనర్తు రుషస్సులందు న
య్యరుణుని దివ్యబింబ ముదయాద్రి నసించి యవిద్య నాద్యమున్
విరిచి శ్రితాళికిన్ రుచిర విద్యఘటించి జయమ్ముగూర్చుతన్.

ఆవనజాసనాయువు క్షణాత్మకమై చను కాలచక్ర మే
దేవుని లీలయంచు వినుతించిరి వేదపురాణ కోవిదుల్
భావవికార షట్కమును ప్రత్యహ మెవ్వ డెసంగజేయు భా
యావిభు డాత డింద్రదిశయందు ప్రభాతమునన్ జెలంగెడిన్.

అరసి ప్రభాతవేళల హిమాంచిత భంగుర భాసురాంకముల్
చెరచెర శాత్రవాగ్రహముచేవలె నెజ్జగ వాసవాశపై
బరగుచు ధర్మనాశకుల పాపము ప్రద్దలొనర్చునట్టి భా
స్కరుని మయూఖపాళి త్వరగా నడగించు మదీయ యత్నమున్.

ద్విజులకు విశ్రమంబు, సుఖదీప్తిని గాముకలోకపాళి, కం
బుజముల నిద్ర, చెంగలువపూవులకున్ హరుసంబు గూర్చుచున్
ప్రజల భరమ్ము నంతయు గృపామతి దాలిచి యంతరబ్ధికిన్
విజయము సేయు భాస్కరుడు వేగమె మీకు శుభమ్ము గూర్చుతన్!

చిరుపర్ణంబుల కింద్రగోపములకున్ సిందూరపున్ గాంతిలో
గురుపాదంబయి నిల్చి ప్రోడలకు గుల్కుంగూర్చు జైవాతృక
స్ఫురణన్ బ్రొద్దుట మాపి సాయమగుచో బొల్పొందగా జేయు భా
స్కరుతేజం బడగించుగాత మది నాచ్ఛాదించుదుఃఖంబులన్!

ప్రాతరుదంచదుస్రముల ప్రాగ్గిరి గుంకుమ పూత బూసి య
ద్వైతము మూడులోకముల దార్చుచు జక్రములన్ గ్రసించు న

## సుధాలహరి

య్యాతన మాన్చి ధ్వాంతమను నబ్ధి మునింగినవారి నెత్తుచున్
బాతరలాడు బింబమది మా హృదయాంధ్యము బాపుగావుతన్!

ప్రకృతి రంజితమైన బ్రహ్మమూలముతోడ నమలాత్మయను పాదునందు బుట్టి
బంగారు తీవలపగిది మయూఖంబు లఖిలదిక్కుల శాఖలై వెలయగ
నావరించుచునున్న యరుణిమపల్లవ పుష్పవిలాసము ప్రోదిసేయ
నతివినీలంబైన యాకాశమే మత్తబంభర చయముగా బరిఢవిల్ల

ధర్మ ధనకామ మోక్షముల్ తగినయట్టి
ఫలములుగ వెల్గు సూర్యకల్పద్రుమంబు
శ్రీనివాసము మము గటాక్షించి మాకు
వాంఛితార్థము లొసగి కాపాడుగాక!

పక్షుల గూండ్లనుండియు స్రవంతులనుండి తుషారపాతమున్
జక్షులనుండి నిద్దుర నుషస్సుల వే దొలగించి సాయమా
నాక్షణమందు వానిని దయామతి నెప్పటిచోట జేర్చుచున్
రక్షయొనర్చు సూర్యుని కరమ్ములు మా శ్రమ బాపుగావుతన్!

ఈవల చీకటిన్ మలపి యిండ్లకు లోపలనున్న దానికై
పై విలసిల్లు రంధ్రములబట్టి ప్రవేశమొనర్చి మాపుచున్
జీవుల యంగపాళికి గృశించిన వానికి మోదమిచ్చు ఛా
యావిభు నుస్రజాలము లనంతశుభమ్ముల మాకుగూర్చుతన్!

అండజపాళి నింగి వలయంబులు గట్టి పరిభ్రమింపగా
గండరగండడై యసుర గర్వమడంచుచు వాసవాశపై
నుండి పయోజ షండముల నొక్కుమొగిన్ వికసింపజేయు సూ
ర్యుండు దయాబ్ధి పాండువును రూపడగించుచు మమ్ము బ్రోవుతన్!

అఘ జాలములకుబై నలరువాడనుచు వేదము లే మహాత్మునామము నుతించు,
నక్షులకెవ్వాని యాసనంబుగ గొందరంబుజసాహచర్యము విధించి,
రెవని నామము జపియించుచో బెదవుల మాలిన్య మఖిలంబు మాయమగునో,
బంగారు రంగుతో బరగిన కేశమ్ము లెవని దేహము నిండ నింపెనంగు,

నత డహస్పతి సర్వ భూతాంతరాత్మ
సర్వలోకైక బంధువు సర్వసాక్షి
సూర్య నారాయణుడు కృపాశోభితుడయి
మమ్ము రక్షించుగాక శుభమ్ము లొసగి!

[పండితరాయల కృతికి తెనుగు]

# కాశీఖండము : కావ్యత్వము

**శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి**

[గతసంచిక తరువాయి]

గుణనిధి తనతండ్రి, క్రోధావేశ మంతటి దగుట యెఱిగియే తిరిగి యింటికి, బోవక యెందేనియు బోవలయు ననుకొనునప్పటి కాతని హృదయమున నిర్వేద మారంభమైనది. దుర్వ్యసన దూషితులై యొడలెఱుగక తిరుగువారికి గుదికి గలుగునది నిర్వేదమే. ఇట్టి నిర్వేదమే తండ్రి యాగ్రహగ్రస్తుఁడయ్యెనని తెలిసినంతనే గుణనిధి కేర్పడినది. అతఁడప్పటి తన దురవస్థను గూర్చి దీనముగ నిట్లు వాపోవఁగొనెను.

విమిసేయుదు నెప్పటి కేగువాఁడ
ధనము నిప్పచ్చరంబు విద్యయు హుళక్కి
పెట్టసాగడి నాచేయి భిక్షసేయ
నెట్టు నేరుము? దైవంబ యెఱుగు నింక.

మఱియు నాతని కాహారము లభింపకునికి వత్సలయగు మాతృదేవత తలపునకు వచ్చినది. దానితో దానామెకు దూరమైతినని, తనమ్మతలమున దటస్థించిన దురవస్థ కిట్లు దురపిల్లెను.

అరుణగభస్తిబింబ ముద
యాద్రిపయిం జనుదేర గిన్నెలో
చెరుగను వంటకంబు వెస
పిండియలుం గుడువంగ బెట్టు ని
ర్భర కరుణాధురీణ యగు
ప్రాణము ప్రాణము తల్లియున్నదె
హరహర! యెవ్వ రింక గడు
పారసి పెట్టెద రీప్సితాన్నముల్.

గుణనిధి, బాల్యమున దాను విద్య నేర్వనందున గలిగిన దురవస్థనుగూర్చి యిపుడు వాపోవదొరకొనినాడు. తనకబ్బినదురోదరవ్యసనమున ధనము, విద్యయు సర్వథా లోపించినవి. బ్రాహ్మణవృత్తియైన భైక్ష మాచరింతమన్నను ఆత్మాభిమాన మడ్డినది. పెట్టసాగినవాని చేయి భిక్షకై సాగుటయెట్లు? ఇకమీద ఆకలివేళ కళనమబ్బుట యెట్లు? యీప్రశ్న వచ్చినంతనే యనుశయము పొటమరించినది. తనతల్లి కడుపార జలిది యన్నము దినబెట్టెడి దృశ్యము పొడగట్టినది. ఇచట సంస్కృత మూల మిట్లున్నది

శ్లో. సదా సభ్యుదితే భానౌ
ప్రమార్ష్మ మృష్టభోజనమ్,
దద్యా దద్యాత్ర కం యాచే
యా చేహ జననీ నమే.

"అనుదినము ప్రొద్దెక్కకుండ నా తల్లి కడుపు నిండ భోజనము పెట్టుచుండెడిది. ఇపుడా తల్లి నాకు లేదు. అన్న మెవరి నడిగెద?" నని యీ శ్లోకభావము. ఈ భావము శ్రీనాథుని రచనలో కరుణరసభావ సమన్వితముగుట కనువగుశైలిలో లలితమనుభావ సమంచితమై పొడసిగినది. శివరాత్రి మాహాత్మ్యమున దనదుర్వర్తనముచే నగరనిర్వాసితుడైన సుకుమారుని సైత మీపద్యముతోడనే విలపింప జేసియున్నాడు. కావున శ్రీనాథున కీ పద్యముపై మక్కువయెక్కువయని చెప్పక చెప్పుచున్నది. మఱియు శ్రీనాథుని నాటి తెలుగునాటి చలిదిభోజనపు బరిపాటి నీపద్యమెంతయు మధురముగ జిత్రించి పెట్టినది. ఇపుడు కాంపిల్యపురవాసియైన గుణనిధి తెల్లవాఱుసరికి గిన్నెలో నన్నము పెట్టించుకొని పెరుగుపోసికొని ఊరుగాయలు నంజుకొనుచు చల్దియన్నమారగించు నచ్చాంధ్రుడైనాడు. శ్రీనాథుడిదియొకతీరున తననాటి యాంధ్రావనిలో జూపట్టెడిపరిపాటులను పాఠకులయెదుట బెట్టకమానడు. అట్టిశిల్పనిర్మాణమున కిదియొక తార్కాణము.

ఈ తీరుగ గుణనిధి తొలుతటి వర్తనములో కావ్యసామగ్రీ సమున్మేషమునకు వలయు గీత్యుపదేశము గావించి, ఆ గుణనిధియే కుబేరు డగుటను దెలుపు తరువాతివృత్తాంతమున కుపక్రమించుచు, ఉదయగిరినుండి బయలుదేఱిన యరుణగభస్తి బింబము నస్తాద్రికి గొనిపోయినాడు శ్రీనాథుడు. సంస్కృత మూలమునం దీ సంధ్యావర్ణనము లేకున్నను గావ్యత్వము సిద్ధించుటకై యేత దుపక్రమము గావించియున్నాడు శ్రీనాథుడు. సూర్యభగవానుని వర్ణింపదలపెట్టిన పట్టులందెల్ల మయూరుని సూర్యశతకమునందలి మధురోదాత్తభావములను జతగూర్చుచునే యుండును. ఈ ప్రకరణమునం దీ క్రిందివచన మెంత హృదయంగమముగ గొనసాగినదో పరికింపుడు.

"వెండియు ధాతారకూట పాటల కోమలాతపంబై నట్టి వాసరంబు పలుకంబాఱ. అస్తాద్రికోటీ కూటంబున దరవికచ నిచుల కుసుమ మంజరీ పుంజంబునుం

బోలె మిహిరబింబంబు చూపట్టె. చరమధరాధర ధాతుధారాప్రవాహంబునుం బోలె సంధ్యారాగంబు గగనమండలంబు నాక్రమించె. చైత్యద్రుమంబులు నిద్రాణద్రోణకాక కాకారావ కోలాహల కులకులాయమానంబులయ్యె. అంధక రిపు కంధరామూల కాలకూటచ్ఛాయాశ్రేణి పాణింధమంబై యంధకారంబు బ్రహ్మాండ గోళంబు నాక్రమించె. రజనీ శుక్తి ముక్తాఫలంబులు చుక్కలు పొడిచె. భవిష్యద్వాసరకరకరప్రరోహంబులుంబోలె ప్రదీపంబులు భవనాంతరంబుల వెలింగె."

ఈ వచన రచనాశ్రేణిలో ప్రదోషారంభమున భూనభోంతరముల గానవచ్చెడి ప్రకృతివిలాసవైచిత్రి మనోహరోదాత్తముగ చిత్రింపబడినది.

ఇల్లువెడలివచ్చిన గుణనిధి కానాడు మాపటిదాక భుక్తిలభింపకపోవుటచే పేరాకలిచిచ్చు పెచ్చు పెరిగినది. ఆనాడు శివరాత్రి యగుటచే బురబాహ్య ప్రదేశమున శివలింగస్థానమున శైవుడొకడు జాగరణము చేసి నాల్గుజాములు నీశ్వరున కుపహారములు సమర్పించువాడై ధూపదీపనైవేద్యాద్యుపచారయోగ్య పదార్థములాయత్తము చేసికొనియుండెను. వానిలో నైవేద్య యోగ్య పదార్థములను శ్రీనాథుడీ విధముగ నాయత్తపఱచినాడు.

మరిచ ధూళీపాళి పరిచితంబులు మాణి
బంధాశ్మలవణ పాణింధమములు
బహుళ సిద్ధార్థ జంబాల సారంబులు
పటురామఠామోద భావితములు
తింత్రిణీక రసోపదేహ మేదురములు
జంబీర నీరాభిచుంబితములు
హైయంగవీన ధారాభిషిక్తంబులు
లలిత కుస్తుంబరూల్లంఘితములు
శాకపాక రసావళీపాకబములు
భక్ష్యభోజ్య లేహ్యంబులు పానకములు
మున్నుగాఁగల యోగిరంబులు సమృద్ధి
వెలయఁగొనివచ్చె నొండొండ వివిధములుగ.

పరమేశ్వరోపహార యోగ్యమయిన యీ పదార్థములలో గొన్ని మిరియపుబొడి చల్లినవియు, సైంధవలవణము గలిపినవియు, ఆవపెట్టినవియు, ఇంగువవాసనతో గూడినవియు, చింతపండుపులుసు పెట్టినవియు, నిమ్మకాయరసము పిండినవియు, కమ్మనినేయి పోసినవియు, కొత్తిమిరి వేసినవియునగు శాకపాకములుండెను. ఇవియునుగాక వివిధ రసభరితభక్ష్యభోజ్య లేహ్యములు, పానకములు నచట సముపస్థితములై యుండెనట. పరమశైవులాగమోక్తవిధిని మంత్రశాస్త్ర సమ్మతముగ బరమేశ్వర సమర్పణమునకై సమకూర్చు పదార్థజాతిమిది. ఈ పదార్థసంయోజనము శ్రీనాథుని భోజనప్రియత్వమునకు నిదర్శనమగుగాక, శ్రీ శంకరభగవత్పాదుల రచనలతో శ్రీనాథునకుగల పరిచయమును దలపింపజేయుచున్నది. ఈపద్య మాచార్యస్వాముల వారి మృత్యుంజయ మానసపూజోపహారములను స్మరింపజేయుచున్నది.

శ్లో. రాజాన్నం మధురం నితాంతమృదులం
మాణిక్య పాత్రేస్థితం
హింగూజీరక సన్మరీచిమిళితై
శ్శాకై రనేకైస్సుభైః,
పాకం సమ్యగపూపసూప సహితం
సద్యోఘృతే నాప్లుతం
శ్రీ మృత్యుంజయ పార్వతీప్రియ విభో
సాపోశనం భుజ్యతాం.

శ్లో. నాగర రామఠయుక్తం
సులలిత జంబీరనీరసంపూర్ణం,
మథితం సైంధవసహితం
పిబ హర మృత్యుంజయ క్రతుధ్వంసిన్.

మఱియు బైసీసపద్యమున శ్రీనాథునకు బరమేశ్వరునెడగల భక్తిభావముతోపాటు మంత్రశాస్త్ర పరిపాటీ పరిజ్ఞానము తెల్లమగుచున్నది. ఇట్టి పదార్థ సంయోజనము గుణనిధి చౌర్య ప్రవృత్తికి సముద్బోధకమైనది. "అప్పుడు భూసురప్రవరుండు నాసికాపుట కుటీ కుటుంబియగు పక్వాన్నగంధం బాఘ్రాణించి, యాయన్నంబు నాకెబ్భంగి సమకూడు నొకో? యని యప్పరిమళంబు జాడ పట్టుకొని పోయి శంభు భవన ద్వారంబునం గూర్చుండి, నృత్తగీత వాద్యంబులు ప్రవర్తిల్ల సరిప్రొద్దు పోవునందాక వీక్షించుచు, జాగరంబుసేసి, యంతింతపాగి ప్రజలు చొక్కమునుంగి యుండు దా నయ్యవసరంబున.

కట్టాయితంబుగా గటి మండలంబున
దీర్చి దట్టీచేల ద్రిండుగట్టి
తలుపు గిఱ్ఱనకుండ దరిమి కొంచెంబైన
యోరవాకిట దేహ మొయ్య జొనిపి
మునివ్రేళు లాయొయ్య మోపి చప్పుడుగాని
పరిపాటి జవనంబు బట్టియుడిచి
దీపాంకురచ్ఛాయ దెలివి చాలనియట్టి
కోనచీకటిలోని కొనరజొచ్చి

పళ్యెరములం దపూప సూపములతోడ
వడలు పండులతోడ నాజ్యంబుతోడ
దధిపయఃక్షౌద్రబహుపదార్థములతోడ
ధవళ కలమాన్న మీక్షించె ధరణిసురుడు.

జూదమునం దారి తేఱిన వాడు చౌర్యమునం దెంతటి చాతుర్యమును గాన్పింప జేయునోయను విషయ మీపద్యమున జిత్రింపబడినది. చౌర్యముకూడ నొకకళయే. ఇది కావ్యముగావున నాచౌర్యమును గూడ సర్వాంగ సుందరముగ జిత్రించి యున్నాడు. భూసురుడు చివర గన్గొనిన పదార్థజాతము పరమేశ్వ రోపహార యోగ్యమగుటచే నిచటి చౌర్యప్రవృత్తి గూడ గుణనిధికి సుకృత సంపాదకమే యయినది. తన చౌర్యము సఫలమగుటకు గావించిన యీ దీపసంయోజనముకూడ నాతని కుత్తమగతి ప్రాప్తిసాధనమైనట్లు మున్ముందు వ్యక్తమగును.

ఈ విధముగ విశేషయత్నముచేసి, పక్వాన్న పాత్రముచేత గైకొని వచ్చుచుండగా దైవవశమున, వాతని కాలిప్రే లొకని శరీరము దాకగా, వాడు 'దొంగ దొంగ' యని కేకలు వైచెను. వెంటనే తలవరులు మూగి గుణనిధిని బట్టిచంపిరి. పిమ్మట వానిని గొనిపోవుటకు యమదూతలు శివదూతలుకూడ వచ్చిరి. యమదూతలు గుణనిధి తొలుతనుండియు గావించిన దోషముల నిగ్గడించిరి. "వీడు కులాచార విహీనుండు. పితృవాక్య పరాఙ్ముఖుండు. సత్యశౌచ పరిభ్రష్టుండు. శివనిర్మాల్యాపహర్త. వీనియందు ధర్మలేశంబేనియు లేదు." అనిరి. ఆ పలుకులు విని శివదూతలు "శివధర్మ మతి సూక్ష్మము. శివధర్మము లేశమేని సిద్ధించిన నది మహాపాపోపద్రవము చేరనీయదు. ఇతఁడు చేసిన పుణ్యకర్మంబు వినుఁడు" అని గుణనిధి కబ్బిన సుకృతంబు నిట్లు వక్కాణించిరి.

అశన మబ్బకయున్నదైనను శివరాత్రి
యోరంతప్రొద్దును నుపవసించె
నోగిరంబు హరింప నొడవెట్టుకొనియైన
వేకువంతకుఁ జేసె జాగరంబు
పాత్రావలోకనోపాయంబునకునైన
వెలయించె దీపంబు వెలుఁగఁజాల
జూడనొల్లకయైన జూచె నీశ్వరుమౌళి
బరులు చేసినయట్టి ప్రసవపూజఁ
జచ్చె విధిమూడియైనను జంద్రధరుని
నగరిమోసాల చెంద్రోవ నట్టనడుమ
సూక్ష్మదృష్టి విచారించి చూచినప్పు
డింతకంటెను ధర్మంబు లెవ్విగలవు?

శివధర్మమునందలి ధర్మసూక్ష్మ మీ పద్యమున వివరింపబడినది. ఏతాదృశ శివధర్మస్వరూప నిరూపణ మీ యుపాఖ్యాన ప్రధానప్రయోజనములలో నొకటి. శాంతిరస పరిపోషక సామగ్రిలో ధర్మ ముత్తమమైనది. ఇట్టిధర్మము నాచరించుటచే సంప్రాప్తమైన సుకృతము వలన గుణనిధి మఱుసటిజన్మమున గళింగేంద్రుడై జన్మించి, తనదేశమం దంతటను నిలువరుస నీశ్వరాయతనంబుల దీపకళికలు నిలిపించి, తత్పుణ్య ప్రభావంబున దదనంతరజన్మమున విశ్రవసునకు సుతుడై లంకాధిపతియై క్రమముగ కుబేరుడై శివుని నెచ్చెలికాడై నిధిపతియై యలకాధిపతి యయ్యెను. ఇది యీ కుబేర వృత్తాంతమునం దనుస్యూతమైన యితివృత్తము.

ప్రపూర్వజన్మమున దురోదరవ్యసనమునకు జీవితము నంకితముచేసిన యాజ్ఞదత్తి వైశ్రవణుడెట్లు కాగలిగెనో?—యని సహజముగ బొడమెడి సంశయమునకు తరువాతి వృత్తాంతము పరాస్తము సేయును. ఈ తరువాతి యితివృత్తమును దీర్చి దిద్దునప్పటికి శ్రీనాథుని చిత్తవృత్తి మంత్రశాస్త్ర రహస్య పరిజ్ఞాన పరిష్కృతమై చంద్రశేఖరపదపద్మ ధ్యాన నిమగ్నమైనది. పార్వతీపరమేశ్వర దివ్యరూపానుభావములను స్వభావానుకూలగతిని జిత్రింప సమకట్టినాడా యీశ్వరార్చన కళాశీలుడు. ఆ సంవిధాన మరయుదము. కళింగాధిపతి తరువాతి జన్మమున విశ్రవస్సను మహర్షికి బుత్రుడై జన్మించి, కాశిలోన విముక్తక్షేత్రమున బదివేల వత్సరములు నిర్నిమేష దృష్టితో జంద్రశేఖరు నీక్షించుచు చర్మము నెముకలు నాడులు క్షీణించిపోవునట్లు పార్వతీపతి నుద్దేశించి తప మాచరించెను. అతని తపశ్చర్యాక్రమమున జ్ఞానావస్థితికి బరాకాష్ఠయైన నిదిధ్యాసస్థితి నిరూపింపబడినది. కళింగాధిపతియై దీపదానము అకుంఠముగ జేయుటచే వైశ్రవణుడైన కారణమున నిపు డుపక్రమించిన తపశ్చర్యయందును నాతడు దీపభావమును యోజించినాడు. గజాసుర సంహారియగు పరమేశ్వరుడు ప్రత్తితో దయారు చేయబడిన వత్తి, పార్వతి దీపాధారమైన స్తంభము. విశ్వాస తాత్పర్యసమన్వితమైన భక్తి చమురు. అవిచ్ఛిన్నమైన ధ్యాన ధార సముజ్జ్వలతరమైన దీపజ్వాల. కామక్రోధాద్యంతశ్శత్రురూప పాతకము లా దీపజ్వాలలో గూలెడి మిడుతలు. ఇట్టి సామగ్రిని సమకూర్చుకొని అప్రతిమ ధైర్య సంపత్తి గల యాజ్ఞదత్తి, విమలమైన విజ్ఞానదీపమును వెలుగ జేసెనట. ఈ తీరైన విజ్ఞానదీపము వెలుగుచుండ నాతడు శివున కభిషేకపూజల నీ క్రిందివిధముగ సమకూర్చినాడు.

# కాశీఖండము: కావ్యత్వము

విమల విజ్ఞానదీపంబు వెలుఁగుచుండ
శాంతి ధారాజలంబుల జలకమార్చి
భవుని భూజించె భావ పుష్పముల భక్తి
వతి విశుద్ధ మనోవృత్తి యాజ్ఞదత్తి.

"అవ్విధంబున యాజ్ఞదత్తి విజాతీయ ప్రత్యయా వ్యవహిత సజాతీయప్రత్యయ సంతానరూపంబైన నిదిధ్యాసంబున నివాతనిష్కంపదీపంబునుంబోలె పెద్దకాలంబు కాలకంఠ మంగళ జ్యోతిర్లింగ మూర్తి నంతరంగంబున బూజసేయుచుండిన, నా ఖండేందు మౌళి ప్రసన్నుండై వరంబు వేడు"మనెను. నిదిధ్యాస మనగా జ్ఞానమునకు సంబంధించిన అంతఃకరణ వృత్తి ప్రవాహ మెడతెగకుండ చిత్తమున ప్రవహించుట. అట్టిస్థితిలో చిత్తము నేకతానముగ పరమేశ్వరాయత్తము సేయుట. ఇట్టిస్థితి యేర్పడినపుడే పరజ్యోతి స్సాక్షాత్కారము గల్గును. విజ్ఞాన విభవమున కిదియే చరమసీమ. యాజ్ఞదత్తికట్టి జ్యోతిర్లింగ మయ పారమేశ్వర స్వరూప సాక్షాత్కారము గల్గినది. కాని యర్ధనిమీలిత నేత్రంబులు తెఱచిమాయసరికా దివ్య రూపమును గాంచలేక, అంజలిఘటించి, శిరమువేడు కొని "దేవా! మీ శ్రీపాదపద్మంబులు దర్శించునట్టి సామర్థ్యంబు కృపసేయవే! యిది నాకు వరం"బనిన త్రినేత్రు డాతనికి దివ్యదృష్టి యొసగెను. తద్దృష్టి ప్రసాదమున కృతార్థుడై యాతడు మేలుకాంచిన తొలుమాపునందే, పరమేశ్వరుని వామభాగమున ఒదు నాళ్ళకంటె ప్రాయమున బార్వతి యాతనికి గానవచ్చెను. అప్పటి యాదివ్యసౌందర్య మతివిలక్షణమైనది. పర్వతరాజపుత్రి శరీరకాంతి ఉత్పలదళకోమలమై మనో హరమైనది. ఆమె శ్రవణములందు కుండలములు, కరాంగుళుల నంగుళీయకములు, హస్తముల కంకణములు దాల్చియుండెను. ఇతరావయవములందును గాంతులు తులకించెడి మౌక్తిక రత్నాభరణము లొప్పగా నా జగన్మాత శంకరుని సమీపింపవచ్చు నప్పటి విలాస మమోఘము.

వకుళఫలాను కారులయి
వర్తులవలై మెఱుగారు గ్రొత్తమౌ
క్తికములపై రోకింత తుల
కింపగ, వీనుల హేమరత్న క
ర్ణికలు చలింప నందియల
క్రేంకృతి కంకణమేఖలాధ్వనిం
బ్రకటము సేయ మందగతి
భాస్వర నవ్యవిలాస మేర్పడన్.
అసమబాణ పునర్జీవనౌషధంబు
రాగజలధి విధూదయారంభ వేళ
సకలజగదేకసౌభాగ్య జన్మభూమి
శంభు డాయంగ వచ్చె నా శైలకన్య.

ఈపట్టున శ్రీనాథుడు జగజ్జనని సౌందర్యమును శాంతరసభావాభివ్యక్తి కనుగుణముగ చిత్రించిపెట్టి నాడు. ఈ వర్ణనము శ్రీ శంకర భగవత్పాదులు మానసిక పూజావసరమున బరదేవత కల్పించిన భూషణజాలమును దలపింప జేయుచున్నది.

శ్లో. మంజీరే పదయో ర్నిధాయ రుచిరాం
విన్యస్య కాంచీం కటౌ
ముక్తాహారం మురోజయో రనుపమాం
నక్షత్రమాలాం గళే,
కేయూరాణి భుజేషు రత్నవలయ
శ్రేణిం కరేషు క్రమా
త్తాటంకే తవ కర్ణయో ర్వినిదధే
శీర్షేచ చూడామణిం.

నవరత్నమయమైన యంగుళీయకము యాజ్ఞదత్తి వైశ్రవణుడగుటకు మూలమైన కారణమున గాబోలు జగజ్జనని సర్వావయవ సమన్విత విభూషణగా వర్ణింపబడినది. శ్రీనాథుడు సామాన్యముగ స్త్రీసౌందర్యమును వర్ణించు ఘట్టములలో నెడపనైన కచకుచనితంబాభోగములను వయోవస్థానురూపముగ వర్ణింపక మానడు. కాని యిచట దత్ప్రసక్తియే లేదు. ఇది శాంతరసము చర్వణస్థితి నందవలసిన ఘట్టము. శృంగార రస భావనావాసన యేపాటిదైన బొడసూపినచో నది శాంతమునకు విరోధిరససామగ్రి యగును గావున ప్రధాన రసపరిపోషణదృష్టితో తద్విసర్జనము గావించి నాడు. అదియునుగాక నిట యాజ్ఞదత్తికి సాక్షాత్కరించినది పర్వతరాజపుత్రి. కావున నామె యూహాతీతమైన సౌందర్యమును సమకూర్చుటకై యాజగజ్జననిని మన్మథపునర్జీవనౌషధముగా, సకలలోక సౌభాగ్య జన్మభూమినిగా, ప్రణయజలధికి జంద్రోదయారంభ వేళగా జిత్రించినాడు. శ్రీనాథుని రచనలో దివ్యత్వముతోగూడిన సౌందర్యమును వర్ణించిన ఘట్టము దీనిని మించినది వేఱొక్కటిలేదని యనవచ్చును.

ఈ విధముగ నా జగజ్జనని పరమేశ్వరుని డాయ వచ్చి, కాలోన్మీలితశిరీష కుసుమకేసర సుకుమారంబు కస్తూరికా స్థాసక ముద్రాభిముద్రితంబు నైన తన భుజంబు భుజగాభరణభూషితంబైన ఫాలలోచను భుజం బొరయునట్లుగా నిలిచిన జూచి యాజ్ఞదత్తి చిత్తంబునం దీర్ష్య వహించెనట. ఇచటి యీర్ష్యా క్రమ మాతని భక్తి తత్పరతయందలి యుదాత్తతకు నిదర్శనము. ఈ భావముకూడ నిచట మధురోదాత్తముగ జిత్రింపబడినది.

ఎవ్వతె యొక్కొ యీ యిందుబింబానన
జగదేక సౌభాగ్య జన్మభూమి ?
కమలాయతాక్షి నాకంటె నగ్గలముగా
నెటు చేసె నొక్కొ తా నీతపంబు ?
పరమేశు డీబింబఫలపాటలాధర
ననుమీఱ మన్నించినాడు మేలె ?
భాగ్యంబు గాకేల బాలేందుశేఖరు
కృపగాంచె నీ రాజకీరవాణి
యనుచు గ్రేగంట నీరసం బావహింప
గినుక గిలికించితము నాత్మ గీలుకొనగ
సవతి నీక్షించు ప్రౌఢయోషయును బోలె
బ్రాహ్మణాంగన చూచె బర్వతరాజతనయ.

భర్తృవాల్లభ్యమును జూఱగొనజాలిన సవతిని ప్రౌఢయువతిని గినుకతోడను కిలికించితముతోడను చూచినట్లు యాజ్ఞపత్తి పర్వతరాజతనయను వీక్షించె ననుటలో నీర్ష్యాపరవశ హృదోద్యదార్తిముగ జిత్రింప బడినది. సాధారణముగ రాజతనయలకు సపత్నులతోడి సంబంధ ముండుట, భర్తృప్రేమ విషయమున నీర్ష్యాభాజనలగుటయు సహజమను విషయమిట వ్యక్తమైనది. మఱియు యాజ్ఞపత్తికి తన తపశ్చర్యయెడగల ప్రత్యయము, నిజభక్తిభావము నెడగల విశ్వాసము నభివ్యక్తమైనవి. సపత్నీ విషయ కేర్ష్యాభావ సముద్రేకము కలహకారణముగాక మానదు. ఇచట యాజ్ఞదత్తికి జనించిన యీర్ష్యారూపు, నాలుమగలైన పార్వతీపరమేశ్వరుల నడుమ నొంటికలహము రేగుటకు కారణమైనది. ఆట్టికలహమున నుపక్రమింపజేయుచు, పార్వతికి బరమేశ్వరునెడగల ప్రభుత్వము నభివ్యక్తీకరించుటకై ఆ జగజ్జననిని సకలజగదధిష్ఠాత్రినిగా శ్రీనాథుడు నిరూపింప సమకట్టినాడు.

కృత్యపంచకము సాగింపలే డే యింతి
ప్రాపులేక కృతాంత భంజనుండు
నిండుచందురుని జంద్రికవోలె నే భామ
పంచబాణ విరోధి బాయకుండు
నే లేమ శివపాళి కిచ్ఛాక్రియాజ్ఞాన
శక్తియై కల్పించు సకల జగము
నే గంధగజయాన హృదయ మువ్విళ్లూర్చి
భవుని మై జక్క సాబాలుగొనియె
మహిత హృల్లేఖికా మహామంత్రమునకు
దేవరారోహ ముఖ్యాధిదైవతంబు
సకల జగదధిష్ఠాత్రి యా శైలపుత్రి
విభున కిట్లని మధురోక్తి విన్నవించె.

మంత్రశాస్త్రప్రసమ్మతమైన స్తుతులందు పరదేవతాస్వరూపము బహువిధంబుల వివిధ ప్రభావసమన్వితముగ నిరూపింపబడినది. వానిలో లలితా సహస్రనామాదిస్తుతులం దుద్దిష్టములైన పరదేవతా విభవములు కొన్ని యీపద్యమున గ్రథితములైనవి. సీసములో రెండు నాలుగుపాదములలోని విషయము కుమారసంభవమునందలి "సమాదిదేశైకవధూం భవిత్రీం ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య" అను కాళిదాసోక్తులను స్మరింపజేయుచున్నది. ఇట్లీతెఱగున గావించిన భావవిన్యాసము శ్రీనాథునకు పరదేవతయెడగల భక్తిభావన నభివ్యక్తము చేసినది.

అట్టి ప్రాభవముగల పార్వతి విభునితో విన్నవించుచు, "త్ర్యంబక! వీడెక్కడి దురాత్ముడు? నన్ను మాటిమాటికి గ్రేగంటఁజూచుచు, వికారములు గన్పఱచుచున్నాఁడు. అబద్ధములాడుచున్నాడు. నీవు వీనిపై గృపగలిగి యిట్టి చనవిచ్చుటచే నీ మాటలకు గాను తేన్పడినవి. నా సౌందర్యమున కితడు మదిలో నిష్కారణముగ నీరసపడుచున్నా"డనెను. దానికి బరమేశ్వరుడు మందహాసము సేయుచు నిట్లనియె.

"మనమునయందు నీ నెరులు
మానుము పర్వతపుత్రి! వీడు నీ
తనయుడు; నందను ల్బహు వి
ధంబుల ధార్త్యము లాచరించినం
గినియునె తల్లి భావమున?
గీల్పరిశించిన దేవతావలం
బన గతి భావమై పరగు
భావన కౌశల మీ ప్రకారమై."

ఇంతవఱకు నిది మూలానుసృతమైన భావము. పిమ్మట శ్రీనాథుడు ప్రకరణోచితముగ భావమును బొడిగించినాడు. ఇందలి రహస్యమును బరికించిన దేవతాశ్రయ వర్తనము చిత్తవృత్తియు గలవాని భావనాకౌశల విలాసముగ నే యుండును. అనగా పరమేశ్వరాలంబన భావనాసమున్మిషితములైన భావ విశేషములు బాహ్యదృష్టికి వేఱుగా గానవచ్చినను, నవి పరిగ్రాహ్యములే గాని వర్జ్యములు గావు. బాహ్యదృష్టి కీర్ష్యాద్వేషాది సంకుచితభావములుగా గానవచ్చినను నవి, దేవతాలంబనము లగుటచే భక్త్యాది భావపర్యవసన్నములే యగును—అనుట. ఇది శ్రీనాథుడు తన్ను గూర్చి తానెఱిగించిన కీలు. తన కావ్యరచనలో గానవచ్చెడి వివిధ రసాశ్రయభావములు, దేవతాలంబనము లగుటచే పరతత్త్వ సాక్షాత్కార పర్యవసన్నములే గాని యన్యములు గావనియు, ఈ కీ లెఱుఁగ కుండ తన్నన్యథా భావింపవలదని యొక హెచ్చరిక చేసియున్నాడు. ఈ కీ లెఱుఁగకున్న పరమేశ్వరాలంబన గతిభావనా నివిష్టమతియై పరమభక్తుడై శ్రోతృవక్తలకు శుభానంద పరంపరావహమైన కావ్యములకు స్రష్టయైన శ్రీనాథు డఖండ పరమేశ్వర భక్తుడుగా నెఱుఁగబడు టెట్లు ?

# సాహితీ సుగతుని స్వగతం

"నిన్ను చూస్తే తంతా మనిపిస్తుందోయ్!" అన్నారు డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఒకనాడు సెంట్రల్ స్టేషనులో బండెక్కుతూ నన్ను చూచి. "అంతటి అపరాధం ఏమిచేశానండీ?" అని ప్రశ్నించాను వినయంతో. "అపరాధమా? మహాపరాధమే చేశావు. సంస్కృత ప్రాకృత సాహిత్యాలకే ద్రోహం తలపెట్టావు. గాథాసప్తశతిలో తెలుగు పదాలు చేరాయని వ్రాశావు. ఈ ప్రతిలోమాన్ని ఎవరు సహిస్తారు?" అన్నారు ఉద్రేకంతో.

"భాషల విషయంలో అనులోమం ఎంత సహజమో ప్రతిలోమంకూడా అంతే సహజమండీ. రాజకీయ ప్రాబల్యం, సాహిత్య ప్రాచుర్యం, మత ప్రాభవం — ఈ కారణాలతో వ్యాపించిన సంస్కృత భాష విభిన్న సంఘాలతోను, జాతులతోను సంబంధం ఏర్పడినకొద్దీ, వాటి భావాలను, వాటి భాషల పదాలను గ్రహించుకొంది. అన్యభాషా పదాలనూ, సంప్రదాయాలనూ సంతరించుకోనకపోయి ఉంటే సంస్కృత సాహిత్యం ఇంత విస్తరించి ఉండేదికాదని విమర్శకులు అంటున్నారు. సంస్కృత ప్రత్యయాలతోను, ఉపసర్గలతోను ఇతర భాషాపదాలు వేషం మార్చుకొని సంస్కృతంలో లీనమైన వనడానికి తంత్రవార్తిక కారుడైన కుమారిలభట్టు వాక్యాలే మనకు నిదర్శనం. జైనబౌద్ధ మతాలద్వారా దక్షిణ భారతదేశంలో వ్యాపించిన ప్రాకృతభాష కూడా సంస్కృతంవలెనే ఆ దేశభాషల సంప్రదాయాలనూ, శబ్దసముదాయాన్నీ తనవిగా చేసుకోనకపోలేదు. కాని,......" అని గుక్కతిప్పుకోకుండా అంటున్నాను

"ఉండవయ్యా. నన్ను మాట్లాడనీ. బండి ఎక్కు. కూచోని మాట్లాడుదాం. బండి కదిలేసరికి దిగుదువుగానీ." అన్నారు ఆయన.

బండి ఎక్కాను. ఆయన ద్రావిడభాషా శాస్త్రజ్ఞులపై ఒక్కఊపుగా విరుచుకుపడి "ఎవరయ్యా వాటిని అన్యభాషాపదా లన్నవారు? ఏమిటి వినిగమకం?" అన్నారు. "ఇదేమిటండీ! ప్రాకృత కావ్య వ్యాఖ్యాతలందరూ ఆలాటి పదాలను 'ఇతి దేశీ' అని నిర్దేశిస్తూనే ఉన్నారుకదా? వారు దేశ్యాలను ప్రాకృత ముద్ర వేద్దామనే వ్యామోహం లేనందున 'దేశీ' అని ప్రత్యేకంగా పేర్కొన్నారు. రోలంబ, రింఛోళి, తాలూరాది దేశిపదాలు ప్రాకృతంలో చేరిపోగా, వాటిని సంస్కృత పదభ్రాంతితో సంస్కృత మహాకవులు కూడా గతానుగతికంగా ప్రయోగించగా, 'మేదినీ' మున్నగు సంస్కృత నిఘంటువులు స్వీకరించి సంస్కృతముద్ర వేశాయి. "రోలంబశబ్దం సంస్కృతేపి కేచిద్గతానుగతికతయా ప్రయుంజంతే" అని ఆచార్య హేమచంద్రుడు దేశిపదకోశమైన 'దేశీనామమాల'లో (7-2) చెప్పించాడు." అన్నాను.

"పన్నెండో శతాబ్దంలో పుట్టిన ఆచార్య హేమచంద్రుడా నీకు ప్రమాణం? దేశీ నామమాల అనే తన దేశి నిఘంటువులో హేమచంద్రుడు తద్భవా లనదగిన అమిరాసణ్ణిగ్గమో, పుసిల్లదేవో వంటి పదాలనూ దేశీపదా లన్నాడని దానిని రెండవసారి సంస్కరించిన శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి గారు పీఠికలో తెలిపారు చూచావుకదూ?" అన్నారు ఆయన వెటకారంగా.

"మాపకేమండీ? ఆచార్య హేమచంద్రుడు తన కాలంలో సంస్కృత ప్రాకృత సాహిత్యాలలో యుగపురుషుడు. 1088 లో జన్మించి జీవించిన 84 సంవత్సరాలూ తర్క, వ్యాకరణ, జైనవేదాంత శాస్త్రాలలోను, అలంకార సాహిత్యాలలోను ప్రామాణికమైన ఉద్గ్రంథాలు రచించిన వాగనుశాసనుడు. అలాటివాడు ప్రమాణం కాకపోతే మరెవరు ప్రమాణమండీ? హేమచంద్రుడు ప్రాకృత సాహిత్యంలో కనిపించిన దేశిపదాలను ఎంతో వివేచన చేసికాని తన దేశీ నామమాలలో చేర్చుకోలేదు. తన ఈ నిఘంటువులో తనకు ముందున్న దేశీ పదకోశకారులు — అభిమానచిహ్న, గోపాల, దేవరాజ, ద్రోణ, ధనపాల, పాదలిప్తాచార్య, రాహులక, శీలాంకాదులను ఉదాహరించి కొందరి మతాలు ఖండించి, మరికొందరి మతాలు సమర్థించాడు.

"దేశీ దుష్పందర్భా
ప్రాయ స్సందర్భితాపి దుర్బోధా,

ఆచార్య హేమచంద్రః
తత్తాం సందృభతి విభజతిచ."

(దేశీ పదాలను అన్వయించడం కష్టం. అన్వయించినా అర్థంచేసికొనడం కష్టం. అలాటివాటిని హేమచంద్రుడు అన్వయించి సుబోధం చేస్తాడు.) అని గ్రంథాదిలో చేసిన ప్రతిజ్ఞను నిర్వహించుకున్నాడు. "ఇప్పటి దేశీ నిఘంటుకారులవీ, నాటి వ్యాఖ్యాతలవీ ఎన్ని తప్పులని ఎన్నను? (అనుసాతిన దేశీ కారాణాం, తద్వ్యాఖ్యాతౄణాంచ కియంతః సమ్మోహాః పరిగణ్యంతే. 8-12)" అని విసుక్కున్నాడు కొన్నిచోట్ల. తను సారతర దేశీ దర్శనంతో వ్రాస్తున్నానని, తన నిఘంటువులో పొరపాటులుండవని 'తిణిస' శబ్ద వ్యాఖ్యాన సందర్భంలో స్పష్టపరిచాడు. (తిణిసం చ వృక్షవిశేష మాచక్షతే. అస్మాభిస్తు సారతర దేశీ దర్శనేన తిణిస శబ్దో మధుపటలార్థో వ్యాఖ్యాతః. తత్రియుక్తాయుక్తస్య బహులవృత్త్యానః ప్రమాణం. 8-12) అంతేకాక దేశీ నామమాలలో పదాలన్నిటినీ అకారాదిగా—మొదటివర్గంలో అజాది పదాలు, అనేకార్థాలు; ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ వర్గాలలో కచటతపవర్గాది పదాలు, వాటి అనేకార్థ పదాలు. సప్తమవర్గంలో యలవకారాది పదాలు, వాటి అనేకార్థాలు; అష్టమవర్గంలో సహాదిపదాలు క్రమబద్ధంగా ఇచ్చాడు. ఇంతటివాడు కాక మరెవరండీ ప్రమాణం? అన్నాను.

"సరేకాని, హేమచంద్రుడు చెప్పిన దేశీ పద నిర్వచనం అతివ్యాప్తం కాదూ?" అన్నారు ఆయన. అతివ్యాప్తం ఎందుకవుతుందండీ? వాడు స్పష్టంగానే చెప్పాడు.

"దేసవిసేస పసిద్ధీ ఇ
భణ్ణమాణా అనంతయా హుంతి,
తమ్హా అణాఇ పాఇఅ
పయట్ట భాసావిసేసఓ దేసీ."

అని—(దేశవిశేష ప్రసిద్ధమైనవి అనంతంగా ఉంటాయి పదాలు. వాటినుంచి అనాది ప్రాకృత ప్రవృత్తి భాషావిశేషమే దేశీ) అన్నాడు కదా. అయినా,

'వాచస్పతే రపి మతిః
న ప్రభవతి దివ్యయుగ సహస్రేణ,
దేశేషు యే ప్రసిద్ధాః
తాన్ శబ్దాన్ సర్వతః సముచ్చేతుమ్.'

(దివ్యయుగ సహస్రం శ్రమించినా వాచస్పతి అంతవాడుకూడా ఆయా ప్రాంతాల్లో ప్రసిద్ధమై ప్రాకృతంలో చేరిపోయిన దేశిపదాలను ఏర్చి కూర్చడం కష్టం) అని ఎంతో వినయంతో స్పష్టీకరించాడు. దీనినిబట్టి తెనుగు, తమిళ, కన్నడాది దేశిభాషా పదాలను ఎంతో శ్రమపడి, వాటి పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకొని క్రోడీకరించాడనడం విస్పష్టం." అన్నాను.

"అక్కడే వచ్చింది కలిగింది అపోహ. హేమచంద్రుడూ అపోహపడ్డాడు. దానినిబట్టి శ్రీ రామానుజస్వామిగారూ అపోహపడ్డారు. దేశీ నామమాల 'గ్లాసరీ' లో కొన్ని దేశిపదాలకు మూలమంటూ తెలుగు, తమిళ, కర్ణాటాదిపదాలు ఇచ్చారు. ద్రావిడ భాషా కుటుంబం అన్నదే లేదు. అంతా సంస్కృతం నుంచీ వచ్చిందే." అన్నారు ఆయన. "శ్రీరామానుజస్వామిగారు తెలిపినది కాక మరికొన్ని తెలుగు తమిళ పదాలు కనుక్కున్నానండీ నేను దేశీ నామమాలలో." అన్నాను. ఆయన విని వినిపించుకోకుండానే, "ఏవీ? చెప్పు. ఇద్దరినీ ఖండిస్తాను," అన్నారు. "వినండి!" అంటూ మొదలుపెట్టాను.

అణ్ణీ=దేవర భార్య, పతిభగినీ, పితృష్వసా అని మూడర్థాలిచ్చాడు. ఇది పూర్తిగా తమిళపదం. నేటికీ అన్నభార్య – వదినె—అనే అర్థంలో తమిళదేశంలో వ్యవహారంలో ఉంది. తర్వాత వదినెగారు (పతిభగినీ) అనే అర్థంలోను వ్యవహృతమైంది.

ఉసూ=తృణ పరిహరణం–తృణాచ్ఛాదనం అన్నాడు. అవగాహంలో ఆశ్రయం ప్రధానంగా స్ఫురిస్తుంది గనుక ఇది ఊడు అనె తెనుగుపదంనుంచి కాని, ఊడు—హరించు అనే ద్రావిడ ధాతువునుంచి కాని నిష్పన్నమై ఉంటుంది. ఊడ్పు, ఊడుగరు తెలుగు.

ఊసలం=పీనం అన్నాడు. ఇది ఉసులుకొను అనే తెనుగు క్రియనుంచే పుట్టిఉంటుంది.

ఒఅవల్లో=బాలాతపః. ఉదయపు ఎండ. ఇది బాలాతప శబ్దభవం కావచ్చు కాని, దేశీ పదమన్నాడు గనుక వెయ్యిల్ అనే తమిళపద భవమా అన్న అనుమానం కలుగుతుంది. ఓలఇణీ=దయితీభూతా. ఇది వలచు అనే తెనుగు ధాతువునుంచి వచ్చిందనుకుంటాను. ఓలుంకీ=ధన్యరమణం—అంటే దాగుడుమూతలు. ఒళిందుకొళ్ అనే తమిళ దాతువు దీనికి మూలమై ఉంటుంది. ఒసిఓ=అబలః. ఇది ఓసి లోడునుంచి వచ్చిందేమో! ఓసి—తమిళపదం.

కలింజం, కిలించం (కిలించిఅం)=లఘుదారు. చిన్నకర్ర, పుడక. కిలించిఅశబ్దానికి కిలిచ్చిఅం అనే రూపాంతరమూ ఉంది. హేమచంద్రుడు కలింజం, కిలించం అనే పదాలకు లఘుదారువు అన్న అర్థం

# సాహితీ సుగతుని స్వగతం

చెప్పాడు కాని గాథాసప్తశతిలో (1-80) కిలించిఅ కంటకేణ అని ప్రయోగం కనిపిస్తుంది. కిలించిఅ కంటఅం చిన్నముల్లు. ఈ కిలించిఅం క్రమంగా కలింజం, కిలించం అని మారి చిన్న పుడక అనే అర్థంలో రూఢమై ఉంటుంది. మనకు సన్నని, నీచమైన అనే అర్థాలలో క్రించు, కించు శబ్దాలున్నాయి. తమిళ కన్నడ భాషలలో కిళి, కిళింజల్, కిలిచ్చల్, కీళ్ శబ్దాలకు సన్నని, సన్నగాచేయు, చించు అనే అర్థాలున్నాయి. కొంచెం, కెల, శిల పదాలు అల్పార్థకాలు. కలింజ, కిలించ పదాలకు పైన ఉదాహరించిన ద్రావిడ పదాలకూగల సామ్యాన్నిబట్టి అవి వీటికి మూలమై ఉంటాయి. వీటిని గతానుగతికంగా సంస్కృతపండితులూ ప్రయోగించగా, త్రికాండశేషకారుడు కిలింజకం కిలింజం అని సంస్కృతిముద్ర వేసి సూక్ష్మదారువు అని వ్యాఖ్యచేశాడు. కీలం=స్తోకం. ఈ పదం ముందు చెప్పిన ద్రావిడ పదవర్గంలోదే.

కుమ్మణం=మ్లానం. కుములు అనే తెలుగు పదానికిది దగ్గరగా లేదూ? కుంపిఅ=కృశః. దీనికి కుందు, కందు అనే తెనుగు, కన్నడపదాలు మూలమనుకుంటాను.

చట్టూ=దారుహస్తః. కర్రగరిటె, తెడ్డు. చటుఅం—అని గాథాసప్తశతిలో (2-62) ప్రయుక్తమైంది. చట్టువం అనేపదం గరిటె, తెడ్డు అనే అర్థాలలో తెనుగు తమిళులలో ఉంది. "చట్టువం బొకచేత బట్టి ఖడ్గము వంక పగిలించి" (భార విరా. 1-211) "ప్రక్షాళితంబైన పసిడి చట్టువమున నన్నంబు నునిచి నెయ్యభిఘరించి." (కాశీ. 7-147) చిన్న మట్టి కర్ర పాత్రలను కన్నడంలో చటుకి అంటారు. దారుహస్తం అని హేమచంద్రుడు అర్థం చెప్పాడు గనుక దీనికి చెట్టుపదంతో ఏదైనా సంబంధం ఉందేమో! మొదట కర్ర గరిటెకు వ్యవహారంలో ఉన్న ఈపదం తర్వాత గరిటె సామాన్యానికి వ్యవహారమై ఉంటుంది.

చారో=ప్రియాలవృక్షః. సారచెట్టు. ఇది (సార-చార) తెనుగని వేరుగా చెప్పనక్కరలేదు. చుడులీ=ఉల్కా. కొరివి. చుడు (కాల్చు) అనే ద్రవిడపదం దీనికి మూలం.

జంబువో, జంబులో=వేతసః జంబుగడ్డి. కన్నడంలోను, కన్నడ పరిసరప్రాంతాలలోను ఒకరకం రెల్లుకు వ్యవహారంలో ఉంది.

తణ్ణాయం=ఆర్ద్రం. తడిసినది, చల్లనిది. తనియు తనుపు, తంపు తెనుగులోను, తణ్ణన తంపు కన్నడంలోను ఉన్నాయి. ఇది తన్మూలజన్యపదం.

తాలూరో=ఆవర్తః. సుడి. తలయతి తలం దర్శయతీతి తాలూరః—అని కల్పశబ్దద్రుమం ఉత్పత్తి. తాలూరశబ్దం గాథాసప్తశతిలో (1 37) ప్రయుక్తమైంది. ఈ శబ్దం దేశిఅని వ్యాఖ్యాతలందరూ అన్నారు. తిర్, త్రిప్ప, తిరుగు, తలాగు అనేవి తెలుగుల్లో భ్రమి వాచకాలు. తలారు శబ్దానికి మరలు తిరుగు అనే అర్థాలున్నాయి. "క్రేపులం దలచి తలారింపక" (భాగ. 10 స్కం) అని ప్రయోగం. తలారుకు తాలూరకూ పోలిక ఉంది. తాలు శబ్దానికి తిరుగు, తాలించు, తాలబోయు అనే అర్థాలున్నాయి. కనుక తలార శబ్దమే తాలూర శబ్దానికి మూలమై ఉంటుంది.

తిణిసం=మధుపటలం. తేనెతెట్టె. తిణిసపదం దేశిపదమని హేమచంద్రుడు రాసిన దాన్ని ఇది వరకే తెలిపాను. తేన్, తేనె, జేన్, జున్ను ద్రావిడపదాలు. తిణిసం ఈ తేనె నుంచి వచ్చి ఉంటుంది.

పడుజుఅఈ = తరుణీ. ఇది పడుచు, యువతి అనే తెలుగు సంస్కృత పదాల కలయికతో ఏర్పడిందనుకుంటాను. పలం=పలసం స్వేదః. ఇది పొలసు అనే తెలుగుపదం మారురూప మనుకుంటాను. పిల్లిరీ=గండుత్రంజ్ఞంతృణం. ఇది పుల్ల, పుల్లు పూరి- అనే ఈ తమిళ తెనుగుపదాలనుంచి పుట్టిఉండదా? పేంపిఅం=పంకః. పెడి. దీనికిమూలం పెణ్ అనేపదమై ఉంటుంది పెండి అని దక్షిణాంధ్రుల వ్యవహారం. కనుక ఇది పెణ్, పెండి నుంచే వచ్చిఉంటుంది. పాణో=శ్వపచః. పాణశబ్దం గాథాసప్తశతిలో ప్రయుక్తమైంది. "పాణసి పువ్వు బోడులము" (హరిశ్చంద్ర. ఆ-2.) పాణసిలోని అంత్యసికారం లోపించి పాణమాత్రం మిగిలి ప్రాకృతంలో చేరింది.

ఫలహీ=కార్పాసవృక్షః, పత్తి, పత్తిచెట్టు. ఈ పదం గాథాసప్తశతిలో నాలుగుసార్లు ప్రయుక్తమైంది. "ఫలహీ కార్పాసవృక్షే - దేశీ" అని కులబాలకవుని వ్యాఖ్య. హేమచంద్రుడు దీనికి వలహీ, వణీ అనే పర్యాయాలుకూడా ఇచ్చాడు. తెనుగు ప్రత్తే ఫలహీగా మారిందని నానమ్మకం. ప్రత్తికి పూర్వరూపమైన పఱుత్తి పలుత్తిఅయి అంత్య ద్విత్వాక్షరం ఊది పలకడంలో కలిగిన ప్రయత్నంలో మొదటిపకారం మహాప్రాణమై ఉంటుంది. పండి భోండీ అయినట్లు— పలుత్థీ, ఫలహీ అని. పత్త్రికా శబ్దంనుంచి పత్తిఅయి ఉంటుందని, ప్రపత్రికా శబ్దంనుంచి ప్రత్తి పుట్టిఉంటుందని మీరు (శ్రీ నారాయణరావుగారు) చేసినవాదం సహేతుకంగా కనిపించదండీ. పత్రికాశబ్దం నుంచి పత్తియా-పత్తీ కావడానికి వీలున్నా అర్థంకోసం

లాక్షణికంగా నానాభాషలూ పఠించవలసివుంటుంది. ప్రపత్రికాశబ్దంనుంచి ప్రత్తిఅనేరూపం అసలే కాదు. తెలుగు సంప్రదాయానికి ఉపసర్గవిధానమే విరుద్ధం. పత్రికానుంచి పత్తిత కావచ్చు కాని "ఫలహీ"ని ఏవిధంగానూ సాధించలేము. ఛిద్రవాచక ఛిల్ల-ఉచ్ఛిల్ల శబ్దాలు రెండూ వేర్వేరనీ, ఉచ్ఛిల్లశబ్దం ఉత్పూర్వక శిల్లశబ్దం కాదనీ: దేశీశబ్దాలకు ఉపసర్గ సంబంధం వుండదనీ హేమచంద్రుడు ఉచ్ఛిల్లపద వ్యాఖ్యలో (1-95) చెప్పినాడు. (నహి దేశీశబ్దానాం ఉపసర్గ సంబంధో భవతి) ఫలంనుంచి ఫలఅయినా ఫలీఅయినా ఫలహీ అని అంత్యహికారం ఎక్కడనుంచి సాధించగలం?

బోదరం-పృథు. పెద్దది. ఇది బోద, బొద్దు అనే పీనార్థకశబ్దాలకు దగ్గరగా లేదూ?

భుండీరో=సూకరః. పంది. దీనికి భుండో బుంద్రో అనేవి రూపాంతరాలు. గాథాసప్తశతిలో భోండీ (5-2) అని ప్రయోగం. ఈ మాటలు వినీవినగానే మనకు పంది అనే తెలుగుమాట మనసుకు తట్టడంలేదూ? ప్రాకృతంలో ఇ-ఎలకు, ఉ-ఒలకు పరస్పర వినిమయం సహజంగనుక భోండ శబ్దాన్ని గ్రహించినట్టే. తెలుగువ్యవహారంలో పదాది అకారం ఎకార ఒకారాలుగా మారుతుంది. గడ్డ-గెడ్డ. గరిట - గెరిట. మగడు - మొగడు. "మొగడొచ్చి పిలిచెను పోయివచ్చెద సామి." పప్పులు-పొప్పులు. కన్నడంలోను ఇలామారడం కద్దు. ఇలాగే పంది పొందిఅయి, తవర్గం టవర్గంగా మారి, పొండి అని ఉచ్చరించడంలో చేయవలసిన ప్రయత్నాన్నిబట్టి ఆదివర్ణం మహాప్రాణంగా పరిణమించి భోండి అయిఉంటుంది. ఇది ఈకారాంతం కావడం వల్ల స్త్రీలింగమని భ్రమపడినందున భోండ, భుండ శబ్దాలు కల్పించబడ్డాయి. భుండీరో-పదంలో పంది ప్రాచీనరూపం తొంగిచూస్తున్నది చూడండి. పందికి పూర్వరూపం పంద్ఱి. ప్రస్తుతం తమిళంలో పన్ఱి. రేఫ సహిత నకారాన్ని ఉచ్చరించడంలో న్ద్రి ఉచ్చారణ ఏర్పడుతుంది; న్డ్రి కూడా అవుతుంది. పన్-రెండు=పంద్రెండు. పంద్రెండు మలయాళరూపం. పన్నెండు తెలుగువ్యవహారరూపం. పన్ద్రి పంది అయింది తెలుగులో. పన్ని అనేరూపం వ్యవహారచ్యుతమైంది. పన్ని నేడు తమిళ వ్యవహారంలో ఉంది. కనుక పంద్ఱి పదం ప్రాకృతంలో బుంద్రో, భుండో, భుండీరో, భోండీ అనే పెక్కురూపాలతో చేరిందని ఊహించడం అసమంజసం కాదు.

మండిల్లో=అపూపః. భక్ష్యవిశేషం. ఇది తెలుగు కన్నడాల మండిగలు కాదూ? మలట్టో=గర్వః. ఇది మొరటు, మోటు, మోడు శబ్దాల వికృతి అనుకుంటాను. మాకందో=ఆమ్రః. మామిడి. దీని పుట్టుపూర్వోత్తరాలు చాల ఉన్నాయి. మరొకమాఱు చెప్పిద్దాము.

హల్లీసో=రాసకః. మండలేన స్త్రీణాం నృత్యం. మనకు, కన్నడంవారికీ హల్లీ అనేపదం ఉంది. ఇది సున్నకు పర్యాయం. చిన్న వర్తులానికి అల్లి అంటారు కొన్ని ప్రాంతాలలో. గోలీలనుకూడా అల్లి కాయలంటారు. అల్లికాయలంటే గుండ్రని గుళ్లు. బొంగరాలాటలో నేలమీద గుండ్రని గీటుగీచి దాని మధ్యన ఒక బొంగరాన్ని ఉంచుతారు చూచారా? అలా గీచే గుండ్రని గిరిని అల్లి అంటారు. అలాగే పిల్లలు ఒకరిచేయి ఒకరుపట్టుకొని గుండ్రంగా పెండెం కట్టి నిలవడాన్ని అల్లి కట్టడం అంటారు. కనుక ఈ అల్లే హల్లీసో అయిందేమో! హల్లీసం నుంచే అల్లి కాకూడదూ అని ఎదురు ప్రశ్న వేస్తారుకదూ? కావచ్చు. కాని హేమచంద్రుడు దీన్ని దేశీపదంగా పరిగణించాడు కనుకనే ఈ శ్రమంతా.

హుడ్డా=పణః. పందెం. ఇది ఒడ్డు అనే తెలుగు పదం వికృతే అయి ఉంటుంది.

హేరంబో=మహిషః. దున్నపోతు. ఇది ఎరుమై (ఎమ్మె-క. ఎనుము-తె.) నుంచి వచ్చి, సంస్కృతంలో చేరి అన్యార్థ వాచకమైందని కిట్టెల్ తన కన్నడ నిఘంటువులో వ్రాశాడు. హేమచంద్రుడు దీనిని దేశి అంటున్నాడు గనుక ఎరుమైనుంచి ఇది ప్రాకృతంలో చేరి ఉండవచ్చు.

హోరణం=వస్త్రం. ఇది పోర్వై, పోరణం-అనే ద్రవిడపదాలనుంచి వచ్చి ఉంటుంది. పోర్వై అంటే కప్పుకొనే వస్త్రం. ఇంకా ఎన్నో ఉన్నాయి ద్రవిడ పదాలు-ఇలా చెబుతూ పోయాను. బండి అరకోణంలో ఆగినప్పుడు గాని తెలీలేదు, ఎంతసేపు అయిందని. మరొక సమస్య వచ్చింది; టికెట్టులేక నే బండి ఎక్కాను.

"చూచావా? నీకిదే శిక్ష. తెల్లవారుజాము బండి ఎక్కి మద్రాసు చేరుకో. తర్వాత హోరాహోరీగా పోట్లాడుదాం. ద్రావిడ భాషావాద సన్నిపాతం ముంచుకొచ్చింది మీ కందరికీని. స్వాస్థ్యం కలుగాలంటే కొంతకాలం పడుతుంది." అన్నారు ఆవేదనతో ఆయన.

నేను బండిదిగాను. బండి కదిలింది. సాహిత్యంలో అభిప్రాయ భేదాలను వ్యక్తిగత ద్వేషంగా భావించుకొని పగపట్టే ఈకాలం ఎక్కడ? అభిప్రాయ భేదాలు వేరు; అభిమానాలు వేరు. అభిమానాదరాలకూ, మానవత్వానికి సాహిత్యంలోని మతభేదాలు అడ్డు రావనే ఆ సహృదయ విమర్శక పరిశోధకాగ్రణి ఎక్కడ? అలాటి ఉదాత్త హృదయుడు మరొకడు నాకు కనిపించలేదు.

—రామచంద్ర.

# మాధవవర్మ : అతని సంతతి

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

[గతసంచిక తరువాయి]

మాధవవర్మ సంతతివారిలో సాహిత్య పోషకుడుగా పేరు ప్రఖ్యాతులు గాంచిన ప్రథముడు తిమ్మరాయని కుమారుడు బసవభూపాలుడు. అనంతయ కుమారుడగు గంగయామాత్యుడీ బసవభూపాలునికి మంత్రియై మన్ననలు పొందెను. దగ్గుపల్లి దుగ్గయ తాను రచించిన నాచికేతూపాఖ్యానమును, నంది మల్లయ్య ఘంట సింగయ్యలు తాము రచించిన ప్రబోధ చంద్రోదయమును బసవరాజు మంత్రి గంగయామాత్యునికే అంకిత మిచ్చియున్నారు. దూబగుంట నారాయణ కవి బసవభూపాలుని యాస్థానకవి. అతడు తాను రచించిన పంచతంత్రమును బసవనరాధీశున కంకిత మొసంగెను. పంచతంత్రమునందు బసవభూపాలుని వంశావతారక్రమ మిట్లు తెలుపబడినది.

మాధవవర్మ వంశమునందు కొమ్మనవనీశు డుదయించెను. అబ్బలదేవుడు, సింగభూపతి, వల్లభ నృపతి అనువారు కొమ్మమహీపతి పుత్ర, పౌత్ర, ప్రపౌత్రులు. వల్లభరాయుని తనయుడు తిమ్మభూపాలుడు.1 ఇతని యాత్మజుడే పంచతంత్ర కృతికర్త, బసవనృపాలుడు. బెజవాడ శాసనమునందు మాధవవర్మ వంశములో మొదట పేర్కొనబడిన రాజు కంపమరాజు కాని కొమ్మనవనీశుడు కాడు. శాసనము ననుసరించి యితని తనయుడు అన్నలదేవుడు కాని అబ్బలదేవుడు కాడు. కొమ్మ, అబ్బల దేవ నామములు ప్రామాదికము లనుటకు సంశయింపబని లేదు.

గంగయామాత్యుడు ప్రబోధ చంద్రోదయము నందు ఇట్లు వర్ణితుడయినాడు:

మాధవవర్మ భూమండలేశ్వర వంశ
  జలధికి నేరాజు చందమామ
యేరా జుదయాశైల మెలమి విభేదించెఁ
  గపటాహిత మదాంధకార మడఁగ
గజపతి సురథాణి గడి దుర్గములకెల్ల
  నే రాజు వజ్రంపు బోరుతలుపు
మహిమచే నేరాజు మించె నలఘగీ
  రథ పృథు మాంధాతృ రఘురమణుల
నట్టి గుణశాలి తిమ్మరాయని కుమార
వీర బసవక్షమాచక్ర విభునిచేత
మన్ననలఁ గాంచి మించిన మహితుఁడితఁడు
మనుజమాత్రుండె గంగయామాత్యవరుఁడు.

బసవభూపాలుడును, అతని మంత్రి గంగయామాత్యుడును, వారికి తమ కృతు లంకితమిచ్చిన దగ్గుపల్లి దుగ్గయ్య, నంది మల్లయ్య, ఘంట సింగయ్య, దూబగుంట నారాయణకవులును సమకాలికులని వేరె నుడువ నక్కరలేదు. పై పద్యములోని గజపతి సురథాణి యనుదానికి గజపతి వంశజుడైన నృపాలుడు, మహారాజని యర్థము. సురథాణి సులతాను పద వికృతి.

ప్రబోధ చంద్రోదయ ద్వితీయాశ్వాసాదిని కృతిపతియైన గంగయామాత్యుని సంబోధించుచు నంది మల్లయ్య, ఘంట సింగయ్య లిట్లు నుడివియున్నారు:

శ్రీకరవీక్షణ దాన వ
శీకర నరసింహ నృపవశీకర నయ వి
ద్యాకరణ చతుర్దశ వి
ద్యాకర ధీరంగమతి యనంతయ గంగా!

పూర్వోదాహృత పద్యముల యన్వయము కొంత చర్చకు తావిచ్చినది.

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ కవుల చరిత్ర ప్రథమభాగము ద్వితీయ ముద్రణము నందు బసవభూపాలుని గురించి ఇట్లు వ్రాసియున్నారు:

"గంగయామాత్యుని ప్రభువైన బసవనృపాలుడు కొండవీటి రాజ్యమును గజపతు లాక్రమించుకొన్న తరువాత వారి గడిదుర్గముల కధ్యక్షుడయి పదునైదవ శతాబ్దోత్తర భాగమున నుండిన సామంతరాజు. బసవమహీశుని సచివుడైన గంగయామాత్యుడు ప్రబోధ చంద్రోదయము కృతినందకముందే దగ్గుపల్లి దుగ్గయ్యచేత రచియింపబడిన నాచికేతూపాఖ్యానమును కృతి

నందెను...1465 వ సంవత్సర ప్రాంతమునందు శ్రీనాథుని ముద్దుమరదియైన దుగ్గన కవిచేత నాచికేతూపాఖ్యాన మీతని కంకితము చేయబడెను. అటు తరువాత 1470-75 సంవత్సర ప్రాంతమున నీజంట కవులు ప్రబోధ చంద్రోదయము నీతని కంకిత మిచ్చిరి. పిసరు వాయాన్వయవంశాబ్ధి చంద్రుడైన2 మన గంగయామాత్యుడు ముందు జైమిని భారత కృతిపతియైన సాళువ నృసింహ నృపాలుని సచివుడై యుండినట్లు ప్రబోధ చంద్రోదయ ద్వితీయాశ్వాసాది పద్యములవలన తెలియవచ్చును." ......"వీరు (వరాహ పురాణ కర్తలు) తమ ద్వితీయ గ్రంథమైన వరాహ పురాణమును కృష్ణదేవరాయల తండ్రియైన తుళువ నరసింహరాయని కంకిత మొనర్చిరి. ఈ యీశ్వర నరసింహరాజప్పటికి రాజుగాక జైమిని భారత కృతిపతియైన సాళువ నరసింహరాయని దండనాథుడుగా నుండెను. ఈశ్వర నరసింహరాయలు 1487 వ సంవత్సరమునందు కర్ణాటాధీశ్వరుడయ్యెను. అతడు రాజు కాకముందే వరాహపురాణ మతని కంకిత మొనర్పబడినందున 1487 వ సంవత్సరమునకు పూర్వమునందనగా 1480-85 సంవత్సర ప్రాంతములయందు వరాహపురాణము రచియింపబడి యుండును." (పుటలు 639–41).

దగ్గుపల్లి దుగ్గననుగురించి వ్రాయునప్పుడు వారు "అటు తరువాత నీకవులే తమ వరాహ పురాణమును 1503 సంవత్సర ప్రాంతమునందు రాజ్యపాలనము చేయుచుండిన కృష్ణదేవరాయని తండ్రియైన నరసింహదేవరాయనికి కృతి యిచ్చిరి." (పుట 611) అని చెప్పియున్నారు.

దూబగుంట నారాయణకవిని గురించి వ్రాయు సందర్భమున పంతులుగారు బసవ భూవరునిగురించి యిట్లు నుడివి యున్నారు: "... బసవనృపాలుని కాలము 1470-80 సంవత్సర ప్రాంతమనియు స్పష్టమగుచున్నది......1460 మొదలు 1490 వ సంవత్సరమువరకు నుండిన యనంతయామాత్యుని కొత్త ప్రభువైన తమ్మయ బసవ భూపాలుడు 1470-80 వ సంవత్సర ప్రాంతములయందుండెననుటకు సందేహము లేదు.–" (పుట 664).

శ్రీ తేకుమళ్ల అచ్యుతరావుగారు విజయనగర సామ్రాజ్యమునందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్రమునందు బసవభూపాలుని గురించి యిట్లు వ్రాసియున్నారు:

"బసవ భూపాలుడు క్రీ. శ. 1460 సం. ప్రాంతములలో రాజ్యము చేసి రణరంగ భైరవుడనియు, రసికశిఖామణియనియు, మహావిద్వాంసుడనియు, మనశ్చరిత్ర ప్రియుడనియు నింకేమేమో యనేక సుగుణములకు నెలవనియు కవులచే ప్రస్తుతింపబడినవాడు. ఈతడు కళింగ భూపతులగు గజపతులకు కుడిభుజముగా నుండి వారి దుర్గములకు వజ్రపు కవాటముగా నుండెనట. ప్రథమమున విజయనగర సామ్రాజ్యములో సామంత రాజుగానుండి యొకవంక నవ ప్రభువుల దౌర్బల్యావస్థయు, మరియొక వంక గజపతుల నిరాఘాటాటోపమును జూచి గజపతుల పక్షమునజేరి వారి కుదయగిరి రాజ్యమును స్వాధీనపరచి తాను బలమైన సహాయకుడుగా నుండెనని తలంచుట సరియైనదని తోచుచున్నది. బసవ భూపాలుడు విద్యాప్రియుడును, కవీశ్వరులకు బట్టుగొమ్మయు నగుటచే నతని కాలమున నాంధ్రకవిత్వము బాగుగ విలసిల్లినది. ఈ మహనీయుడు మనుచరిత్ర ప్రియుడని వర్ణింపబడినాడు ...కావున ఈతడు కృష్ణదేవరాయల కాలములో కూడ నుండెనా?" (పుట 107).

వారే నంది మల్లయ్య, ఘంట సింగయ్యలను గురించియు, ప్రబోధ చంద్రోదయమును గురించియు వ్రాయు సందర్భమున బసవరాజాదులనుగురించి యిట్లు నుడివి యున్నారు:

"మాధవవర్మ వంశస్థుడైన యీ బసవరాజు ఉదయగిరిరాజ్యము నేలుచు కళింగాధీశ్వరులైన గజపతులకు సామంతుడై వారి పక్షమున [illegible]మును వినియోగించుచుండెను. బసవరాజో లేక యతని తండ్రియగు తమ్మరాజో యుదయగిరి రాజ్యమును గజపతులకొరకు జయించి దానిని వారి స్వాధీనములో నుంచెను. సాళువ నరసింహరాయలు విజయనగరరాజుల పక్షమున నా ప్రాంత దేశమునంతయు లోబరచుకొనినను ఉదయగిరి దుర్గము మాత్రము మాతనికి కైవసము కాలేదు; కాబట్టి బసవరాజు గజపతుల కొకగొప్ప ప్రాంతరక్షకుడుగా నుండెను ......ఈ మంత్రీశ్వరుడు బసవరాజునొద్ద ప్రధాన సచివుడుగా నుండిన చెందలూరి గంగయామాత్యుడు రాజనీతియందసమాన ప్రజ్ఞగలిగి యుదయగిరి రాజ్యమును దమకు ప్రబల శత్రువులైన విజయనగర రాజులకు లోబడకుండా గాపాడుటయేకాక యారాజుల దండనాయకుడైన సాళువ

నృసింహరాయలను దనకు వశునిగా జేసికొనెనట. "నృసింహనృపతివశీకర నయవిద్యాకరణ" అని ప్రబోధ చంద్రోదయమున జెప్పబడినది. ఈ వశీకరణ విధాన మేదో యిదమిత్థమని గ్రంథమున లేదు గాని సాళువ నృసింహరాయ లొకానొక సమయమున యుద్ధములో జీవగ్రాహముగా పురుషోత్తమ గజపతికి జిక్కినట్లు గ్రంథాధారము లుండుటచేతను రాజనీతి కోవిదుడగు గంగయ్య తననయనైపుణ్యమున నట్లు నృసింహరాయలను పట్టించెనేమోయని యూహింపదగియున్నది. .........కం. వీరేశలింగంగారు ఈ విషయమును గురించి వేరభిప్రాయమును గనుపఱచినారు. ఆయన తన యాంధ్రకవులచరిత్రములో నందిమల్లయ్య, ఘంట సింగయ్యలను గురించి వ్రాయుచు "నృసింహ నృపతివశీకర నయవిద్యాకరణ" అను విశేషణమును గురించి యీ క్రింది విధముగా నూహించినారు. 'గంగయామాత్యుడు మున్ను జైమినిభారతకృతిపతియైన సాళువనృసింహరాయలయొద్ద సచివుడై యుండినట్లు తెలుగగుచున్నది. ఈ యూహ సరికాదని నాకు దోచుచున్నది. ఏలయన గజపతులయొద్ద మంత్రిగా నున్న కాలములో కృతినందిన గ్రంథములో శత్రు రాజునొద్ద దానుమంత్రిగా నుండినట్లు వ్రాయించు కొనునని యూహించుట యసంగతమని తోచుచున్నది. కనుక నృసింహరాయలను జీవగ్రాహముగా బట్టించుటయే గంగమంత్రియొక్క నయవిద్యాకరణ మహత్వమని నిర్ణయింపవచ్చును.'" (పుటలు 215-16.)

దూబగుంట నారాయణకవిని గురించి వ్రాయు సందర్భమున శ్రీ చాగంటి శేషయ్యగారు తమ కవితరంగిణి (సం. 6)లో బసవనృపాలుని గురించి యిట్లు వ్రాసియున్నారు. "కృతిపతియైన బసవభూపాలుడే ప్రాంతమునకు రాజుగా నున్నదియు గ్రంథమును బట్టి నిర్ణయింప సాధ్యపడలేదు...తమ్మనృపాలుని శాసనములు ఉదయగిరిపై గన్పడుచుండుటచే నాతని నివాసము ఉదయగిరియని నిశ్చయింపవచ్చును. ఒక శాసనములో (ఆ శాసన మేదియో కవితరంగిణీకర్తలు తెలుపలేదు) 'బసవనృపాలుడు ఉదయగిరి నేలినట్లుండుటచేత కృతిపతి నివాసము ఉదయగిరియనుట నిశ్చయము'" (పుట 87). "ఈ బసవనృపాలుడు గజపతులకు సామంతుడై యుదయగిరిప్రాంతమున నున్న

వాఁడనియు, నారాయణకవి యుదయగిరి సమీపమునందున్న దూబగుంటనివాసియనియు నిశ్చయముగా చెప్పవచ్చును."

బసవభూపాలుఁడు క్రీ. శ. 1460-1500 సంవత్సరముల నడుమనున్న వాఁడనియు, 1470 ప్రాంతము దూబగుంట నారాయణకవిచే పంచతంత్రమును కృతినందియుండుననియు శ్రీ శేషయ్యగారు వ్రాసియున్నారు. వీరు నందిమల్లయ్య, ఘంటసింగయ్యలు రచించిన ప్రబోధచంద్రోదయ రచనాకాలమును గురించి చర్చించు సందర్భమున తద్గ్రంథద్వితీయాశ్వాసాదిని కృతిపతిని సంబోధించుచు వ్రాయబడిన "శ్రీకర వీక్షణ దాన శ్రీకర నరసింహనృప వశీకర నయవిద్యాకరణ..."అను పద్యమును గురించియు, గంగయామాత్యుని గురించియు నిట్లు వ్రాసియున్నారు.

"'(ఈ) పద్యమును బట్టి పెసరువాయాన్వయ వంశాబ్ధిచంద్రుఁడైన మన గంగయామాత్యుఁడు ముందు జైమినిభారతకృతిపతియైన సాళువనృపాలుని సచివుఁడై యుండినట్టు లెరుఁగవచ్చును' అని శ్రీ వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రమున వ్రాసియున్నారు. శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావు పంతులుగారీ యూహ నంగీకరింపక 'నరసింహనృపవశీకరనయ విద్యాకరణ' యను వాక్యమునకు వేరొకరీతిగా నర్థమును జెప్పియున్నారు. 'నృసింహరాయలను జీవగ్రాహముగా బట్టించుటయే గంగమంత్రియొక్క నయవిద్యాకరణ మహత్త్వమని నిర్ణయింపవచ్చును' అని శ్రీ అచ్యుతరావుగా రభిప్రాయపడియున్నారు. వీరి యభిప్రాయమే సమంజసమైనది. గంగయమంత్రి పురుషోత్తమ గజపతియొక్క మంత్రియుఁ గాఁడు; సాళువ నృసింహరాయల మంత్రియును గాఁడు. ఇతఁడు బసవనృపాలుని మంత్రి. ఈ బసవనృపాలుఁడు గజపతికి సామంతుఁడైనట్లును ఉదయగిరిని జయించినట్లును పైని వ్రాసిన సీసపద్యములోని 'ఏ రాజుదయశైల మెలమిని భేదించె, గపటాహిత మదాంధకార మడఁగ, గజపతి సురత్రాణి గడిదుర్గముల కెల్ల నేరాజు వజ్రంపు బోరుతల్పు' అను వాక్యములవలన దెలియుచున్నది. సాళువ నృసింహరాయని జీవగ్రాహముగా బట్టుకొనుటలో బురుషోత్తమ గజపతికి బసవనృపాలుఁడు విశేషసాహాయ్యము చేసియుండును. ఆ ఘనకార్యమును సాధించుటకు గంగయమంత్రి బుద్ధిచాతుర్యము ప్రధానకారణమై యుండును. ఈ భావమే 'నరసింహనృపవశీకరనయ విద్యాకరణ' అను వాక్యములో సూచింపబడినది. పురుషోత్తమగజపతి క్రీ. శ. 1366 మొదలు 1396 వఱకు రాజ్యము చేసినవాఁడు. సాళువ నరసింహరాయలను 1367 ప్రాంతమున పట్టుకొనియుండును. క్రీ. శ. 1370 ప్రాంతమున ప్రబోధచంద్రోదయము నీకవులు రచించియుందురు. సాళువ నరసింహరాయలు గజపతితో సంధి చేసికొని విడుదలయియుండును. గంగయామాత్యునకు బిమ్మట వీరు (నంది మల్లయ్య, ఘంటసింగయ్యలు) గుళువ నరసనాయకు నాశ్రయించి సాళువ నరసింహనాయకుని జీవితకాలములో శ్రీ వరాహపురాణమును రచియించి యుండవచ్చును. గంగయామాత్యుఁడు గజపతులయొద్దగాని, సాళువ నరసింహరాయలయొద్దగాని మంత్రిగా నుండియుండెనేని ప్రబోధచంద్రోదయములోగాని, నాసికేతూపాఖ్యానములోగాని యా విషయము చెప్పబడకుండ నుండదు." (పుటలు 134—35)

శ్రీ చాగంటి శేషయ్యగారు పురుషోత్తమ గజపతి క్రీ. శ. 1468 మొదలు 1497 వఱకు రాజ్యమేలినట్లు వ్రాయుటకు బదులుగా పొరపాటున క్రీ. శ. 1369 మొదలు 1392 వరకు నేలినట్లు వ్రాసియున్నారు. శ్రీ అచ్యుతరావుగారును, శ్రీ శేషయ్యగారును ప్రబోధచంద్రోదయ ద్వితీయాశ్వాస ప్రథమ పద్యమున వచ్చు నరసింహనృపతి సాళువ నరసింహరాయలే యనియు, శ్రీ వీరేశలింగము పంతులుగారును వీరునుగూడ బసవనృపాలుఁడు గజపతుల సామంతుఁడై వారి గడిదుర్గములను పరిపాలించెననియు చెప్పియున్నారు. అంతేకాక వీరందఱు బసవరాజును, అతని సచివుఁడు గంగయమంత్రియు అంకితము గైకొన్న కృతులకాలమునుగూడ వేరు వేరు విధముల నిర్ణయించిరి.

తమ్మరాయుని కుమారుఁడైన బసవభూపతి గజపతి సామంతుఁడేనా? అతఁడేనా ఉదయగిరి దుర్గమును సాధించినది? అట్లయిన దాని నెప్పుడు సాధించెను? ఎవరి పక్షమున సాధించెను? అతని కాలమేది? పూర్వోక్తకవి, వాఙ్మయ చరిత్రకారులు చెప్పిన ఈ విషయము లంగీకార్యము లగునా కాదా? ఈ విషయము లన్నియు విచారణీయములు. ఇందుకు ముందు కటకము గజపతుల చరిత్ర కొంత సంగ్రహముగ దెలిసికొనవలసి యున్నది. (సశేషము.)

---

1. కవుల చరిత్ర (మొదటి భాగము), పుట 652.
2. గంగయామాత్యుఁడు పెసరువాయాన్వయుఁడని శ్రీ వీరేశలింగం పంతులుగారును, శ్రీ అచ్యుతరావుగారును, శ్రీ శేషయ్యగారును వ్రాసియున్నారు. అతఁడు కౌశ్యపగోత్రుఁడు. అతని యత్తవారును పెసరువాయాన్వయులే; కాని వారు మౌద్గల్యగోత్రులు.

# కలగూరగంప

## భామ కలాపం

### శ్రీ తుమ్మలపల్లి సీతారామరావు

ఐత్ర ర్యత్రికంలో ప్రతిభావంతులై భరతశాస్త్ర కోవిదులైన భాగవతులకు పుట్టినిల్లు కూచిపూడి గ్రామం. వీరు భాగవత నాటకములు ఆడుటవల్ల భాగవతులని వ్యవహరించబడినారు. ఆంధ్రదేశంలోని యీ గ్రామంలోనే నాట్యకళోదయం కావటానికి స్థానిక లోక ఐతిహ్యం చెపుతారు. క్రీస్తుశకం 11 వ శతాబ్దంలో జీవించిన నారాయణ యతీంద్రుడు, ఆయన శిష్యుడు సిద్ధేంద్రయోగి 'పారిజాతాపహరణ'మనే రసభావసముల్లసితమై, నాట్యాభినయోపయుక్తమైన శృంగారరూపకం వ్రాశారట. వీటినే భామకలాపమన్నారు. సిద్ధేంద్రయోగి కూచిపూడి గ్రామంలోని బాలకులలో వెలకొనివున్న సహజగానాభినివేశమును గుర్తించి ముగ్ధుడై వారికి భావరాగతాళాభినయాలలో శిక్షణమిచ్చి, వారిచేత పారిజాతాపహరణ కథను, శంకర భగవత్పాదులయొనుట ప్రయోగము చేయించాడట. తదాదిగ నాట్యకళాసేవకు తమ జీవితమును అంకితము గావించుకొనిన ఆ గ్రామీణులకు ఆయన కులదైవతమై, సకలాభీష్టసిద్ధి కలిగిస్తున్నాడని, వారి విశ్వాసం. ఈ గ్రామంలోని బ్రాహ్మణ కుటుంబముల వారు గడచిన అయిదు శతాబ్దములనుంచి తమ మగపిల్లలకు ఏడవఏట చెవులుకుట్టించి, కాలికి గజ్జె కట్టించి, స్థానికాలయములో నాట్యవిద్యలో తొలిశిక్షణ ప్రారంభించటం వంశపారంపర్యంగా యిప్పటివరకు, అమిత శ్రద్ధాభక్తులతో అనుసరించబడుతున్నది. వీరి భాగవతుల పేరు సార్థకమైనది. వీరు ప్రదర్శించెడి నాటకములు భాగోతము లని వ్యవహరించబడినవి. నృత్తరూపకములైన యక్షగాన ప్రయోగములలో వీరు సిద్ధహస్తులు. కూచిపూడి నాట్య సంప్రదాయమునకు విశిష్టతను సమకూర్చిన నాట్యాలలో భామ కలాపం ప్రశస్తస్థానం వహిస్తున్నది.

భరతముని పేర్కొనిన రస సూత్రములలో ప్రధానమైన శృంగార రసం చిప్పిలేది భామకలాపము. భాగవతములోని పారిజాతాపహరణం ఇందలి యితివృత్తము. ఈకలాపములో కలహాంతరిత, గర్విత అయిన నాయిక సత్యభామ విప్రలంభ శృంగారమును. శృంగార రసాలంబనములైన విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావాలన్నీ నాట్య గానాభినయములలో వ్యక్తము గావిస్తుంది. ఇందు నాయిక వ్యాకులత చెంది సఖితో తన దుఃఖమును, మనోభావములను నివేదించుకొని నాయకుని వద్దకు సాంత్వన వచనములతో రాయబార మంపుతుంది. అంతకుపూర్వము నాయకుడు కడు అనుకూలుడై ప్రేమతో నర్తించిన ముచ్చటలను నాయిక తలచుకొని, ప్రస్తుత విషమపరిస్థితులవల్ల కలిగిన హృదయ విదారకమైన దుఃఖమును వెల్లడిస్తుంది. కలాపములో కథాసంవిధానమునకంటె రసస్ఫోరకమైన భావచిత్రణ నైపుణి సామాజికులకు ఆలంకారిక వైభవమును సాక్షాత్కరింప జేస్తుంది. రసోదయ రసాస్వాదనానందానుభవము సామాజికుల సహృదయ చిత్తవృత్తిమీద ఆధారపడి వుంటుంది.

కూచిపూడి భాగవతులలో పురుషులే స్త్రీపాత్రలు ధరించవలెనని సిద్ధేంద్రయోగి ఆదేశమిట్టు కనపడుతుంది. అందువలన ఈ గ్రామములో నాట్యకళను అభ్యసించిన వారందరును తమజీవితములో ఒకసారి అయినను భామవేషం కట్టివుంటారు.

## ఆహార్యము

సత్యభామ సౌందర్యగర్విత. ఆమెకు ఏడువారముల సొమ్ములున్నవి. ఆకాలములో స్త్రీలు ధరించిన అన్ని ఆభరణములతోను భామ వేషమును అలంకరిస్తారు. శిరోభూషణములలో చిన్నజడ, పెద్దజడ, రాగిడి, సూర్యుడు, చంద్రుడు, పాపటపిందెలు, చంద్రవంక, తమలపాకులు, కీలికి, తురాయి, కమ్మలు, పాపటచేర్లు, బులాకి, నత్తు, ముక్కుపుడక, పట్టెడ, పతకములు

చిలకతాళు, తాయెత్తులు, బిళ్ళలమొలత్రాడు, దండ కడియములు, పోచీలు, కంకణములు ప్రధానమైనవి.

భామాజడకు ఒక ప్రాచీనగాథ ఉన్నది. ఇది అపూర్వశిల్పి అయిన మయునిచేత నిర్మించబడినదని, దీనిలోని బిళ్ళలు నక్షత్రములకు సంకేతాలని అంటారు. సౌందర్యవతి అయిన స్త్రీకి జడ గర్వకారణము. అలాగే, సౌందర్యరాశి అయిన సత్యభామ కథా ప్రారంభమునకు ముందు తనజడను తెరపైనుంచి ప్రేక్షకులకు కనపడునట్లు వేసి, దాని మాహాత్మ్యమును వర్ణిస్తుంది. అంతేగాదు తన నాట్యశాస్త్ర ప్రవీణతను, అధిగమించగలారు ప్రేక్షక సందోహము నందుండిన యోషల తనను జయించవచ్చునని సవాలుచేయును అని దీని అంతరార్థముగ భావింపబడుచున్నది. అట్టి విషయమున ఎవరేని ఎదిర్చి జయించిన, జడను ఖండించుట పరాజయ చిహ్నముగ పరిగణించబడెనని తెలియుచున్నది. కాని యిట్టి ఉదంతములు కానరావు.

## పాత్రలు

నాయిక-సత్యభామ. దూతిక-చెలికత్తె, సమవయస్కురాలు. దీనిలో వంతపాట పాడుటకు నియుక్తుడైన బ్రాహ్మణుడు హాస్యోక్తులు, లౌకిక విజ్ఞాన జన్యమైన సల్లాపములు పలుకుతాడు: ఇతనిని సూత్రధారుడని చెప్పుకొనవచ్చును. ఇతడు, పాశ్చాత్యనాటకములలోని విదూషకునివంటి వాడు కాడు: కథాసంవిధానకర్త. ఈయన నృత్యగానాభినయములలో నిష్ణాతుడై సమయస్ఫూర్తి, వాక్చాతుర్యము కలిగి ఉండవలెను.

శ్రుతి, మృదంగము, వాయుశబ్దపూర తంత్రీ వాద్యము, సుశబ్దముగల తాళములు, మంచి గజ్జెలు, భామకలాపమునకు ఆతోద్యకములు.

## కథాసంవిధానము

జడవర్ణన అనంతరము, యవనికను తొలగించగా, భామ సకలాభరణభూషితయై ప్రవేశిస్తుంది. ప్రవేశంలోనే ఆమె తన జనన వృత్తాంతమును, ప్రకృతిదైన్య స్థితికిగల కారణము దరువులో యిలా ఆలపించి చెప్పుకుంటుంది.

ఆనందభైరవి - చాపుతాళం

భామనే! సత్యాభామనే
భామనే పదియారువేల కోమలులందరిలోనా
రామరో, గోపాలు మా రికి -
ప్రేమదాన నగు సత్య॥ భా॥
అట్టిహాసము చేసి సురల -
నట్టె గెలిచిన పారిజాతము
చెట్టు తెచ్చి నాకు పెరటా -
ఘట్టిగా నాటించుకొన్నా॥
భూమి సత్రాజిత్తు కూతురై యిందరిలోనా
చాల మగనికి బాసి తాళగ వయ్యారి సత్య॥
వారి జాక్షి ద్వారకా నివాసుని కౌగిటిలోనా
కూరిమీ పెనగొనినటుల గూడినా వయ్యారి సత్య॥

ఆ వెనుక సత్య తన విభుని పేరు సఖిలో చెప్పుటకు సిగ్గుపడి, ఆయన గుర్తులు వర్ణిస్తుంది. చంద్రోదయముతో ఆమె విరహమగ్నలై తన హృదయాగ్నిని వెల్లడిస్తూ చంద్రుని, మలయమారుతమును, పక్షిజాతులను దూషిస్తుంది. భామ తన నెతకు, శ్రీకృష్ణునికి పొసగమిన కినుకకు గల కారణమును చెలికత్తెకు తెలుపుతుంది.

"దేవతలు ప్రారంభించిన యాగ విధ్వంసక కార్యక్రమాలకు గోపకులందరును భీతాత్ములై, ఆపదనుండి తమను గాపాడుటకు వేరు దైవము లేడని శ్రీకృష్ణుని శరణుజొచ్చిరనియు, అంతట ద్వారకావాసుడు తన చిటికెనవ్రేలిపై గోవర్ధన పర్వతము నెత్తి, వారల గాపాడెననియు, ఒకనాడు ఆయన ప్రజ్ఞతో బలికెను. 'స్వామీ! పదునాల్గు భువనములను తమ కుక్షిలో నుంచుకుని, చిటికెన వ్రేలు మొనచే గోవర్ధనమెత్తుట ఎక్కువా, లేక అట్టి మిమ్ముల నస్మదీయ వక్షోజాగ్రముల నెత్తుట ఎక్కువా?' అని ప్రశ్నించితిని. సఖీ! జవాబు చెప్పకయే మొగము నగము జేసికొని శయ్యదిగి ఎచ్చటికో పోయెనమ్మ! ఏమిసేతు చెలీ!"

అటుపిమ్మట శకునములు, దిశలు పరికించి నాయకునకు తన విరహార్తిని వెల్లడిస్తూ కమ్మ వ్రాస్తుంది.

"శ్రీమద్రమా మానినీ మానసాంభోజ మకరంద పాన మిళిందాయమాన మానసులైన భూలోక భువర్లోక సువర్లోక తపోలోక నాగలోక సత్యలోక జనలోక నిఖిలలోకాలోక సంరక్షణ విచక్షణులైన సూనబాణ విజయబిరుదాంక మీనాంక జనకులైన శ్రీ గోపాలకృష్ణ పాద పంకేరుహంబుల సన్నిధికి, సత్యభామామణి యను యోషారత్నంబు, కరకమలంబుల ముకుళించి, నిజవదన చంద్రబింబంబుపై హస్తంబుల నిడి యత్యంత విరహాక్రాంతయై, అగణిత సాష్టాంగ దండప్రణామంబు లాచరించి వ్రాసుకొనిన విజ్ఞాపన :-

# కలగూరగంప

"తమ కటాక్షంబువలన నిప్పటి కుశలము. అచ్చట తమ నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాది వైభవములను అతులిత కరుణా సమగ్రులై వ్రాయించి నన్ననుగ్రహింప ప్రార్థించుచున్నాను. తే॥ పద్మంబులు తిమిరగ్రస్తంబులై సూర్యోదయంబును గోరుచందంబున, నా హృదయాబ్జంబు భవదీయ పాదారవింద ధ్యానంబు జేయుచున్నది. పిచ్చుకపై బ్రహ్మాస్త్రంబు ప్రయోగింపదగునా? నే పరాధీననైతినా? తమ కటాక్ష శూన్యంబుచే నా శరీరంబు విప్రలంభభూతం బయ్యె ననుటకు మదీయాంగుళీయక రత్నంబు హస్తకంకణం బగుటయు, హస్తకంకణంబు కేయూరం బగుటయు. ప్రేమయంబు మేఘాగాద్వ్యారంబు బంటయు సాక్షీభూతంబులు. నరకాసురుని యుద్ధంబునకు మెచ్చి యత్యంత విరవిరంగంబున, నను గాఢాలింగనము జేసి నన్నంక మాన్యంబుననిడి నా గురుకుచంబముల మీ నఖాగ్రంబులచే మీటుచు, భామామనోహారి! త్రిలోకాభిరామా! నిను బాయ సుమీ యటంచు బాసలుజేసి, కేలు కేలున గీలించి, తమిగొల్పి మరువం దగునా? తమరు నీ వన్య నిరతిశయ సాధారణ సౌందర్య చాతుర్య గాంభీర్య వాత్సల్య పరిపూర్ణులనియు, సృష్టి స్థితి లయకారాది కర్తలనియు, దుష్టనిగ్రహ, శిష్ట పరిపాలకులనియు, మజ్జనకుండైన సత్రాజిత్తు, సూర్యుని యను గ్రహ ప్రసాద లబ్ధంబైన, శమంతకమణి సహితంబుగ నను సమర్పించిన దినంబు మొదలుకొని, నా యం దత్యంతానురాగులై, నన్నతులితముగ, చతురోక్తుల సుఖియింపంజేసి, దినదిన ప్రవర్ధమానంబుగా, నగుమం జాలని మహేంద్రనీల మరకత మాణిక్య వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ ప్రకాశిత నవరత్నహారంబులను, కుంభ కుడ్య గవాక్ష వేదికా సోపానంబులు నవ పచ్చల నమర్చిన పచ్చపగడంపు తిన్నెకోళ్ళ, దోమతెర పట్టె మంచముపైన, చౌసీతి బంధనానా చమత్కృత్యను బంధంబుల తృప్తిల్లంజేసి యిప్పుడా రుక్మిణియందు, పూర్ణానుగ్రహులంపైనై నా యం దింత నిర్దయత్వంబు వహింపదగునా? నను మారు మరుండు విరిశరముల పుంఖానుపుంఖంబులుగా నేయుచుండె. నే బాధ తోచక మనోజ మనోహారూపను, మ్రొక్కుచు మ్రుక్కియున్న నాయొప్ప ద్రిమ్మరియగు పద్మాకరి వేడివెన్నెల గాయుచుండెను. అత్తరి నా చిత్తంబు తత్తరిల్లినది. అత్యుత్తమంబైన శయ్యాతలము కత్తులబోనై దోచినది...నవరసరసిక శిఖామణీ! నా విన్నపం బాలించి నన్ను కృతార్థురాలం జేయ ప్రార్థించుచున్నదాన. అర్జున సారథీ! యదుకులాంభోధి చంద్రా! తుభ్యం నమస్తే, నమస్తే, నమస్తే నమః.

"క. చిత్తజుని బారికోర్వక
తత్తరపడి వ్రాసినాను తప్పో యొప్పో
చిత్తమున గినియకను ప్ర
త్యుత్తరమును బంప వేడుచుంటి ముకుందా.
"శ్రీనుత భానుతేజునకు
చిల్కలరాజుకు వన్నెకానికిన్
భామిని విన్నపంబు నిను
బాసిన నాటికి నేటికింక యా
కాముడు పుష్పబాణములు
గ్రమ్మక వేసెను తాళజాల యిం
కేమని విన్నవింతు నిక
ఏమి లిఖింతును మాతికామణీ!

చిరునామా:

"క. శ్రీరమణీ నాయకునకు
మారజనకునకు ననంత మంగళ నిధికిన్
నారాయణునకు సతతము
ద్వారకవాసునకు హరికి వైకుంఠునకున్."

సౌందర్యగర్వితయైన సత్య యీ లేఖలో పొందుపరచిన భావములలో సంభోగ విప్రలంభ శృంగార రసానుభూతులే గాక, శ్రీకృష్ణుని దివ్య మహిమను గూడ స్మరించి, ఆయనయందలి దైవత్వమును గుర్తెరిగిన తెరగు స్ఫోరకమౌతున్నది.

మాతికను నాయకుని కడకు బంపిన సత్య, ప్రియాగమన సందేశమునకై, విరహోత్కంఠయై నిరీక్షిస్తుంది. దూతిక రాకను తడవైనందుకు, సత్య ఆమె చిత్తచాంచల్యమును శంకిస్తుంది. ఆమె చివరికి దూతికతో కలిసి కృష్ణుని సన్నిధికి జేరుతుంది. రుక్మిణీ సదనమందున్న ద్వారకావాసుని సన్నిధికి జేరబోయిన సత్యకు తన సవతితో వాక్కలహము ప్రారంభమై, తుదకు ఇరువురు సమాశ్వాసం పొందుతారు.

అప్పుడు సత్య స్వీయనాయకానుగ్రహం కోసం అభ్యర్థిస్తుంది.

## విశిష్టత

భామకలాపమును ఆడి పాడి అభినయించే నటునకు నృత్య, గానాభినయ తాళపరిజ్ఞానము

అలంకార సూత్ర పరిచయము, అపారలౌకిక విజ్ఞానము లెస్సగ నుండి తీరవలెను. అందువలననే భామకలాప ప్రయోగము నటుని ప్రజ్ఞా విశేషమునకు గీటురాయిగ పరిగణించ బడుచున్నది. భామకలాపములో నాయికయే ప్రధాన భూమిక. విభిన్న విషయ చిత్రణ, వివిధవిషయములను ప్రకృతి స్థితికి సమన్వయించుట, ప్రధానరసమునకు ఆలంబనములైన విభావాను భావ స్థాయి భావాలను అభినయమునందు ఒప్పించి, సుమనస్కులైన సామాజికులకు రసానందానుభవము కలిగించుట, భామకలాపముయొక్క విశిష్టగుణములు.

భామకలాపములో చేర్కొనబడిన వనవిహారము, సంధ్యావర్ణన, మన్మథ, మలయానిల, పుష్పమాల్యాదుల దూషణ మొదలగు ఉపకథలు ప్రబంధ సంప్రదాయము ననుసరించుచున్నవి: శకునాపశకునములు, అసమయముల నిరూపణ, రచనకు దిశానిర్ణయము, వశీకరణ కుపకరించెడి ఓషధి ప్రక్రియలు, వీటి విరుగుళ్ళు జాతీయమైనవి; శాస్త్రాధారములు కలిగినట్టివి. వీటివల్ల అపారమైన లౌకిక విజ్ఞానము స్ఫోరక మగుచున్నది.

నాట్యాభినయోపయుక్తమైన దరువులు కూచిపూడి నాట్య సంప్రదాయమునకు ప్రత్యేకతను నిరూపిస్తున్నవి. ఇటివంటి దరువులు భామకలాపంలోను, యక్షగానములలోను ప్రముఖ స్థానం వహిస్తున్నవి. భామకలాపములో వృత్తములు, ద్విపదలు, కందార్థములు ఉన్నవి. వీటిని గానముచేయుటకు రక్తిరాగములైన కాంభోజి, ఆనందభైరవి, ముఖారి, శంకరాభరణము, నాదనామక్రియ, మోహన, శ్రీరాగము, కల్యాణి గ్రహించబడినవి. ఇవిగాక .వేయదు, సుర కాంభోజి, పంతువరాళి, మారువ, పున్నాగ, నాటకురంజి, రేవుప్తి, దర్బారు, కీరవాణి మొదలైన రాగములు కూడ ధారాళముగ నుపయోగించబడినవి.

భామకలాప ప్రయోగముజేసెడి నటునకు దీర్ఘకాలశిక్షణమువల్లనే కౌశల మలవడగలదు. నాట్యగానాభినయములకు దాపలమైన యీ నాట్య విన్యాసము కూచిపూడి నాట్యసంప్రదాయమునకు తలమానికము వంటిది. ఉదాత్త భావగర్భితమైన యీ నాట్య నిక్షేపము తరతరములనుండి కూచిపూడి భాగవతులకు ముంజేతి ముకురమై, సామాజికులకు వారి మానసికమైన అంతస్థుల ననుసరించి రసానుభూతిని కలిగించుచుండినది. కాని యీ భాగవతుల కుటుంబములలో యిటీవలి కాలంలో నాట్యాభినయకళపట్ల ఏర్పడిన విముఖత్వమువల్ల, బాలకులకు నాట్యవిద్యలో శిక్షణమిచ్చెడి యాచారము వెనుకబడినది. కాగా, అభినయ పరిపుష్టమైన భామకలాపమును ప్రయోగించగల ఆచార్యులు, సానకులు పక్కస్తుగా కనపడుతున్నారు. వీరి నాట్య సంప్రదాయమునకు సంబంధించిన సాహిత్యము విశేష భాగము లిఖితప్రతులలోనే ఉన్నది. క్రిందటితరముల వారిలో, వీరిలో కొందరు పండితులుండినా, క్రమక్రమముగ యీసంతతి వారిలో విద్యాగంధము, శాస్త్ర పరిచయము లోపించుటవల్ల, యీ నాట్య సంప్రదాయమునకు సంబంధించిన లిఖితపుస్తకములలో లేఖక దోషములు కనపడుతున్నవి. ఇటువంటి బహుళస్ఖాలిత్యములతో వీరి ప్రయోగములు జరుపబడుతున్నవి. సామాజికులు యిట్టి ప్రదర్శనములను కూడ సాదరబుద్ధితో జూచి, యీ నాట్య సంప్రదాయమునకుగల పూర్వప్రతిష్ఠ దృష్ట్యా సంతృప్తి జెందుతున్నారు.

ప్రాచీనమైన ఆంధ్రుల నాట్య సాహిత్యమును పరిష్కృతముజేసి, గ్రంథములు ముద్రించుటకు దోహదము గావించి, యీ నాట్య పునరుద్ధరణమునకు సుసంఘటిత విధానమును రూపొందించవలసిన బాధ్యత ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ యందున్నది.

# మోటిఫ్ భావనాంకురమే

## శ్రీ ఆమంచర్ల గోపాలరావు

మోటిఫ్ (Motif) అనునది ఫ్రెంచి (French) పదము. మోటిఫ్‌కు ఆంగ్లములో మోటివ్ (Motive) అనే అర్థము. కాని కళాపరిభాషలో ఫ్రెంచిలో మోటిఫ్ అను పదమునకు ఆంగ్లములో మోటివ్ అను పదము పూర్తిగా అన్వయించదు. నేటివరకూ కూడా కళాపరిభాష ఆంగ్లమున కూడా సంపూర్ణము గాక వృద్ధి అగుచునే ఉండుటచేత, అనేక ఫ్రెంచి పదములను కూడా వాడుట జరుగుచున్నది. మోటిఫ్ అనే పదమును కూడా అట్లే ఆంగ్లములో వాడుచున్నారు. కాని షెల్డన్ షెనీ (Sheldon Cheney) అను ఒక అమెరికా విమర్శకుడు, ఈ పదమునకు బదులుగా "మోటివేటింగ్ ఫ్రాగ్‌మెంట్సు" (Motivating fragments) అని సంపూర్ణముగా ఆంగ్లాన్నే వాడినాడు.

ఈ మోటిఫ్ అనేపదమును ఆధునిక పాశ్చాత్య విమర్శకులు వాడినట్లే, నేను కూడా శిల్ప పరిభాష

లోనే వాడినాను. కాని నాటకపరిభాషలో కాని, కవితా పరిభాషలో కాని నేను వాడలేదు. ఆ పరిభాషలలో కూడా ఈ పదము వాడబడుచున్న మాట సత్యము.

తా. రా. గారు అనేక ప్రాచీన, నవ్య ఆంగ్ల నిఘంటువుల నుంచి మోటిఫ్ అను పదమునకు నాటి వరకు ఉన్న నానార్థములను విశదీకరించినారు. ఆ అర్థములలో ఒక నవ్య నిఘంటువులో కనుపించు అర్థము ఇది :

"A Constituent feature of a composition. An object or a group of objects forming a distinct element of design."

ఈ అర్థములు శిల్పపరిభాషకు చెందిన అర్థములే. ఇవిగాక తాను నిఘంటువులలో వెతికి శోధించిన సర్వ అర్థములను వారు శోధించి, మోటిఫ్ అను పదమునకు "మూలభావన," "ప్రధాన భావన," అనడం సమంజసమని, సలహా ఇస్తూ, "మరొక విద్వాంసుడు కల్పనాధాతువు" అనడం ఇంకా బాగుంటుంది అన్నారని వ్రాసి, ఈ విషయమై నన్ను "పరిశీలించాలని మనవి చేశారు."

"శూన్యతాబోధితో బీజం,
బీజాత్ బింబం ప్రజాయతే
బింబేచ న్యాసవిన్యాసౌ..."

అని ఒక ప్రాచీన సూత్రము. యోగి అంతర్య ములో, పరమాత్మ రూపము నందుకొను క్రమము నీ సూత్రము సూచించినది. మన ప్రాచీనులు శిల్పిని సయితము మహాయోగి అనుటచేతను, అట్టి మహాయోగు లయిన శిల్పులు దైవ స్వరూపములనే రచింతురని శుక్రుని వాక్యమునను సరించి, ఉత్తమ కళాకారుని అంతర్యమున, దైవస్వరూపములు రూపొందు క్రమమును సయితము ఈ సూత్రము నిర్వచింపగలదు.

శిల్పి, ఆత్మజ్వాలాశేషమయిన శిల్పము, శిల్పి అంతర్యములో ప్రథమమున బీజముగా రూపొందు చున్నది. ఇదే ఆదివస్తు భావము. తర్వాత బింబ భావన (Conception). బింబమునకు తర్వాత ఉదయించు న్యాసవిన్యాసము లన్నీ కల్పనా విశేషములు. శిల్పి అంతర్యమున కల్పన (Composition) పూర్తి కాగానే, శిల్పి చేతులందు తయారగు శిల్పము రచనా భాగము. (Execution) నిజమయిన అప్రేరిత (Spotanious) శిల్పాలలో, భావన, కల్పన, రచనలు ఏకముగా ఒకేసారి ఉద్భవించిన రీతి కన్పడును.

దివ్య శిల్పముల కుపక్రమించిన మన ప్రాచీన శిల్పి, ఒక సమాధి స్థితియందు శిల్పమునకు భావమయిన బీజాన్ని శూన్యతనుంచి స్వీకరించి, తర్వాత ఆ బీజమును భావన చేసెడివాడు. కాని ఆదినుండి నేటివరకు దాదాపందరు పాశ్చాత్య కళాకారులు శూన్యమునుంచి గాక ప్రకృతి ఖండములనుంచే, తమ భావనలకు అవసరమయిన బీజములను స్వీకరించుచున్న మాట వాస్తవము. అందుచేత వీరి భావనలు, శూన్యమునుంచి గ్రహించిన బీజములనుంచి గాక, ప్రకృతియందలి స్థూలరూపముల నుంచి గ్రహించినవగుటంజేసి, షెల్డన్ చేనీగారు, ఆ భావనలకు మూలములయిన రూపములను "మోటివేటింగ్ ఫ్రాగ్ మెంట్సు" (Motivating fragments) అని, కొందరు విమర్శకులు మోటిఫ్స్ (Motifs) అని, అనుట సంభవించినది. అందుచేత, భావనలు అంకురించిన రూపములగుటం జేసి, నేను వాటిని "భావనాంకురములు" అని అన్నాను.

కాని, ఈ భావనాంకురమును "మూలభావన" అనిగాని, "ప్రధాన భావన" అనిగాని అనుటకు వీలు లేదు. ఎందుచేతననగా, బీజమునుండి భావన అయిన తర్వాత, ఆ భావనా విన్యాసము కల్పనాభాగమే అగును. అందుచేత మూలభావన అని, అంత్యభావన అని వేరుగా నుండవు. భావనకు మూలము భావము. భావనకు తర్వాత కల్పన. ఆ పయిన ఈ బీజమును "కల్పనాధాతువు" అనుటకుకూడ వీలులేదు. ఎందుకనగా, కల్పనకు ముందు భావనయే. "మోటిఫ్" అనునది ఈ భావనకు సయితము పూర్వమయిన ప్రకృతియందలి చిత్రకారుని ఆకర్షించి, అతని మననమునకు పాత్రమయిన బీజరూపము.

ఈ కారణముగా మోటిఫ్‌ను నేను "భావనాంకురము" అని అన్నాను. నిజముగా నేడు శిల్ప పరిభాష ఆంగ్లులకు వలెనే మనకుకూడా అత్యవసరము. అందుచేత, ఈ విషయము తా. రా. గారు మంచి పండితుల నెవరినయినా విచారించి. తెనుగుపదములను సహేతుకముగా వివరించుచు నాకందజేసినయెడల ఆ పదములను వాడుటకు నాకెట్టి అభ్యంతర ముండదు.

# గ్రంథ విమర్శనము

## 'సాటో వోచే'

### [SOTTO VOCE]

[ఆంగ్ల వ్యాససంపుటి. రచన: "విఘ్నేశ్వర" (శ్రీ ఎన్. రఘునాథన్) ప్రచురణకర్తలు: బి. జి. పాల్ అండ్ కో., 4, ఫ్రాన్సిస్ జోసెఫ్ వీధి, మద్రాసు-1. డెమీ ఆక్టావో సైజు 352 పేజీలు. మేలిరకం ప్రతి: వెల: రు 5 లు; మామూలు కాగితం అట్ట ప్రతి: వె: రు 4 లు.]

శ్రీ ఖాసా సుబ్బారావు సంపాదకత్వాన ఇదివరలో వెలువడిన ఆంగ్ల వారపత్రిక "స్వతంత్ర" పాఠకులకు, ఇప్పుడు వెలువడుతున్న "స్వరాజ్య" పాఠకులకు 'సాటో వోచే' అనే శీర్షిక చిరపరిచితమైనది. వర్తమాన ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిణామాలను, తదితర విషయాలను విమర్శిస్తూ వారం వారం ఒక్కొక్క వ్యాసం 'విఘ్నేశ్వర' అనే మారుపేరుతో వ్రాసి ఈ శీర్షికను నిర్వహిస్తున్న శ్రీ ఎన్. రఘునాథన్ పేరు కూడా పాఠకులకు సుపరిచితమైనదే. ఇది 1946-47-48 సంవత్సరాలలో వ్రాసిన దాదాపు నూటఅరవై చిన్న వ్యాసాలను చేర్చి ప్రచురించిన గ్రంథం.

శ్రీ ఎన్. రఘునాథన్ "హిందూ" పత్రికలో బహుకాలం ప్రధాన సంపాదకీయ బాధ్యతలు నిర్వహించి పత్రికా రచనలో విశేషానుభవం గడించిన వారు. ఈ గ్రంథంలో పొందుపరిచిన వ్యాస పరంపరను చదువుతూంటే ఆంగ్లభాషమీదా, సారస్వతం మీదా రచయితకున్న అసమాన ఆధిపత్యం ద్యోతకమవుతుంది. సజాతీయమైన మన సత్సంప్రదాయాలంటే వారికి వున్న గౌరవాభిమానాలు, నేటి సమాజం ఎదుర్కొంటున్న వివిధ క్లిష్టసమస్యలమీద వారికి వున్న స్థిరమైన భావాలు ఈ సంపుటికి రచయిత స్వయంగా వ్రాసుకున్న సమగ్ర పీఠికవల్ల స్పష్టపడుతున్నాయి. సమాజంలో నూతన వికాసం, అభ్యుదయం అన్నవి క్రమానుగతమైన సహజ పరిణామం ద్వారా రావాలిగాని, హడావిడిగా చేసే శాసన నిర్మాణంవల్ల రావని రచయిత విశ్వాసం.

ఏ ఒక్కటే సాధారణంగా రెండు మూడు పేజీలను మించకపోయినప్పటికీ ఆ సంక్షిప్తపరిధులలోనే ప్రతి వ్యాసానికీ ఒకవిధమైన నిండుతనాన్నీ, పొంకాన్నీ సాధించడంలో రచయిత సహజసిద్ధమైన ప్రజ్ఞ గోచరిస్తుంది.

"సాగరము త్రైపు నగుల్ పొనాలించిన లీల దమలోన నొరయు శబ్దముల కూర్పు..." అనే కవి సూక్తి ఒక్క తెలుగుకే గాక ప్రతి భాషా రచనకూ వర్తిస్తుంది. శ్రీ ఎన్. రఘునాథన్ రచనలో కూడా ఈ శిష్టలక్షణం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. భావగాంభీర్యం, దానికి తగిన ఉదాత్తమైన భాష. ఈ రెంటినీ మించిన విషయ ప్రాధాన్యం కొటేల్లో వున్నాయి. చమత్కారంగా, వ్యంగ్యంగా, సున్నిత విమర్శతో ప్రతివాక్యం తీర్చిదిద్దినట్లు వుంటుంది.

ఒకచోట: The State growst suddenly generous under the spur of fancy, like an old man who has taken a second wife, offers subsidies for any thing and every thing digging wells in Cuddapah, buying ractors 'or levelling Eastern Ghats; అని చమత్కరిస్తారు.

ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా ఇవ్వవచ్చు.

ఆంగ్ల భాషాభిమానులు, కళాశాలల విద్యార్థులు, అధ్యాపకులు తప్పక జాగ్రత్తగా పఠించవలసిన పుస్తకం. గ్రంథాంతాన చక్కని టిప్పణం కూడా చేర్చివున్నది కాబట్టి పఠనం అంత కష్టం కాదు. త్వరలో తమ మిగతా వ్యాసాలు కూడా శ్రీ ఎన్. రఘునాథన్ ఇదేవిధంగా పుస్తకరూపంలో ప్రచురిస్తే బాగుంటుంది.

—శ్రీ—

## గపహార రుద్రదేవి కవి

[రచయిత: శ్రీ అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి; పుటలు: 92; వెల: రెండు రూపాయలు; ప్రాప్తిస్థానం: సాహిత్య సంసత్, జనగామ, వరంగల్ జిల్లా.]

అదేమి దైవ దుర్విలసితమో తెలుగులో పలువురు పూనుకుంటేనే కాని భారత రామాయణ భాగవతాలు పూర్తికాలేదు. రామాయణాన్ని నలుగురు—భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు—పూర్తిచేశారు. వీరిలో భాస్కరుడు

# గ్రంథ విమర్శనము

హుళక్కి భాస్కరుడా, మంత్రి భాస్కరుడా, అనే చర్చ చాలకాలం జరిగింది. తుదకు ఇద్దరూ వేర వేరని నిర్ణయమైంది; హుళక్కి భాస్కరుడే ఈ రామాయణ రచయిత అనీ నిర్ధారణమైంది. ఇక మల్లికార్జునభట్టు "ఇది శ్రీ మదష్ట భాషాకవి మిత్రకుల పవిత్ర భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన" అని చెప్పుకోవడంవల్ల ఇతడు హుళక్కి భాస్కరుని కుమారుడై ఉంటాడని ధ్రువపడింది.

"అమర హుళక్కి భాస్కర మ
హాకవి చెప్పగనున్న యుద్ధకాం
డము తెగువాయి చెప్పి ప్రక
ట ప్రతిభాషణు డప్పలార్య స
త్తము సుతు డయ్యలార్యుడు కృ
తస్థితి వార్యులు మెచ్చునట్లుగా"

అని అయ్యలార్యుడు యుద్ధకాండాంతంలో చెప్పుకోవడంవల్ల అతనిని గురించిన అనుమానమేమీ లేకపోయింది. ఇక మిగిలినవాడు కుమార రుద్రదేవ కవి.

ఇతడు అయోధ్యాకాండ రచించాడు. అయోధ్యాకాండాంత గద్యంలో "ఇది సకలకళా విశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వతధట్టబాణ నిశ్శంకవీర మారయకుమార కుమారరుద్రదేవ ప్రణీతంబైన" అని ఇతడు చెప్పుకున్నాడు. ఈ అయోధ్యాకాండకర్త అయిన కవి యెవరు, మారయ యెవరు— అన్న విచారణ చేసినవారులేరు. శ్రీ అనుముల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఈ ప్రశ్నలను కూలంకషంగా చర్చించి కుమార రుద్రదేవుడు రుద్రమదేవి రాజ్యపరిపాలనలో యువరాజుగా ఉన్న ద్వితీయ ప్రతాపరుద్ర చక్రవర్తేనని, సాహిణిమారన రుద్రమదేవి సేనాపతులలో ఒక్కడు, ఆమెకు ఇల్లటపు అల్లుడు, ప్రతాపరుద్ర నరపతి జనకుడు అయినవాడేనని సిద్ధాంతీకరించారు.

స్వర్గీయులగు శ్రీ శాస్త్రిగారిని ఎరుగని తెలంగాణా సారస్వత ప్రియులుండరు. వారు కవులు, విమర్శకులు, పండితులు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారితో కలిసి పరిశోధనలు జరిపినవారు. అన్నిటినిమించి నిరాడంబర జీవులు, తెలంగాణా పునరుజ్జీవకులలో ఒక్కరు. శ్రీ శాస్త్రిగారు తమసిద్ధాంతాన్ని అపరిహార్యమైన వాదపటిమతో స్థాపించారు. వీరివాదంలోని ప్రధానాంశాలివి:

కుమారశబ్దం యువరాజత్వం ప్రకటించే బిరుదు. "యువరాజస్తు కుమారో భర్తృదారకః" అని నిఘంటువు ఉద్ఘోషిస్తున్నది. "రాజా భట్టారకో దేవః—అనిఃదా నిఘంటువు. కుమార శబ్దపూర్వకమును, దేవశబ్దాంతమును నైన రుద్రనామము రాజకుల సాధారణమైనది కాని అన్యము కాదు."

1291 జూన్ నెలలో వేయబడిన పానుగంటి శాసనంలో 'కుమార రుద్రదేవ మహారాజులు' అనిమాత్రం ఉండటం, తర్వాత 1293 ఏప్రిల్ నెలలో వరంగల్ జిల్లా గణపవరంలో వేయబడిన శిలాశాసనంలో "శ్రీను మన్మహామండలేశ్వర ప్రతాపకుమార రుద్రదేవ మహారాజులు" అని కుమారపదానికి ప్రతాపబిరుదం చేర్చడం, పిదప 1300 సెప్టెంబర్ నాటి అలంపూర్ శాసనంలో "శ్రీమతు కాకతీయ ప్రతాపరుద్ర మహారాజులు" అని కుమారపదం విసర్జించటం పరిశీలించగా, అసలుపేరు రుద్రుడని మాత్రమే ఉండి, మాతామహి అయిన రుద్రమదేవి రాజ్యకాలపు చివరిరోజులలో యువరాజై, రాజ్యార్థ కార్యనిర్వహణతో ప్రతాపబిరుదాంచితుడై, కొంతకాలానికి స్వతంత్రుడై ప్రతాపరుద్ర దేవుడనే ప్రఖ్యాత నామధేయం వహించినట్లు తోస్తుంది.

సాహిణిమారుడు సాధారణుడైన గుర్రపువాడు కాడు. 'సాహిణి' శబ్దం అశ్వసైన్యాధ్యక్షుడైన మంత్రిని సూచించేది. 'నిశ్శంకవీర' బిరుదం అప్పటి వీరులు రాజుల నుంచి పొందుతున్న అపూర్వ బిరుదం. సోమదేవరాజీయాన్నిబట్టి మారన అశ్వాధికారిగా కాకతీయాస్థానంలో ఉన్నట్టు తెలుస్తుంది. మారయ సాహిణి పలనాటిశాసనంబట్టికూడా ఇది నిర్ధారితమౌతున్నది. భాస్కరుని, కుమార రుద్రదేవుని పద్యాలను బట్టి, చాటువులనుబట్టి మారన్న మహావీరుడు, మన్మథ సుందరుడు, దానకర్ణుడు అనటం రూఢమవుతుంది. వేములవాడ భీమకవి చెప్పిన

"చక్కదనంపు దీవియగు
సాహిణిమారడు మారుకైవడిం
జొక్కపుటంగజుండు చల
ముం బలముంగల యాచళుక్యపుం
జొక్కనృపాలు డుగ్రుడయి
చూడ్కుల మంటలురాల జూచినన్
మిక్కిలి రాజశేఖరుని
మీదికిబోయిన రిత్తపోవునే"

అనే తిట్టు చాటువునుబట్టి, ఇతర చరిత్రాధారాలు బట్టి మారన్న కరీంనగర జిల్లాలోని రామగిరిపాలకుడు, దేవగిరి యాదవరాజ మిత్రుడుఅయిన చాళుక్య చొక్కరాజుతో పోరాడి మరణించి ఉంటాడు. ఈతడు బుద్ధయకుమారుడని, కొండమాంబా కుమారుడని అయో

ధ్యాకాంక్ష రచయిత తెలిపారు. కనుక మారన అనామకుడు కేమీకాదు. రుద్రమదేవి భర్త వీరభద్రుడు చాళుక్యరాజు కావడంవల్ల ఆమె [illegible] చాళుక్యులు పుట్టినింటివారు అవుతారు. కనుక మారనను చాళుక్య వంశంవాడు కాదు.

ఇక భాస్కరుడు ఒక్క అరణ్యకాండం, యుద్ధకాండంలో కొంత రచించినా గ్రంథం యావత్తూ అతని పేరే రావడానికి కారణం భాస్కరుడు ప్రతాపరుద్రాస్థాని. "సకల సుకవి జనవినుత యశస్కరుడు." వయస్సు చెల్లినవాడు. రామాయణంవంటి బృహత్కావ్యం ఒక్కరితో ముగియదని తన కుమారుడైన మల్లికార్జునునికి కొంత, యువరాజదశలో శిష్యుడుగా బహుశ ఉన్న రుద్రదేవునికి కొంత పంచియిచ్చి తాను కొంత రచించి ఉంటాడు. ఇది సులువుగా చేసినా, అంతకుముందు రంగనాథ రామాయణం ద్విపద ఉండడం, ఎర్రాప్రెగ్గడ రామాయణమూ ఉండడంవల్ల తర్వాతివారు దీనిని భాస్కరుని పేర వ్యవహరించి ఉంటారు

ఈవిధంగా శాస్త్రిగారు కుమార రుద్రదేవకవి ప్రతాపరుద్ర దేవుడేనని, మారన సాహిణి ఆయన తండ్రి అని నిరూపించారు.

శాస్త్రిగారు సప్తతి పూర్తిచేసి, ఇటీవలే పరమపదించారు. వారు జీవించివుంటే ఇలాటి అపూర్వ పరిశోధన గ్రంథాలు ఎన్నో వెలువడేవి. సాహిత్య చరిత్రకారులకు, పరిశోధకులకు అత్యంతోపయోగకరమైన ఈ పరిశోధనగ్రంథాన్ని ప్రచురించిన 'సాహిత్య సంపత్' జనగామ — వారు అభినందనీయులు.

## శ్రీ కామధేను గానామృతం
### (ద్వితీయ భాగం)

తెలుగు గడ్డపై తమిళులు అడుగుపెట్టారు; కొంతకాలానికి తమ మాతృభాష నే మరచిపోయారు. బుందేల్ ఖండంనుంచి క్షత్రియులు వచ్చారు. మనలో నే పోయారు. కాయస్థులు వచ్చారు. తమభాష మరచి మనభాష నేర్చుకొని మనకన్నా పెద్ద తెలుగుపండితులయారు. కాని, మనం మాత్రం ఎక్కడికి వెళ్లినా మనభాషను, సంస్కృతిని వదలం. అదే మన విశిష్టత దానికి తార్కాణం నేటి దక్షిణాది తెలుగువారందరూను. అలాటివారిలో ఒక్కరు తూత్తుకుడి వాస్తవ్యులైన శ్రీ కేశవపల్లి సేతురామయ్యగారు.

ఈయన సంగీతంలో అభిరుచి కలవారు. చక్కని కృతులు రచించారు తెలుగులో. వాటిని- సంగీతం ప్రధానంగనుక- తమిళుల ఉపయోగంకోసం తమిళులో నే ముద్రించారు. అలాటి 39 కీర్తనల సంపుటే ఈ 'శ్రీ కామధేను గానామృతం.'

దీనిలో మొదట కీర్తనలు, తమిళంలో తాత్పర్యం, తర్వాత ఆంగ్లంలో అనువాదం ఇచ్చారు. మచ్చుకొక కృతి:

రాగం : మలయమారుతం — తాళం: జంప

నెనరుంచి బ్రోవరాదా!
నెర నమ్మినవాడ గాదా? ప.
కనకశైలముపై నెలయు నీ
మనసుకు తెలియని దేమున్నది? అను. ప.
ఘన పాపప్రపంచమున ఈ
మనసు శాంతి బొంద చాలదా?
కనికరింపవే దినవు నన్ను
వనిత కామధేను సన్నుతదేవి.

నాడుకాని నాడులో ఉండి, మాతృభాషకు, కర్ణాటక సంగీతానికి సేవచేస్తున్న శ్రీ సేతురామయ్యగారు ప్రశంసాపాత్రులు.

పుస్తకం పుటలు: 49. వెల: రూపాయి, ప్రాప్తిస్థానం: గ్రంథకర్త, 9[illegible], గ్రేట్ కాటన్ రోడ్, తూత్తుకుడి.

# గ్రంథ విమర్శనము

## పండితరాజ పంచామృతము

[రచయిత: డాక్టర్ బూర్గుల రామకృష్ణరావు గారు. పుటలు: డెమ్మీ 169. వెల: 2-50. ప్రాప్తి స్థానం: ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాదు.]

ప్రాచీనార్థశాస్త్రాచార్యులు పేర్కొన్న పరిపాలకుల అర్హతలలో బహుభాషా పాండిత్యం, వివిధ లిపి పరిశీలన పాటవం లేకపోలేదు. నిజానికి పరిపాలకుల కివి పరిపాలన కళానైపుణ్యంతో సరిసమానంగా తూగగల మేలుగులో ఉండాలన్నా తప్పులేదు. తెనుగు మాట తెన్నాడుకంతా చాటగా ఉన్ననాడు మన పరిపాలకుల పాలన ప్రౌఢిమ, మహామంత్రుల మంత్రమహిమ అలాటివి.

"అన్నయ మంత్రి శేఖరుడ
హమ్మదుషా సవదాన భూమిభృ
త్సన్నిధికి న్నగిన్ సముచి
తంబుగ వేమ మహీసురేంద్ర రా
జోన్నతి సంతతాభ్యుదయ
మొందగ బారసిభాష వ్రాసినన్
గన్నుల పండువై యమరు
గాకితమందలి వర్ణపద్ధతుల్ –"

అని శ్రీనాథుడు వేమభూపాల మంత్రివరేణ్యుడైన అన్నయను వర్ణించాడు.

డాక్టరు బూర్గుల రామకృష్ణరావుగారు హైదరాబాదు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఈ అన్నయ్య మంత్రిని తలపించేవారు. ఇప్పుడు కేరళ పాలకులుగా, అన్నిటా కృష్ణరాయలను తలపిస్తారు. (బహుభాషాకోవిదుడైన కృష్ణరాయలు-'దేశభాషలందు తెలుగు లెస్స' అన్న అభినివేశంలోనే 'తమిళ్ తంగం' అని, 'కన్నడ కస్తూరి' అని, 'మలయాళం మణిప్రవాళం' అని ముక్తకంఠంతో అన్నాడు.) రావుగారి మూర్తి చిన్నదైనా కీర్తి బహు దొడ్డది. వీరికి వచ్చినన్ని భాషలు నాడు, నేడుకూడా ఏ ప్రధానికీ, ఏ పరిపాలకునికీ రావని ఘంటాపథంగా చెప్పవచ్చు. తల్లిభాషైన తెనుగు, తెనుగు తోబుట్టువైన కన్నడం, వైష్ణవ సంప్రదాయంతో విధిగా వచ్చిన తమిళం, పాలనావశ్యకతతో వలచి వచ్చిన మలయాళం, తెనుగుపదజాలాన్ని ఎంతో కొంత సొంతం చేసుకున్న మరాఠీ, జాతీయభాష వివన హిందీ, హిందీకి సవతి చెల్లెలైన ఉర్దూ, ఉర్దూను ముంచెత్తడానికి అనుపదం ప్రయత్నించిన ఫార్సీ, ఫార్సీతో పాటు ఇస్లాం అలజడిలో వచ్చిన అరబ్బీ, విశ్వవిజయానికి పూనుకున్న ఇంగ్లీషు, ఎన్ని ఆటుపోట్లు వచ్చినా చెక్కుచెదరని సంస్కృతం-అహమహమికతో నాలుకచివర నాట్యమాడే దేశభాషా విశారదులు వీరు. హైదరాబాదు శాసనసభలో ఎవరు ఏభాషలో ప్రశ్నిస్తే వారి ఆ భాషలో సమాధానం చెబుతూ "ఇంతింతై వటుడింతయై"లాగ చూస్తూ చూస్తూనే త్రివిక్రము డయ్యేవారు వీరు. ఇంతటి సారస్వత పాథోధినుంచి వెలువడినదే ఈ "పండితరాజ పంచామృతం."

ఇది జగన్నాథ పండితరాయలు వ్రాసిన లహరీ పంచకానికి [లక్ష్మీలహరి, కరుణాలహరి, సుధాలహరి (సూర్యస్తవం), అమృతలహరి (కాళిందీ స్తవం), పీయూషలహరి (గంగా స్తవం) ఈ ఐదింటికి] అనువాదం. వీటిలోని పీయూషలహరిని ఇదివరకు శ్రీయుతులు తిరుపతి వేంకటకవులు, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి, పండితారాధ్యుల నాగభూషణకవి, మోచర్ల రామకృష్ణకవి, పింగళి లక్ష్మీకాంతం గార్లు అనువదించారని ఈ పంచామృత పీఠికలో శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు తెలిపారు. అమృతలహరిని శ్రీ కొమాండూరు కృష్ణమాచార్యులు తెనిగించారు. సుధాలహరిని శ్రీ దివాకర్ల వేంకటావధాని తెనిగించారు ఇటీవలనే.

డాక్టర్ రామకృష్ణరావుగారు "ముద్రితములైన మూలపాఠములందు గొన్ని యచ్చుతప్పులని తోచిన వానిని" సవరించి అనువదించారు. అనువాదం మూలవిధేయంగాను, తెనుగు మూలమే అనిపించేటంత మధురంగాను ఉంది. వారు చేసిన సవరణలు ఇవి:

లక్ష్మీలహరిలో 15వ శ్లోకం మూడో చరణంలో "లసజ్జాను జ్యోత్స్నాతరణి పరిణద్ధం" అన్న వాక్యంలోని తరణి అనే పదానికి సరణి అని సవరణ. ఈ శ్లోకంలో కవి జలధిజ ఊరుయుగ్మం వర్ణించాడు. అది వెన్నెల వెలుగు వన్నెల తీరుతో రూపొందిందట. సను లేఖకుడు పొరపాటుతో తగా వ్రాసిఉంటాడు. దేవనాగరిలో ఈ పొరపాటుకు అవకాశం ఉంది. చక్కని సవరణ.

లక్ష్మీలహరిలోనే 22వ శ్లోకంలో "మమ స్వాంతధ్వాంతం కిమపి చ నితాంతం గమయతు" అన్న పాదంలోని గమయతును శమయతుగా సవరించారు. దేవనాగరిలో గశలు వ్రాయడంలో పొరపాటు సహజం.

కనుక సవరణకూడా సహేతుకమే. కాని గమయతు అనే క్రియకు 'పోయేటట్లు చేయని' అని అర్థం చెప్ప వచ్చును గనుక గమయతు అని ఉన్నా తప్పులేదను కుంటాను.

సుధాలహరి 16 వ శ్లోకంలో చేసిన సవరణలు చాలా ఔచిత్యమైనవి. "నవ్యంతానాం మతిస్యం త్రిగుణ మయుతి స్వా యస్త్రిగూణాం తురీయం" అనే పాదంలో నవ్యంతానాం అన్నదానిని త్రయ్యంతానాం అని దిద్దారు. దానితో శ్లోకానికి తెరిచినట్లయి శ్లోకానికంతా వెలుగు వచ్చింది. దేవనాగరిలో నవ్య త్రయ, య్యకు త్యకు గల పోలికతో ఈ లేఖక ప్రమాదం ఏర్పడి ఉంటుంది. సవరణతో వేదాంతాలకుకూడా తర్కింపరానిది అన్న చక్కని అర్థం కుదిరింది. కాని ఈ పాదంలోని "త్రిగుణమయుతి స్వా యత్త్రిగూణాం తురీయం" అన్న వాక్యానికి "సత్త్వముఖ్య గుణతం దగు మూర్తులు మూటి కవ్వలై" అని అనువాదం. త్రిమూర్తులకు ఉన్నది ఒక్కొక్క గుణమే. భానుతేజం త్రిగుణమయం కావడంవల్ల త్రిమూర్తులకు అతీతంగా తురీయమూర్తి అయిందనే మూలభావం అనువాదంలో స్పష్టం కాలేదు.

సుధాలహరిలోని 30 వ శ్లోకం తప్పులకుప్పగా ఉన్నదని కావ్యమాలవారే సవరించడం వదులుకొని, రెండవపాదం "నిన్యుఃకేప్యాసనార్థం ఖలుసమాచర తం నేత్రయోః పుండరీకం" అని ముద్రించారు. డాక్టరు రావుగారు కప్యాసనాభం అనే పాఠాంతర పరిశీలించి "కప్యాస మార్ప్యః" అని పాండిత్యస్ఫోరకమైన గొప్పసవరణ చేశారు. అనువాదకుని మనవిలో ఈ సవరణ చేయడానికి గల కారణాలను చర్చించారు. ఛాందోగ్యానికి ఆనందగిరి టీకను ఉదాహరించారు. కప్యాసంఅన్న పదార్థంపై పెద్దగాథే ఉంది. రామానుజులు విశిష్టాద్వైత ప్రచారానికి పూనుకోనకముందు యాదవప్రకాశులవద్ద శిష్యులుగా ఉన్నప్పుడు 'కప్యాసం పుండరీకాక్షం' అన్న వాక్యం వ్యాఖ్యానిస్తూ గురువుగారు కపిపృష్ఠం అని కప్యాసానికి అర్థం చెప్పగా, రామానుజులు చెవులు మూసుకుని, కం పిబతీతి కపిః సూర్యః, తస్య ఆసం అని సవరించినట్లు చెబుతారు.

డాక్టర్ రావుగారి అనువాదానికి ఒక్క మచ్చుతునక:

కీలాలైః కుంకుమానాం నిఖిలమపి జగ
  జ్జాల మేత న్నిషిక్తం
ముక్తాశ్శోచన్న తథ్యంగా విదలిత కమల
  క్రోడ కారాగృహేభ్యః,
ఉత్సృష్టం గోసహస్రం బహుల కలకలః
  శ్రూయతే చ ద్విజానాం
భాగ్యైర్బృందారకాణాం హరి హయ హరితా
  మాయతే పుత్రరత్నం.

తెనుగు:

అది జగమెల్ల గొంకుమర
  సాంచితధారల సిక్తమయ్యెనా
విదలిత పద్మబంధములు
  వీడి విముక్తములయ్యె తుమ్మెదల్
వదలెను గోగణమ్ము ద్విజ
  వాక్కలనాదము సంకులించె దిక్
త్రిదశుల భాగ్యమా సుతుడు
  దిన్మణి ప్రాక్సతియందు బుట్టగన్.

గ్రంథం చివర మొదటి అనుబంధంలో శ్లోక ప్రతీకానుక్రమణిక, రెండవ అనుబంధంలో పద్య ప్రతీకానుక్రమణిక, మూడవ అనుబంధంలో ఇంగ్లీషులో మూలానువాదాల బిబ్లియోగ్రఫీ ఇవ్వబడ్డాయి.

అనువాదకులు డాక్టరు రావుగారు, వారి షష్ట్యబ్ద పూర్త్యుత్సవ సందర్భంలో ఈ గ్రంథం ప్రచురించిన ఆంధ్ర రచయితల సంఘంవారు అభినందనీయులు.

రా. చ.

## పశ్చాత్తాపము

[రచయిత: డాక్టర్ నేలటూరి వేంకట రమణయ్య. ప్రకాశకులు: విద్యాసాగర్ కార్పొరేషన్ (ప్రైవేటు) లిమిటెడ్. పుటలు 103. మూల్యం రూపాయి.]

"ఆపద బాపి ప్రాపయిన యన్నకు ప్రత్యుప కారమూనగా కా పురుషుండు కోరు........" అని ఉత్తర రామాయణంలో ఉన్నది. ఆలాంటి మహోపకారికి అపకారం చేసినవానిని ఏమనాలో చెప్పలేను. ప్రాణదానంచేసి కంటికి రెప్పలా కాపాడి సామ్రాజ్యం కట్టబెట్టి చిరంతనమైన యశస్సు సమకూర్చిన మహోదారుని కన్నులు పెకలించిన వ్యక్తి ఎంతటి పాషండుడు? మానవులలో లెక్కించదగునా? ఇంతటి దారుణానికి ఒడిగట్టినది కృష్ణదేవరాయలే గాని అన్యులు కారు. కృష్ణరాయని స్మరించి గర్వించి పులకించే

# గ్రంథ విమర్శనము

తెలుగుజాతి రాయల అపరాధాన్ని మన్నించలేదు. రాయల కీర్తిచంద్రికలు ఈ కళంకాన్ని మరుగుపుచ్చలేకపోయినవి.

నేరానికి శిక్ష తప్పదు. కాని ధర్మరక్షకుడైన రాజే అధర్మానికి ఒడిగట్టితే శిక్షించేవారు ఎవరు? ఐనా శిక్ష లేకపోలేదు. అంతరాత్మ విధించే శిక్ష ఇది. ఇది రాజు విధించగలిగిన శిక్షలన్నిటికన్న దారుణమైనది. రాయలవారు ఈలాంటి శిక్షకు పాత్రులుకాక తప్పలేదు. దానితో రాయల పాపానికి నిష్కృతి లభించినది. ఈ నిష్కృతి విచిత్రంగా లభించినది 'పశ్చాత్తాపము' హృదయంగమమైన విధంగా వివరిస్తున్నది.

వీరనరసింహరాయుల ఆజ్ఞ ధిక్కరించి కృష్ణదేవరాయల కౌమాడి సామ్రాజ్యాభిషిక్తుని జేసినాడు మంత్రి తిమ్మరుసయ్య. కృష్ణదేవరాయలకు పట్టమహిషి తిరుమలదేవివలన కలిగిన తిరుమల దేవరాయలు బాల్యంలోనే మృతిచెందినాడు. తిమ్మరుసయ్య ఆ బాలునికి విషము పెట్టించి చంపించినాడనే యపవాదు నమ్మి తిమ్మరుసయ్యను చెరసాల త్రోసినారు రాయలు. కన్నులు పెకలించినారు తిమ్మరుసు కుమారుడు తిమ్మదండనాయకుని కూడా బంధింపగా అతడు చెరసాలలోనే ప్రాయోపవేశముచేసి ప్రాణము విడిచినాడు. తిమ్మరుసయ్య మాత్రము రాయల అనంతరమువరకు జీవించినాడు.

చివరికి రాయలవారు ఆత్మసాక్షిగా వాస్తవము తెలుసుకొని తిమ్మరసయ్యను అర్థించి క్షమాభిక్షపొంది పశ్చాత్తప్తహృదయులై పరితపించినారు.

సహజంగానే విజయనగర సామ్రాజ్యచరిత్రపట్ల మహాసక్తి కలిగిన తెలుగువారు ఈ పుస్తకాన్ని ఆదరించగలరు. కథాసంవిధానము, ఆవేశముతో కూడిన రచనాపద్ధతి, కథాసంవిధానానికి తగిన నడక, సజీవమైనభాష ఈ ఆసక్తిని పోషించగలవనడంలో సందేహం లేదు.

ఒక్కమాట. ఇంతవరకు తెలుగు సాహిత్యంలో చారిత్రకమైన కథలు లేవనడం సబబుకాదు. అన్నివిధాలా చారిత్రికములనడానికి అర్హమైన కథలే ఉన్నవి. కేవల చరిత్రజ్ఞానము కలిగినవారు కల్పనాశక్తి లేకుండా కథలు రచింపశక్తులు కారు. చారిత్రిక జ్ఞానమునకు తగిన కల్పనాశక్తికూడా కథారచనకు అవశ్యకమని చెప్పక తప్పదు. లేకపోతే ఇప్పటి కథే రక్తికట్టి ఉండేదికాదు. శ్రీ రమణయ్యగారు ఇంకా ఈలాంటి కథలు రచించి సాహిత్యానికి కూడా ఇతోధికమైన సేవ చేయగలరని ఆశిస్తున్నాను.

— కామరాజు.

## ధ్రువ విజయము

[రచయిత: శ్రీ వంగీపురము కృష్ణమాచార్యులు, పుటలు: 1[illegible]. వెల: మూడురూపాయలు. ప్రాప్తిస్థానం: శ్రీ వి. రామన్, 59 జనరల్ ముత్తయ్యమొదలి వీధి, సాహుకార్పేట మదరాసు 1, లేక శ్రీ ఎస్. ఎస్. రామన్, మురళి, పచ్చైయప్ప హాస్టల్ రోడ్డు, సేతుపట్టు, మదరాసు-10.]

ప్రాచీన వస్తువును రూపకీకరించి నేటి సహృదయులను మెప్పించడం కష్టం. కాని శ్రీ కృష్ణమాచార్యులు ధ్రువచరిత్రను ఎనిమిదంకాల నాటకంగా ప్రాచీన సంస్కృత నాటక లక్షణానుసారంగా వ్రాసి కృతకృత్యులయ్యారు. వస్తువును భాగవత, విష్ణుపురాణాలనుంచి తీసుకున్నారు. ధ్రువుని తపస్సుకు విఘ్నం చేయడానికి ఇంద్రుడు రంభాద్యప్సరసలను పంపడంలోని అనుచితత్వాన్ని గుర్తించి విష్ణుపురాణానుసారంగా మాయా సునీతి పాత్రను కల్పించారు. ఒక గంధర్వుడు సునీతి రూపంతో వచ్చి బెదరుచూపి తపస్సునుంచి అతని మనస్సును చెదరేటట్లు చేశాడు. ఈ మార్పుతో నాటకానికి ఎంతో అందం వచ్చింది. ఉపోద్ఘాతంలో శ్రీ అనంతకృష్ణశర్మగారన్నట్లు "ఈరచన ఒడుదుడుకులులేక నటనపఠనములు రెంటికిని అనుకూలముగా పద్యగద్యములను ఆపాతమధురముగా నడపినది."

నాటక లక్షణాలను రచయిత గ్రంథపరిచయంలోను, అనుబంధంలోను వివరించారు. ప్రాచీన నాటకస్వరూపం తెలుసుకోవడానికి ఇది చాల తోడ్పడుతుంది. తపోనిష్ఠుడైన ధ్రువునికి నారాయణుడు ప్రత్యక్షమయిన ముఖచిత్రంతో నాటకం చక్కగా ఉంది.

## గ్రంథ స్వీకారము

### నన్నెచోడుని కవిత్వము

రచయిత: శ్రీ వేదము వెంకటరామశాస్త్రి పుటలు: 250. వెల: రూ 6. ప్రాప్తిస్థానం: వేదము వేంకటరామశాస్త్రి అండ్ బ్రదర్స్, 4. మల్లికేశ్వరస్వామిగుడి సందు, లింగిచెట్టివీధి మదరాసు_1

### గణేశ్వరీయము

రచయిత: శ్రీ కన్నెపల్లి సాంబశివ రఘురామస్వామి. పద్యకావ్యం. పుటలు: 174. వెల: 2 రూపాయలు.

# మనవి మాటలు

మౌలికతను మదింపు వేయడం కష్టమే. దానిని మదింపు వేయడానికి సూక్ష్మతర పరిశీలన, కొద్దిగా ఔదార్యం ముఖ్యాతిముఖ్యమైన అర్హతలు. అప్పుడే ఆ మౌలికత ఏ రూపంలో ఎంత మోతాదులో ఉందో గుర్తించి గౌరవించడం సాధ్యమౌతుంది.

విశ్వసౌందర్యం మన కళ్ళెదుటే వేయిరేకులుగా విరుస్తుండడం చూచిన తర్వాత కూడా మన కల్పనలు, జల్పనలు మౌలికమైనవనడం వెర్రి కాదూ? ఉషస్సును తిలకించి మన కళాకారుల కుంచెలు వెల వెల బోవూ? అనవరతం ప్రకృతి వినిపించే మధురస్వనాలకు మన గాయకుల గొంతులు గడ్డకట్టిపోవూ? కాలం తెలిపే కఠిన సత్యాలకు మనకవుల, ద్రష్టల దృష్టి జిగేలు మనదూ? అనుక్షణం, అనులిప్తం పుట్టుకువచ్చే ప్రాణికోటి మన శాస్త్రజ్ఞులకు సవాలు కాదూ? క్రమం తప్పక తిరిగే గ్రహవారం, శింశుమారం మన పరిపాలకులకు పరీక్షగా లేవూ? ఇలా చూస్తూపోతే, అంతా అనుకరణమే, అంతా అనురణనమే, అంతా అనుసరణమే.

కాని, ఆ అనుకరణంలోనే ఉంది స్వీయకరణం; ఆ అనురణనంలోనే ఉంది స్వీయరణనం; ఆ అనుసరణంలోనే ఉంది స్వకీయసరణం. ఈ అనుశీలనం సాహిత్యరంగానికి, అందులోను ఈ శతాబ్దానికి మాత్రమే అన్వయించి చెప్పే కొన్ని పాత్రలను పరిశీలిస్తే వాటిలో పాతపాత్రల పోలికలు, చాలికలు కనిపిస్తాయి. అంతమాత్రాన అవి మౌలికాలు కాకపోవు. గిరీశంలో శకారుడు గిరికీలు కొడుతుంటాడు. మధురవాణిలో వసంతసేన వాణి వినిపిస్తుంది. ప్రతాపరుద్రీయ యుగంధరునిలో కథాసరిత్సాగరయౌగంధరాయణుడు, భాసుని యౌగంధరాయణుడు భాసిస్తారు. అంత మాత్రాన ఇవి వాటికి నకళ్ళనగలమా?

ఇక పరిశోధనరంగంలో ప్రతి సంవత్సరంలోను అనూహితంగా ఉన్న కొత్త విషయాలు పుట్టుకురావు. ఇంతవరకు తెలిసిన విషయాలను పరిశోధకుడు నూతన పద్ధతిలో క్రోడీకరించడమో, క్రోడీకరించిన విషయాలను నూతన దృక్పథంతో వ్యాఖ్యానించడమో, సమన్వయించడమో కూడా మౌలికమైనవే. డబ్బు విలువ సంగతి మానవజాతికి కొత్తదా? "అర్థోస్తు నః కేవలం యేనైకేన వినా గుణాః తృణలవప్రాయాః సమస్తా ఇమే" అని భర్తృహరి రెండువేల యేండ్లనాడే తెలిపాడు. కాని, దానిని కొత్తపద్ధతిలో పరిశీలించి నూతన సిద్ధాంతాలను ఆవిష్కరించి అపూర్వార్థిక వ్యవస్థలకు దారిచూపారు పలువురు.

కవి తను విన్నది, కన్నది, అనుభూతి పొందినదీ కల్పనా భావనా సాధనలతో రంగరించి కవితగా తీర్చిదిద్దితే, పరిశోధకుడు తను క్రోడీకరించినది తర్కానుగతం చేసి పోతపోస్తాడు. కళాకారుడు కన్నది ఒకవడిగా కైవారం చూపి కళకు రూపు కల్పిస్తాడు. అదే అనుకరణ, అదే మౌలికత; అదే అనురణన, అదే మౌలికత; అదే అనుసరణ, అదే మౌలికత.

కనుకనే, మౌలికతను మదింపు వేయడం కష్టం.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.